శ్రీరస్తు శుభమస్తు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

శ్రీః

# శ్రీ ప్రత్యక్షరామాయణము

## ప్రత్యక్ష-ఆత్మానుభూతి రామాయణము

### ద్వితీయ భాగము

రచయిత : ఉభయభాషా ప్రవీణ,

పండిత ఆకుండి సూర్యనారాయణశాస్త్రి

ప్రథమ ముద్రణము - 1000 ప్రతులు

ప్రజోత్పత్తి (మధుమాసము) నిజవైశాఖమాసము

జూన్ 1991



మూల్యము - 50-00 రూప్యములు

సంపాదకుడు - ప్రచురణకర్త

శ్రీ ఆకుండి గోపాలకృష్ణ, బి. కాం.
అసిస్టెంట్ ల్యాండ్ ఆఫీసర్ (టిస్కో),
16, టమారియా రోడ్,
సాక్షి, జంషెడ్‌పూర్ (బీహార్)

ప్రకాశకులు :
శ్రీ ఆకుండి సూర్యనారాయణశాస్త్రి
శ్రీమతి వజ్ఝల భానుమతి. బి. ఏ.
Co/ శ్రీ వి. రమేశ్. బి. ఇ.
డిప్యూటీ, సి. ఎస్. టి. ఇ. (ఎస్. సి. రైల్వే)
రైల్వే క్వార్టర్ నెం : 601/3,
లాన్సెర్ బారక్స్.
సికింద్రాబాద్ - 500 026,



ముద్రాపకులు :
M/s. ఆర్. కె. ప్రింటర్స్,
నాంపల్లి, హైదరాబాద్ - 500 001.

## కృతజ్ఞతాభివందనములు

ఈ గ్రంథము
శ్రీ శ్రీ శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి
ఆర్థిక సహాయమున ముద్రితము
వారికి
మా హృదయపూర్వకమైన
కృతజ్ఞతాభివందనములను
అందఁజేయుచున్నాఁడను.



This book
is published with the financial
assistance from
SRI TIRUMALA TIRUPATI DEVASTHANAMS
under the scheme - Aid to publish
Religious books

కృతికర్త దంపతులు



శ్రీ ఆకొండి సూర్యనారాయణశాస్త్రి - శ్రీమతి విశాలాక్షి

# (కృతిభర్త) - కృతినాయకుఁడు



శ్రీ రామచంద్రప్రభుపు

శా॥ సత్యశ్రీ పరిపాలకా! ప్రభు! భవత్సత్ప్రేరణాశక్తిచే
ప్రత్యక్షంబుగ నిన్నుఁగాంచుచెద నీ ప్రత్యక్షరామాయణం
బత్యంతాదుల భక్తిఁ వ్రాసితిని రామా! దీనికైకో నిదె
నిత్యశ్రీకరమై తనర్చుత మహిన్! సిదివ్యగాత్రిసున్

# సుందరకాండము-విషయసూచిక

## యుద్ధకాండము - విషయ సూచిక

క.  తదిగిణ తణాంగు తద్ధిం
తదిగిణ ధింధిం మృదంగ తాళధ్వనులన్
మృదుపద విన్యాసమ్ముల
మదిరాక్షుల లాస్యమెసగె మంజీరరుతిన్.  721

---

గమనిక :- యుద్ధకాండమున – 721 పద్యమునకు బదులు ఈ పై పద్యమును ఆ స్థానమున చదువవలయును.

ఆ. సూర్యనారాయణశాస్త్రి

శ్రీః

# శ్రీ ప్రత్యక్ష రామాయణము

## ప్రత్యక్షాత్మానుభూతి రామాయణము

## సుందరకాండము

---

శ్లో. "నమోస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యై చ తస్యై జనకాత్మజాయై,
నమోస్తు! రుద్రేంద్ర యమానిలేభ్యో
నమోస్తు! చంద్రార్క మరుద్గణేభ్యః."

(శ్రీమద్రామాయణము)

క. లీలామానుష! సీతా
లోలా! బ్రహ్మాది దివిజలోకస్తుత్యా!
వేలాతిగగుణ! మాయా
జాలావృత సర్వలోక జాలా! రామా! 1

క. తదుపరికథ వినిపించెద
సదమల సుచరిత్ర! అమరసన్నుతగాథా!
మృదుమధురోక్తులు నాదగు
హృదయంబున నిలిచి పలుకవే రఘునాథా! 2

## హనుమంతుఁడు సముద్రమును లంఘించుట

సీ. శ్రీరామ ! నిన్ను సచ్చిత్తంబు నందుంచి
మహితసద్భక్తి నమస్కరించి
శ్రీవానరేశు సుగ్రీవు నెమ్మదినెంచి
అంగదాదులకెల్ల అంజలించి
మాహేంద్రగిరి సమారోహంబు గావించి
అంబరంబంట నంగంబుఁ బెంచి
వాలంబు దిక్చక్రవాళంబునకు మించి
పరమభక్తిని తండ్రి పవను గొల్చి
కరము భక్తిని దిక్పాలవరులఁ దలచి
రామ ! త్వన్ముద్ర నెమ్మి శీర్షమున నుంచి
"వమ్ము వోవని రాముశరమ్ము వోలె
వార్ధి లంఘింతు"నని లేచె వాయుసుతుఁడు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 3

గీ. అంఘ్రియుగ్మమ్మునన్ మహేంద్రాద్రి ద్రొక్కి
కంఠమున్ జాచి మిగుల నంగమ్ము పెంచి
వాల మల్లార్చి కడఁక నవ్వాయుసుతుఁడు
కించిదంగమ్ము వంచి కుప్పించి యెగసె. 4

సీ. పాదఘాత మహేంద్రపర్వతశిఖరంబు
పాతాళకుహరమ్ము లోతు లరయ
ఊరు వేగోన్మూలి తోర్వీజ నికరమ్ము
తనతోడ పెన్త్రోవ ననుసరింప
ఘనవాల తాడన స్ఖలిత పాషాణముల్
జలరాశిగర్భమ్ము శరణు వేడ

నిజసింహనాదాతినిష్ఠుర నినదమ్ము
దిగ్గజశ్రేణికి దిగులు గొల్ప
ఖచరసంఘమ్ము మిపుల దిగ్భ్రాంతిఁ జెంద
వైనతేయుఁడు నాగ నవ్వాయుసుతుఁడు
జలధి లంఘించె నల పియచ్చరులు మెచ్చ
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 5

## సముద్రుఁడు హనుమంతునకు ఆతిథ్యము గావింపుమని మైనాకుని గోరుట

మ. వినువీధిన్ జనుచున్న వాయుతనయున్ వీక్షించి అంభోధి రా
ముని కార్యార్థము సీతఁ దేగెడిని రాముండెన్న నారాయణుం
డనఘుం డాతఁడు సాగరాన్వయమునం దావిర్భవించెం గదా!
తన జన్మస్థితికెల్ల సాగరులె కాదా కారణం బెన్నఁగన్. 6

క. కావున రాముని దూతకు
గావించెద నతిథిపూజ- కాక యుపేక్షా
భావంబున నుండిన నను
భావించదె జగము దుష్టభావునిఁ దనుచున్. 7

క. అని తనలోఁగల మైనా
కుని గాంచి నగేంద్రతనయ ! కూరిమితో నా
హనుమంతున కాతిథ్యము
ఘనముగ గావింపు మనిన కార్యజ్ఞుండై. 8

## మైనాకుని రాక

సీ. గిరిసార్వభౌమసుందరపుత్రరత్నమ్ము
ప్రమథాధిపతి ముద్దు బావమఱది
కోలాహలాహ్వయ కుధరేశు జనకుండు
సుక్తిమతీనదీ సుదతి మామ
ఇంద్రవజ్రాఘాత మెఱుఁగని గిరిరాజు
సిరి గన్నతండ్రికి చెలిమికాఁడు
పాతాళ గురుగుహాద్వార రక్షాదక్షుఁ
డాబాల్యలబ్ధ మహాబలుఁడు
అయిన నగమూర్తి మైనాకుఁ డబ్ధి వెడల
విఘ్నమును జేయ రాక్షసవీఁ డెవఁడో
వచ్చెనని యెంచి శిఖరముల్ ప్రమ్మునేయ
అతఁడు నిజరూపమున నిల్చి హస్తమెత్తి. 9

గీ. నేను మైనాకుఁ డనువాఁడ నీదు జనక
హితుఁడ ఈ వారినిధికి స్నేహితుఁడ నోయి !
రామదూతవు నీకు విశ్రాంతి గూర్ప
అబ్ధి నను బంపె ఆతిథ్య మందుకొమ్మ ! 10

గీ. అజ్ఞభావంబునన్ నిన్ను నరయలేక
తప్పు సేసితి క్షమియించి దయను గనుమ
అనఘ ! ఏగెద రామకార్యార్థ మేను
మార్గమున దూత మసల ధర్మమ్ము కాదు. 11

గీ. పోయి వచ్చెద నని హస్తమునను దాకి
వాయుజవమున నేగె నవ్వాయుసుతుఁడు
దూత ధర్మార్థవిదుఁడు విఖ్యాతబలుఁడు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 12

## సురస అను నాగమాత హనుమంతుని బరీక్షించుట

సీ. సురవరప్రేరణ సురసాభిధాన ఆ
హనుమంతు మతిశక్తి నరయ నెంచి
ఆస్యంబు బెంచి విహాయసంబున నిల్చి
ఆహార మీవు నా కనుచు బలుక
అతఁడు ద్విగుణముగా నంగంబుఁ దగఁ బెంప
ఆమెయుఁ త్రిగుణమాస్యంబు పెంచె
అది గాంచి పావని అంగుష్ఠమాత్రుఁడై
సురసగర్భమ్మును జొచ్చి వచ్చి
తనయుఁడను నీకు ఓ తల్లి ! దయను గనుమ
అనిన హనుమంతు మతిమంతు నరసి సురస
'రామవల్లభ- జానకీరమణి గాంచి
రామకార్యమ్ము సాధించి రమ్ము పొమ్ము'
అనుచు దీవించి ఆ దేవి యరిగె దివికి
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 13

## హనుమంతుఁడు సింహికను నిగ్రహించుట

ఉ. ఆయతపీనబాహుఁడు విహాయసవీధిని నేగుచుండగా
ఛాయనుబట్టి ఆపదగు శక్తిసమన్విత సింహికాఖ్య ఓ
హో యని వార్ధిబింబిత మహోజ్జ్వలమూర్తిని జూచి పేర్చి- ఆ
వాయుజు ఛాయఁ బట్టెను అవారితభీమపరాక్రమమ్మునన్, 14

ఉ. ఏమిది ! నాదు వేగమునె ఎవ్వ రిటాపిరటంచు నెమ్మదిన్
రామ ! స్మరించి నిన్ను జలరాక్షసి నొక్కతె గాంచి యేచి ఆ
భీమబలుండు దాని భుజవీర్యమునన్ విదళించి చంపె- శ్రీ
రామ ! త్వదీయదాసుని సురల్ వినుతించిరి అభ్రవీథిపై. 15

## సముద్ర తరణము

సీ. పాదవేగంబున పాథోధి యుప్పొంగి
విసువీధి తాకి దా విఱిగిపడఁగ
ఊరువేగోద్ధతి ఊర్మిజాలమ్ములు
ఉవ్వెత్తుగా లేచి ఉఱుకు లిడగ
బాహురంహోన్నతి వారిదంబులు విచ్చి
ఆశాంతశిఖరుల నాశ్రయింప
పీనవక్షోవేగపీడిత జలరాశి
అల్లకల్లోలమై అవధు లెగయ
జలధిగర్భస్థ జంతువుల్ కలత చెంద
అబ్ధినిర్మగ్న గిరికోటి అదరి యూగ
వార్ధి లంఘించె నిట్టు లా వాయుసుతుఁడు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 16

గీ. చండరశ్ముల అగ్నివర్షంబు గురిసి
అరుణకిరణుండు అంత అస్తాద్రి చేరె
వాయుజవమున దుర్లంఘ్య వార్ధి దాటి
అంజనానందనుఁడు సువేలాద్రి చేరె. 17

గీ. గగనమున నుండి హనుమ వేగమున దూక
అబ్ధి మునిగెను తత్ సువేలాద్రి నగము
తద్గుహాంతరజంతుసంతాన మడఁగె
భూమి కంపించె దివికి అంభోధి యెగసె
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 18

గీ. బాల్యభావంబుననె ఫలభ్రాంతి జేసి
తన్ను బట్టంగవచ్చె ఈతం డటంచు
భానుఁ డెంతయుఁ దా భయభ్రాంతుఁ డగుచు
పశ్చిమాశాంత గంభీర వార్ధి గ్రుంకె. 19

గీ. దీర్ఘనిశ్వాసమును దీసి దిక్కులరసి
కాంచె నెదుటను దివ్యలంకాపురమ్ము
నిన్ను దలపోసి మది నతులెన్నొ నేసె
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 20

## లంకాపుర వర్ణనము

సీ. పరిఖాయమానాబ్ధి భాసుర సాలాగ్ర
గోపుర చుంబిత గోపురమ్ము
అమరలోకానీత విమలచింతామణీ
రత్ననిర్మిత సౌధరాజితమ్ము
నిర్జిత దిక్పాల నిఖిలవస్తువ్రాత
రత్నభాండాగారరంజితమ్ము
సాధితకౌబేరసర్వతః సంశోభి
పుష్పకాఖ్యవిమానభూషితమ్ము
చటుల చతురంగ బలపూర్ణచత్వరమ్ము
దక్షరాక్షసకోటి సంరక్షితమ్ము
పంక్తికంధర రావణ పాలితమ్ము
కాంచె- కాంచనసాల లంకాపురమ్ము. 21

సీ. నందనోద్ధృతహరిచందనాదిక కల్ప
తరుకోటి శోభితోద్యానవనము
విశ్వకర్మప్రౌఢ విజ్ఞాన నిర్మిత
స్వర్గధిక్కారి సుసౌధగణము

గరుడగంధర్వఖేచరసిద్ధసాధ్యాది
రమణీయ రామాభిరామ గృహము
చతురంగబలనిత్యసంచారసమ్మర్ద
రాక్షసానీకసంరావయుతము
బహుళరథ్యాప్రచార సంభ్రాంతిదమ్ము
తోరణాంచిత ద్వారప్రతోళికమ్ము
రత్నరంజితగోపుర భ్రాజితమ్ము
కాంచె పావని యెదుట లంకాపురమ్ము. 22

క. ఈ నా రూపము గాంచిన
దానవు లేతెంచి నన్ను దండింతురు టో
కానన్ సూక్ష్మపురూపున
దానవపురిఁ జొచ్చి వెదకదగు వైదేహిన్. 23

## సాయంసంధ్య - సందెచీకటి - తోచిన చుక్కలు వర్ణనము

గీ. పసుపు కుంకుమ లంతంత పఱచినట్లు
వెదురుపొద లాకసంబున పరిసినట్లు
అస్తమించిన రవిరశ్మి లాకసమున
విస్తరించెను పడమట పింతకాంతి. 24

గీ. ఇనుని ధాటికి భయమంది ఇరులగములు
పగటివేళల గుహలలోపలను దాగి
అసురసంధ్యను రాత్రినాయకునితోడ
దారిదోపిడి దొంగల దారి వచ్చె. 25

క. వినువీధిని గనుపించెను
కనువిందులు గొలుప కల్పకమ్ములై యటు పూ
చినగతి, సురవనితల్ దీ
ర్చిన ముత్యము ముగ్గులట్లు చిక్కని చుక్కల్. 26

## చంద్రోదయ వర్ణనము

క. కలుములచెలి తమ్ముండును
కలువల చెలికాడు పాలకడలికి కొడుకౌ
చలివెలుగుల దొర వెలువడి
తొలిగుబ్బలి కొలువు దీర్చి తోచెన్ మింటన్. 27

సీ. ప్రాగద్రిసాను వప్రకీడ వచరించు
ఐరావతమ్ము దంతాగ్ర మనగ
పౌలోమి కొప్పులోపల చక్క దుఱిమిన
పారిజాతంపు పుష్పమ్మునాఁగ
మందరగిరిరాజ మర్దిత క్షీరాబ్ధి
ప్రభవమందిన సుధాభాండ మనఁగ
ప్రాచీదిగంగనా ఫాలభాగమ్మున
దీర్చిన కర్పూరతిలక మనఁగ
అమరసౌధగోపురాగ్రమ్మునందున
కాంతులీను వజ్రకలశ మనఁగ
కాల విశ్వకర్మ కరగించి పోసిన
వెండిగుండునాఁగ వెలసె విధుఁడు. 28

## హనుమంతుఁడు లంకిణి భంగపఱచుట

క. లంకన్ జొచ్చెద నని కల
వింకాకృతి దాల్చి చిత్రవేషధరుండై
లంకా ద్వారమ్మునఁ గనె
లంకాహ్వయ నొక్క ఘోరరాక్షసి నచటన్. 29

క. ఆ రాక్షసి అడ్డఁబయి
క్రూరాక్షుల నిప్పు లొలుక రూక్షేక్షణయై
ఓరీ! ఎవ్వఁడవురా!
పోరాదని హనుమ నాపి పొమ్మని కసరెన్. 30

ఆ. సురపురమ్ము వోలె సుందరమై యొప్పు
ఈ పురమ్ము వీధులెల్ల చూచి
మేడ మిద్దె లరసి మెల్లన వచ్చెద
పోవనిమ్ము నీకు పుణ్యమమ్మ! 31

క. ఓరీ వానర! శాఖా
చారుండవు గావు గూఢచారుండవురా!
పోరాదని యెంతయు నే
వారించిన పోవిదేమి వానరచోరా! 32

క. లంకానగరమ్మును నే
లంకాహ్వయ నన్ను గెలిచి లంకం జొరుమా
బింకమ్ముగ నిలిచెదు నీ
పొంకమ్మును నడఁతు నంచు పొమ్మని కొట్టెన్. 33

ఆ. కొట్టినంత హనుమ కోపించి మై పెంచి
ముష్టిఘాతమునను మూలఁద్రోసె
నేలఁ గూలి వికృతనేత్రయై సోలుచు
ఎట్టకేల కతని కిట్టు లనియె. 24

## లంకిణి నాఁడు అజుఁడన్న మాటలను స్మరించుట

ఆ. "రామదూత హనుమ రమణి సీతను జూడ
వచ్చి నిన్ను గెలిచి చొచ్చు లంక
నాటినుండి లంక చేటగు తప్పదు"
అనుచుఁ బల్కె మున్ను వనజభవుఁడు. 25

గీ. సతిని సీతను గొనితెచ్చి సకల దనుజ
కులమునకునెల్ల నాశంబు కోరి తెచ్చె
దాశరథితోడ నిటు విరోధంబు గొనుట
కొఱవితోడుత తల గోకికొనుట గాదె! 36

ఆ. అజునిమాట యెప్పు డన్యథా కాఁబోదు
లంకచేటు తప్ప దింకమీఁద
పోవుదానను హరిపుంగవ నే నింక
శంక దక్కి నీవు లంకఁ గనుము. 37

## హనుమంతుఁడు లంకలోఁ బ్రవేశించుట

గీ. ద్వారమార్గంబు వీడి అద్వారమునను
లంక జొచ్చెద నింక నిశ్శంకవృత్తి
అనుచు చింతించి మదిలోన ననిలసుతుఁడు
రాజనీతిజ్ఞుఁ డౌట కార్యమ్ము తలచి. 38

గీ. శత్రుపురమందు ముందుగా సవ్యపదము
ఉంచవలెనన్న శాస్త్రమ్ము నెంచి యతఁడు
సాలమును దాటి తనదైన సవ్యపదము
శత్రుమూర్ధమ్ము నందుంచు సరణి నుంచె. 39

చ. కరిఘటసంకులంబు తురగప్రచురంబును శస్త్రధారులై
తిరిగెడు క్రూరరాక్షస గతిస్ఫురణంబును స్వర్ణసౌధగో
పురవరచుంబితాంబరము భూరివిశాలసురాజవీధికా
సురుచిర మౌక్తికప్రకరసుందరతోరణశోభితంబునౌ. 40

గీ. లంక వేఁ జొచ్చి తా నకలంక సీత
వెదక బూనెను ఘనసౌధవీథులందు
భూమిగృహముల నారామ భూములందు
మేడలందును మొగసాల మిద్దెలందు. 41

లంకలో హనుమ సీతాన్వేషణము గావించుట

సీ. ధూమ్రాక్షుగృహము, విద్యుజ్జిహ్వగేహంబు
శోణితాక్షునివేశ్మ, సూర్యశత్రు
రశ్మికేతు వికాట రాక్షసగృహములు
మాలి - విద్యున్మాలి మందిరములు
శుకనాస - వక్ర - వృశ్చికరోమ భవనముల్
జంబుమాలి నికుంభ సద్మములను
యూపాక్ష వికట విరూపాక్ష ధామముల్
సర్పరోమ సుమాలి సదనములను
కుంభకర్ణుగృహము కుంభోదరునివేశ్మ
ఇంద్రజిత్తు భవనమెల్ల వెదకి
దావదుఁడును పానశాలలు గాలించి
రాక్షసేంద్రు మందిరమ్ము చరిని. 42

## పుష్పకవిమానమున అన్వేషించుట

గీ. అందు నలువంకలం గాంచి అందు నందు
మరల వెదకుచు ఆ హనుమంతుఁ డంత
అచట పుష్పక మనుచు విఖ్యాతిగన్న
వ్యోమయానమ్ము గాంచె నుద్దామబలుఁడు. 43

గీ. అల కుబేరుని ఓడించి ఆహవమున
ఆహరించిన పుష్పకయాన మిదియ
దీని నరసెద నిందు ఆ జానకమ్మ
ఉండవచ్చును గాంచి ధన్యుండ నగుదు. 44

ఆ. విశ్వకర్మ తాను విశ్వప్రయత్నమ్ము
చేసి దీని సృష్టి చేసియుండు
ఇందు నేది గన్న అందంబులన్ జిందు
శిల్పికళకు నిది విశిష్టసీమ. 45

ఆ. చోదకుండు లేక చోద్యంబుగాఁ బోవు
వ్యోమయాన సార్వభౌమ మిద్ది
వేగమందు వాయువేగంబునుం మించి
క్షణములోన సర్వజగతి చుట్టు. 46

ఆ. ఎంతమందిస్త్రైన ఇద్దాని రోహించి
ఎంత దూరమైన ఏగవచ్చు
శీతవాతవర్ష భీతి యుంచుకలేక
సర్వకల సర్వసౌఖ్యదంబు. 47

ఉ. సుందరచిత్రకర్మపరిశోభితశిల్పకళావిశిష్ట స
న్మందిరముల్, సభాభవనమండపముల్, బహురత్నకాంతి ని
ష్యంద సమంచితాసనలసత్ భవనంబులు, రత్నకాంతి మ
న్మందిరశోభి పుష్పకవిమానము నంతయు గాంచి యందునన్.

క. జానకిఁ గానక ఆ హను
మానుఁడు డోలాయమానమానసుఁ డగుచున్
నే నిఁక ఈ యెదుటన్ గల
మానిత రావణుని రత్నమందిర మందున్. 49

## రావణుని రాజభవనము

క. వెదకెదనని హనుమంతుఁడు
మది నెంచుచు తట్విశాల మార్గము వెంటన్
కదలుచు చదలన్ రానెడు
నదమల బహురత్నరమ్యసౌధము గాంచెన్. 50

ఉ. ద్వారనిదేశమందు బలదర్పితసాయుధవీరవారదు
ర్వారరణప్రచండభటవర్గము దక్షతనుండ తత్ప్రతీ
హారుల దృష్టిలోఁ బడక ఆ హనుమంతుఁడు సూక్ష్మదేహుఁడై
దూరె దశాస్యసద్మము కుతూహలియై జనకాత్మజన్ గనన్. 51

చ. బహువిధరత్నభాసురసభాభవనంబులు, నాట్యశాలలున్
బహువిధరత్ననిర్మితసుభాసురతోరణగానశాలలున్
బహువిధమానసభాధ్వపరిపుష్కలవిస్తృతపాకశాలలున్
బహువిధ కాంచనాసనసువర్ణవినిర్మితఘుక్తిశాలలున్. 52

క. కనుచున్ జని చని యా రా
వణు నంతఃపురము సొచ్చి వనితాజనమున్
గని యందున జనకాత్మజఁ
గనవచ్చు నటంచు మిగుల కౌతుక మెసఁగన్. 63

## రావణుని అంతఃపురము

ఉ. ఒక్కెత పిల్లఁగ్రోవి, మఱియొక్కెత వీణియ, తంబురంబు నిం
కొక్కెత, మర్దళంబు మఱియొక్కెత వక్షమునందుఁ జేర్చి, కెం
పెక్కిన మోముదామరల ఎల్లెడ శీధువిశేషగంధముల్
దిక్కుల గ్రమ్మ నిద్దురను దేలిరి నాథుల గూడినట్లుగన్. 64

ఉ. ఆసవపానమత్తలయి అంగనలందున జడి పాడి ని
శ్వాసము పుచ్చుచుండ ముఖవాససుగంధములెల్ల నిండ న
వ్వాసగృహంబునందు నటు వారలు స్వేచ్ఛగ పండియుండగా
ఆ సతులందఱన్ గనుచు నందును సీతను గాన కయ్యెడన్.

గీ. రత్నదీపాళిశోభితరమ్యదివ్య
భవనమున రత్నకీలితభర్మశయ్య
హంసమృదుతూలికాతల్పమందు దివిజ
కాంతఁ బోలెడి చక్కనికాంతఁ గాంచి. 66

## హనుమంతుఁడు మండోదరిని గాంచి సీతగా భావించుట

గీ. సీతగా నెంచి భ్రమియించి వాతసుతుఁడు
గంతులను వైచి మరలఁ దా నంతలోన
పరమసాధ్వీమతల్లియౌ ధరణితనయ
పరుని ప్రక్కను ఈ రీతి పండుకొనునె? 67

## ఆంజనేయుఁడు అశోకవనమును గాంచుట

క. అని చింతించుచు-నవ్వుడు
మనమున సంపాతి యన్న మాటలు స్ఫుటమై
వినిపింప నశోకమ్మను
వనమును గాలెంతు ననుచు వాయుజుఁ డంతన్. 68

ఉ. కాంచనపత్రపుష్పఫలకాంతిసముజ్జ్వలవృక్షరాజముల్
కాంచనరత్నరాజితసుఖప్రదచంద్రశిలావితర్దికల్
చంచదళీంద్రనిస్వనవిసర్పితచారుసరోవరమ్ములున్
సంచరదేణ-రంకు-రురుశంబరముఖ్య మృగప్రచారమున్. 69

సీ. శుకపికశారికాదికపక్షినివహమ్ము
మృగమృగీశశకాదిమృగగణమ్ము
బహుపుష్పగుచ్ఛసంభరితకుంజమ్ములు
ఫలభారసురుస్ప్రమపాదపములు
నిర్మలజలపూర్ణనీరజాకరములు
మకరందలోలువ మధుకరములు
స్వచ్ఛమరకతకాంతిశాద్వలతలములు
కల్పితక్రీడాద్రికందరములు
చంద్రకాంతాశ్మబద్ధమౌ చప్పరములు
మణివినిర్మిత సుడుచిరమండపములు
కుందనపువేదికలు మణికుట్టిమములు
అంబరము నంటిపడు జలయంత్రములును 70

క. కనుగొని ఆ వనశోభకు
మనమున నచ్చెరువు చెంది మారుతి యిందున్
జనకజ అవశ్యముండును
గని కృతకృత్యుండనౌదు గాదే యనుచున్. 71

గీ. వసుధ వెలసిన నందనవన మనంగ
రమ్యమైనట్టి అల చైత్రరథమనంగ
వెలయు నా వని జనకజాన్వేషణమ్ము
చేయ నుత్కంఠఁ జొచ్చె నవ్వాయుసుతుఁడు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 72

చ. వనమున వృక్ష వృక్షమును వాయుసుతుం డటు దాటుచుండగా
వనతరులెల్ల పుష్పములు వానిపయిం గురిపించె నయ్యెడన్
జనకజయున్న జాడలను షట్పదబృందము నైజఝుంకృతీ
స్వనమునఁ దెల్పుచున్నదను చాడ్పున దోచె నశోకవాటికన్. 73

గీ. ఇటు నిటు రమ్మనునట్టులు
పటుతర ఝుంకృతులు భృంగపటలము సేయన్
విటపమ్ములు దాటుచు న
చ్చటఁ గాంచెను దివ్యచైత్యసౌధము నెదుటన్. 74

## చైత్యప్రాసాదము

ఉ. అంబరచుంబిగోపురశతాంచితమున్, బహురత్నదీపికా
డంబరకాంతిమంతము కిరాసిపనందుల చెక్కడమ్ముఁ గన్
డంబగు మేలుకట్లు పగడంపు పితద్దులు రమ్యరత్నపుం
గంబము లొప్పు చావడులు గ్రాలెడు చైత్యము గాంచె నయ్యెడన్.

గీ. స్తంభసాహస్రశోభితచైత్యమందు
చొచ్చి తత్ప్రాదరాజమ్ము శోధనమ్ము
చేసి సీతమ్మ గనక యా చెంత నతఁడు
గాంచెఁ గాంచన శింశుపాగమ్మొకండు. 76

## హనుమంతుఁడు సీతను గాంచుట

గీ. స్వర్ణవర్ణప్రశస్తవృక్షమ్ము క్రింద
చంద్రకాంతాశ్మబద్ధ విశాలవేది
విరహవైవర్ణ్యవదనయై వేగుచున్న
తరుణి నయ్యెడ గాంచి సీతమ్మ సాధ్వి
హనుమ మదిలోన నెంతొ ప్రహర్షమందె. 77

గీ. సీత నగలను గట్టిన చీర మిదియె
పుడమి శయనించుటం ధూళి బ్రుంగియుండె
నాడు విడిచిన ఆభరణమ్ములెల్ల
ఇపుడు గాన్పింప వీమెకు ఇదియె సాక్షి. 78

గీ. భర్తృవిరహాభిభూతకాభరణధార
ణమ్ము తగదంచు ఆ చెట్టుకొమ్మయంద
ఉంచె ఆభరణములెల్ల ఉర్వితనయ
వాని ముద్రలు మేన గన్పట్టుచుండె. 79

గీ. రామవిభుఁ డప్డు చెప్పిన లక్షణములు
అన్నియును నెన్న ఈ సాధ్వియందు గలవు
ఈమె సీతయె సందేహ మేమి లేదు
ధరణిజను గంటి ఈ కీర్తి దక్కె నాకు. 80

గీ. త్రిభువనంబులయందు నీ దేవి కీడు
కాంత లెందున వెదకినఁ గానరారు
రామవిభునకు నెన్న నీ రమణి తగును
ఈమె కిలలోనఁ దగును శ్రీరామవిభుఁడె. 81

గీ. ప్రభువు శ్రీరాము సతికిట్టి పాటులైన
అన్యకాంతల గూర్చి యేమనఁగవచ్చు
ఏమి యందుము దుర్విధి యిట్టు లీమె
కష్టముల పాలు చేసెను గాదె అకట! 82

## సీత పరిస్థితిని గాంచి పవననందనుఁడు పరితాపము నందుట

సీ. శారదాభ్రచ్ఛన్నచంద్రరేఖయు బోలె
వాతాభిహతశుష్కవల్లి వోలె
గ్రీష్మార్కరశ్మిశుష్కీభూతనది వోలె
వార్షకదినగాంగవారి వోలె
మలినకర్దమలిప్త మౌక్తికమ్మును వోలె
దివసావసానపద్మినిని బోలె
తారావధ్రస్తతరళతారక వోలె
దీపవిహీనమందిరము వోలె

ధూళిధూసరగాత్రియై తూలి సోలి
అనశనస్థితిశుష్కించి అలసి సొలసి
మలిన చేలమ్ము ధరియించి క్రుంగుచున్న
ధరణిజాతను గాంచి సంతాపమందె. 83

గీ. ధూళిధూసరగాత్ర విశాలనేత్ర
సాశ్రులోచన ధర్మ్యవిచారమగ్న
దీర్ఘనిశ్వాసవైవర్ణ్యదీనవదనఁ
గాంచి జానకి హనుమ దుఃఖమ్మునందె. 84

గీ. అమరవల్లభు నర్ధసింహాసనమున
అధివసించిన దశరథు నంతవాని
కోడ లీ యమ్మ జనకుని కూర్మితనయ
అట్టి సీతమ్మ కయ్యయో యిట్టి పాట్ల ! 85

గీ. అఖిలలోకైక పూజార్హుఁడైనయట్టి
రామచంద్రున కీమె అర్ధాంగలక్ష్మి
పూజ్య భూమాతృగర్భానఁ బుట్టె నీమె
అట్టి మా తల్లి సీతమ్మ కిట్టి పాట్లు ! 86

క. అని చింతించుచు నుండఁగ
వినిపించెను నంతిపురిని వీణారవముల్
వనితాజన కలకలమును
మణికీలిత హేమమంజుమంజీరరుతుల్. 87

గీ. దీపముల కాంతి అదిగో ఆ దిక్కు తోచె
మౌక్తికాంచితచ్ఛత్రమ్ము మగువ పట్టె
వనితలన్ గూడి యెవ్వరో వచ్చుచుండె
రావణుఁడె వచ్చునేమొ ఈ రమణిఁ జూడ. 88

## సీతకు కావలిగా రావణుఁడు నియోగించిన విరూప రాక్షసాంగనలు

గీ. వికృతరూపాక్షినాసలు వికృత తనులు
పాపచిత్తలు విపరీత కోపయుతలు
క్రూరకర్మలు సతతమ్ము క్రూరముఖులు
కటుతరాలాప లత్యంత కుటిలమతులు. 89

గీ. కలహకంఠులు నిరతమ్ము కలహపరులు
క్రూరదంష్ట్రిలు అత్యంత ఘోరముఖులు
కఠినచిత్తలు అంగవికార తనులు
ఘోరనేత్రలు బహుజంతుపాదయుతలు. 90

గీ. దీర్ఘజిహ్వలు అతిమాత్ర దీర్ఘతనులు
లంబమానోష్ఠకర్ణలు లంబకుచలు
అయిన రాక్షసకాంతల అవని తనయ
రక్షణార్థంబు నియమించె రావణుండు. 91

గీ. రావణుని యాజ్ఞగొని దివారాత్రములను
అసురకాంతలు శూలపాశాంకుశాది
శస్త్రములు దాల్చి రక్షింత్రు జనకజాత
అమృతకలశమ్ము గాచు మహాహులట్లు. 92

గీ. క్రూరసింహాది మృగముల బారి పడిన
ఆడులేడిని బోలి యా అవని తనయ
క్రూరరాక్షసకాంతల క్రూరదృష్టి
వలయములఁ జిక్కి మిగుల విహ్వలత నుండె. 93

## రావణుఁడు గాంచిన స్వప్నము

గీ. రాత్రి లంకను జొచ్చి శ్రీరామదూత
సీతతోడుత నేదొ భాషించినట్లు
స్వప్నమును గాంచి మదిలోన సంచలించి
సీతఁ గన నెంచె ఆ రాత్రిశేషమందు. 94

గీ. స్వప్నములు గూడ నొక్కచో సత్యమగును
అందు ప్రత్యూష సమయమ్మునందు గన్న
సత్యమగునండ్రు స్వప్నశాస్త్రజ్ఞులెల్ల
గాన ఇప్పుడు సీతను గాంచి వత్తు. 95

## రావణుఁడు సీతను జూడవచ్చుట

మ. అని చింతించి దశాననుండు మదిలో - ఆ రాత్రి - శేషంబునన్
మణిమంజీరకలస్వనమ్ము లెసగన్ మందోదరీ ముఖ్యలౌ
తన రాణుల్ దనుగొల్వ రావణుఁడు చెంతన్ దాసదాసీజనుల్
మణిదీపంబులు పట్టి ముందు నడువన్ మత్తేభలీలాగతిన్. 96

మ. మణికేయూరవిశిష్టహారధరుఁడై మాంజిష్ఠ చీనాంబరం
బును దా గట్టి మదప్రమత్తుఁడగుచున్ భూజాత సీతాసతిన్
గనవచ్చెన్ భయమంద భూతదయముం క్షమాంశుడై యంతటన్
హనుమంతుండును దాగె సూక్ష్మతనుఁడై ఆ వృక్షశాఖంబునన్.

## రావణుని రాక గాంచి సీత భయమందుట

గీ వనితలన్ గూడి వచ్చు రావణుని గాంచి
సీత భయమంది మదిలోన చింతఁ జిక్కి
చేలమునఁ గప్పికొని యొడల్ చీత్కరించి
మదిని నీ దివ్యనామ సంస్మరణ చేసి
రామ! నిన్గాంచె నెదను సాధ్వీమతల్లి. 98

గీ. నీచుఁ డితండు కఠినుఁడు నిర్దయుఁడు
క్రూరచిత్తుండు అత్యంత క్రోధనుఁడు
విగతలజ్జుఁడు సమదగర్వితుఁ డితండు
ఎట్టి దుర్భాషలాడునో ఈతఁ డనుచు
చాల భయమందె మది భయశీల సీత. 99

## రావణుఁడు సీతతో నాడిన మాటలు

గీ. అటులు నను గాంచగనె విశాలాక్షి ! నీవు
భయమునందకు నావల్ల భయములేదు
నిన్ను ప్రేమించి తెచ్చితి నీరజాక్షి !
ప్రేమతో నన్ను గనఁగ నర్థించువాఁడ. 100

గీ. అనవమ్ములు మధుర భోజ్యమ్ములుండ
ఇట్టు లుపవాసములు సేయనేల తరుణి !
మృదుల శయ్యాసనములుండ మృదులగాత్రి
ఇటులు శయనింతువేల ఈ కటికి నేల ? 101

గీ. నిన్ను ప్రేమించియున్న ఈ నన్ను బొంది
అఖిల భోగమ్ము లిచ్చమై ననుభవించు
అంతిపురినున్న నా రాణులంద అబల !
నీదు కనునన్న మెలఁగి మన్నింత్రు నిన్ను. 102

గీ. రాజ్యహీనుండు దండకారణ్యవాసి
మానహీనుండు మానవమాత్రుఁ డతఁడు
హీనబలుఁడైన రాము మోహింతువేల ?
అబల ! ననుగూడి భోగమ్ము లందుకొమ్మ ! 103

గీ. పారమే లేని ఈ అకూపార మెట్లు
దాటిరాగలవాఁడొ - డెందమునఁ గనుమ
తరుణి ! సువిశాల వార్ధి మధ్యస్థమైన
నా పురమ్మును జేరంగ నరుల వశమె ? 104

గీ. కాయకసరుల దినుచు నా కాననమున
మునిజనంబుల వర్తనమునఁ జరించు
రాముఁ డెట్టులు విడిపించు రమణి ! నిన్ను
పట్టి యడియాస లేల ! ఓ వనజగంధి ! 105

ఉ. గెల్చితి నెల్లదిక్పతుల- గెల్చితి నెల్ల సుపర్వకోటులన్
గెల్చితి లోకనాథులను గెల్చితి సిద్ధులసాధ్యబృందమున్
గెల్చితి మూఁడులోకముల గెల్చితి గారుడకిన్నరాదులన్
గెల్చితి యక్షరాక్షసుల గెల్చితి భూతగణమ్ము భోగులన్. 106

క. బలమున గానీ, సుతపో
బలమున గానీ, ధనాది బలమునగానీ,
ఇలలో నా సరియగు వా
రలు లే రెన్నంగ నరుఁడు రాముఁడు సరియే ! 107

గీ. ధరణిరాజుల నెల్ల యుద్ధమున గెలిచి
జనకునకు నిత్తు విపుల రాజ్యమ్ము దేవి !
రాజులను గెల్చి తెచ్చిన రత్నరాశి
నీకుఁ గానుకవెట్టు దనింద్యగాత్రి ! 108

గీ. మూఁడు లోకమ్ములందు నీ కీడువచ్చు
సుందరాంగుల నే నెందుఁ జూడలేదు
భవ్యమణిగణరంజితాభరణగణము
దాల్పకుండనె ఇంత సౌందర్యవతివి. 109

గీ. రత్నరుచి మించు దివ్యవస్త్రములు గట్టి
భూరినవరత్నమౌక్తిక భూషణముల
దాల్చినప్పటి నీదు సౌందర్యగరిమ
చూడ ముచ్చటపడుచుంటి సుందరాంగి ! 110

గీ. అందముల చిందు వక్త్రబింబాధరోష్ఠి !
త్రిపురసుందరి ! నిను గాంచు దృష్టి లేను
త్రిప్పలేకుంటి నేరిపై దివ్యగాత్రి !
కరుణ ననుగాంచి ఏలుకోగదవె దేవి ! 111

## సీత రావణుని తిరస్కరించుచు ఆడిన మాటలు

గీ. రావణుని మాటలాలించి రామ ! సీత
మనసులోఁ గుంది నిను తన మదిని నిల్పి
తృణముగా నెంచి రావణు- తృణము నొకటి
మధ్యగా నుంచి తా నిట్లు మాటలాడె. 112

గీ. రాక్షసాధమ ! నేను శ్రీరామవిభుని
కౌపయికనైన అర్ధాంగి నతనిదక్క
అన్యపురుషుని నంట నీ యాస విడుము
నీదు రాణులతో నుంట నీకుఁ దగును. 113

గీ. అన్యులెవరైన నీ భార్య నపహరింప
ఊరకుందువె ! అది నీకు వీరగుణమె !
అటుల భావింపవేల నీ వన్యసతుల ?
అన్యసతులను జెఱుప భావ్యమ్మె నీకు ?
సతుల జెఱుచుట యెందు దోషమ్ము గాదె ! 114

గీ. వీరవరులైన ఆ రఘువీరవరులు
ఆశ్రమమునందు లేకుంట అరసి వచ్చి
అపహరించితి మాయసన్యాసి వగుచు
వీరధర్మమ్మె యిద్ది గర్వింతువేల ? 115

గీ. రాఘవునితోడ ఎదిరి పోరాడలేక
చోరవృత్తిని గొన్న నీచుండ వీవు
అతఁడు నా చెంతనున్న శక్యంబె నీకు?
సింహమును గాంచి శశకంబు చెనకగలదె! 116

గీ. వ్యాఘ్రగంధమ్ము మూర్కొన్న శ్వానమట్లు
రాముగంధమ్ము సోకిన రాక్షసేశ!
క్షణము నిలువంగలేవు నిశ్చయము సుమ్ము!
రాముఁ డెయ్యెడ యుద్ధాపరాజితుండు. 117

గీ. వాయువహ్నులె యేకమై వచ్చినట్లు
రామలక్ష్మణు లిద్దరు రణము సేయ
వారి నెందిరించువార లెవ్వారు గలరు?
అల విరాధఖరాదు లేమైరి గనుము! 118

గీ. మూఁడు లోకమ్ములందు రామునికి నీడు
వీరుఁ డొక్కండు లేడు నా విభుని బలము
మేరుసారంబు – పరమేశు మేటిధనువు
క్షత్రియాంతకుఁడైన భార్గవుఁ డెఱుఁగు. 119

గీ. వార్ధులనుగూడ నిజబాణవహ్నిచేత
శీఘ్రగతి తాను శుష్కింపఁజేయఁగలఁడు
మూఁడులోకమ్ము లేకమై ముందు నిలిచి
రాము నెదిరింపఁజాలవు రాక్షసేంద్ర! 120

గీ. రామచంద్రుని తీక్ష్ణనారాచములకు
దూరమన్నది లేదె ఈ నీరధెంత?
రామబాణాగ్ని లంకాపుర మ్మదెల్ల
దగ్ధమౌ నాదు మాట తథ్యమ్ము గనుమ. 121

గీ. క్షణములో నేన నా తపశ్శక్తిచేత
భస్మమును జేయఁజాలు దీ భవ్యలంక
అయిన నా పతి శ్రీరాము నాజ్ఞలేమి
శాప మీనైతి ఇది నా యశక్తిగాదు. 122

ఉ. ఆ రఘురాముఁ డెన్న శరణాగతవత్సలుఁ డార్యధర్మసం
ధారుఁడు, మౌనిబృంద దివిషద్గణపూజ్యుఁడు, శత్రుభీకరా
కారుఁడు, చారురూపజితకాముఁడు, ధీరుఁడు, కామితార్థమం
దారుఁడు, శూరసమ్మతుఁడు, దారుఁడు రాముని జూడవెప్పుడున్.

గీ. నన్ను రాముని కిచ్చి ప్రసన్నుఁ జేసి
మైత్రి పాటింప నీకు క్షేమమ్ము గలుగు
ఆశ్రయించినవారల కభయ మిచ్చి
రక్షణము సేత అతని లక్షణమ్ము. 124

గీ. అట్లు కాదేని అతిభయదాహవమున
రామలక్ష్మణముక్తఘోరప్రచండ
శస్త్రవహ్నులు లంక భస్మమ్ము సేయు
సర్వనాశమ్ము ఆత్మనాశమ్ము మూఁడు. 125

క. కావున శ్రీరాముని స
ద్భావమ్మున గనుము శత్రుభావము విడుమీ !
కావుము రాక్షసకులమును
బ్రోవుము నీ బంధుమిత్రపుత్రుల నెల్లన్. 126

## రావణుఁడు కోపావేశమున సీతను జంపఁబోవుట మందోదరి వారించుట

క. అని జనకజ రావణు నొక
తృణముగ భావించి మిగుల ధీరతఁ బలుకన్
విని దశకంఠుఁడు తన మన
మునఁ గోపము చెంది మిగుల మోమును గందన్. 127

గీ. పుడమికూతురు పలుకులు ములుకులట్లు
చెవుల సోకిన- ఆ దశశీర్షుఁ డంత
ఉగ్రరూపంబు దాల్చి నిట్టూర్పు లెసఁగ
కటము లదరంగ నిజదంతఘట్టనమున. 128

గీ. నేను నీమీది ప్రేమ మన్నించి పలుక
నీవు నన్నిట్టు పలుకుదె నిష్ఠురముగ !
మగువ! నీ మాటలకు నెల్ల మరణశిక్ష
తగును నా మది నీయందుఁ దగిలియుంట. 129

గీ. నిన్ను శిక్షింపనైతి నీరజాక్షి !
నన్ను మన్నించి ప్రేమించి నాదు భవ్య
రాజ్యమును గొమ్ము ప్రేమసామ్రాజ్య మేలు
అట్లు కాదేని మరణశిక్షార్హ వీవు. 130

గీ. రాజ్య మిదిగాదు త్రైలోక్యరాజ్యమైన
రాక్షసాధమ ! సాటె శ్రీరామునకును ?
నిన్ను ప్రేమించు టటులుంచు- నిన్ను వామ
చరణమున నంట మాటలు చాలునింక. 131

క. అనినంతనె కడు కోప
మ్మున జానకిఁ జంప ఖడ్గమున్ గొనునంతన్
గని మందోదరి నారీ
జనమును వధియింపఁదగునె ? శాంతింపు ప్రభూ ! 132

ఆ. అంతిపురములోన ఆనందమున మమ్ము
గలిసితేని సుఖము గలుగు నీకు
ఇంత ప్రేమలేని ఇంతిని గూడిన
కలుగఁబోదు నీకు కామసుఖము. 133

## రావణుఁడు సీతను భయపెట్టుట

క. అని మరలింపఁగ యత్నిం
చిన మందోదరిని గాంచి చిఱునగ వొలుకన్
వెను దిరుగుచు జనకాత్మజఁ
గని పల్కెను– కనుల నగ్నికణములు చెదరన్. 134

క. కడచెను – పది మాసంబులు
గడు పింకను రెండు నెలలు గల వంతట– లోఁ
బడవేనిన్ నీ శిరమున్
బడఁజేసెద– కాలుపురికిఁ బంపెద నిన్నున్. 135

గీ. రావణుఁడు వచ్చి జానకీరమణి తోడ
పాపబుద్ధిని చేయు సంభాషణమ్ము
తృణసమంబుగ నీచు రావణుని నెంచి
అతని మాటల ఖండించి అవనితనయ
తీవ్రవాక్కుల నతని నిందించుటయును

సర్వ పురసీతి - అపుడు వృక్షమున నేను
శుకమునై యుండి కనుల నశ్రుపులు జార
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 136

## సీతకు కావలిగానున్న రాక్షసకాంతలతో రావణుం డాడిన మాటలు

ఉ. కావలియున్న ఆ యసురకాంతలం గన్గొని క్రోధమూర్తియై
రావణుం డిట్టులన్ బలికె. రక్కసులార ! వినుండు జానకీ
భావ మెఱుంగుచున్ చతురుపాయములన్ బచరించి యెట్టులేన్
నా వశమైనయట్లు జతనంబును జేయుఁడు గూర్పు నేర్పుమై.

## హనుమంతుఁడు కోపమువట్టలేక అదృశ్యరూపమున రావణుని చఱచుట - రావణుఁడు మరలిపోవుట

క. అని పలికి మరలునప్పుడు
హనుమంతుఁ డదృశ్యుఁడగుచు ఆ దశకంఠున్
తన పిడికిట - పిడుగుంబలె
ఘనశక్తిని వ్రేయ నతఁడు గన్నులు దిరుగన్. 138

ఆ. సోలి తెప్పరిల్లి చూచుచు నలువంక
గాలిభూత మేదొ గలదటంచు
స్త్రీ లెఱుంగకుండ ధీరంబుగాఁ బోవఁ
దలఁచి తరలిపోయె దశముఖుండు. 139

## రావణుని ఆజ్ఞగొని రాక్షసస్త్రీలు
## సీతను లొంగదీయ యత్నించుట

ఉ. రావణుఁ డేగినంతనె కరాళముఖుల్ చనుదెంచి రక్కసుల్
పావనరూపశీలగుణభవ్యను సీతను జుట్టుముట్టి సీ
తా వసుధేశు రాముపయి ఆసలు మానుము చూడుమమ్మ! ఈ
భూవలయాన రావణుని బోలిన వీరులు లేరు నమ్ముమా! 140

గీ. ఇంద్రుఁడాదిగ- అష్టదిగీశవరుల
గెలిచి వారల రత్నరాశులను దెచ్చె
స్వర్గముననుండి కల్పవృక్షములు దెచ్చి
నాటె గాంచుము! ప్రమదావనమ్మునందు. 141

గీ. సూర్యుఁ డీ రాక్షసేశుని శౌర్యమునకు
ఓడి యెండను గాయంగ నోడు మిగుల
చంద్రుఁ డీతని గనినంత- చల్లబారి
చలువ వెన్నెల వెల్లువ జల్లు నిండు. 142

గీ. మారుతుండోడి తాను- చామరముఁబట్టి
చల్లగాలులు వీచు నజస్రమమ్మ!
పావకుం డోడి ఈతని పాకశాల
వంటవాఁడౌచు చేయును వంటలెల్ల. 143

చ. ధనదుని గెల్చి ఆతని నితాంతధనంబును కొల్లగొట్టి ఆ
మణిమయమైన పుష్పకవిమానమునుం గొనితెచ్చెనమ్మ! రా
వణు బలశౌర్యధాటికి దివస్పతి సర్వసుపర్వకోటితో
రణమున నోడి విస్మృతపురస్కృతులన్ బచరించె నప్రభుఁడై.

గీ. మానహీనుఁడు వట్టి అమాయకుండు
అయిన నగుగాక నా భర్త అతని గొలుతు
మానవస్త్రీకి పతియౌను మానవుండె
కాని దానవుఁ బతిగ ఏ కాంత గోరు? 151

గీ. నీవు చెప్పిన యీ మాట నిజమె గాని
నూఱు యోజనములమేర వారినిధిని
రాముఁ డెట్టులు తరియించి రాగలఁడు ?
వచ్చెనేనియు నిన్గొన వాని వశమె ! 152

గీ. మైథిలీ ! యింక రాముని మరచిపొమ్ము
రావణుని బొందు ప్రేమ సామ్రాజ్యలక్ష్మి
వగుచుఁ జెలువొంది భోగభాగ్యమ్ములంది,
అమ్మ ! సుఖియింపు మిదియ శ్రేయమ్ము నీకు. 153

గీ. అందములరాణి ! నీదైన యౌవనమ్ము
సడలిపోవును కాలమ్ము గడచుకొలఁది
రాక్షసేశుండు తనయంత రమణి ! నిన్ను
కాంక్షసేయుట నీదు భాగ్యమ్ము సుమ్ము ! 154

గీ. 'ఏకజట' అన్న రాక్షసి ఎదుట నిలిచి
మమ్ము మన్నించి సీత ! మా మాట వినుము
ఇంక మా మాట వినవేని శంకదక్క-
చిత్రవధ చేసి నిన్ను భక్షింపఁగలము. 155

గీ. 'శూర్పముఖి' అంత వడివచ్చి శూలమెత్తి
మౌర్ఖ్యమును వీడి మా రాజు మందిరమున
కామభోగమ్ము లందుము కాదయేని
శూలమున గ్రుచ్చి పంపెద కాలుపురికి. 156

క. అని పల్కెడు రాక్షసులన్
గని జానకి అశ్రుధార కన్నుల జారన్
నను జంపుఁడు తిను డిప్పుడ
వినఁ గొల్లను మీదుమాట వీడెద నసువుల్. 157

గీ. ఆడులేడెట్లు పులుల మధ్యమునఁ జిక్కి
బెదరునో యట్లు జానకి అదరిపడుచు
గాలివానకుఁ గూలిన కదళివోలె
నేల వ్రాలుచు పొక్కి కన్నీరు గార్చె. 158

## సీత లంకను శపించుట

గీ. శోకభారమ్మునన్ లేచి చుట్టునున్న
రాక్షసుల గాంచి మదిని చిరాకు చెంది
వినను మీ మాట నా మాట వినుఁడు మీరు
చేటుకాలమ్ము లంకకు చేరువయ్యె. 159

గీ. నాదు నాథుండు రాముఁ డేనాటికైన
వచ్చి బాణాగ్ని లంకకు చిచ్చుపెట్టు
చచ్చు మీ రాజు సర్వనాశమ్ము నగును
పీనుగుల పెంట అగును మీ పెద్దలంక. 160

గీ. లంకలో నింక నిశ్శంక కంక పతతి
పీనుగులు పీకి తినుటకై పీకులాడు
వినెడ రింటింట రోదనధ్వనుల నింక
లంక యికమీద నగు రక్తపంకిలమ్ము. 161

గీ. శాప మిచ్చితి నింక నిశ్చయము లంక
నాశమౌపోవు నేను కన్నారగాంతు
ధవుని గోల్పోయి లంక వైధవ్యమంది
దీనతన్ గ్రుంగి తా కళాహీనమగును. 162

గీ. అనుచు శపియించి దుఃఖమ్ము నాపలేక
బోరుమని యేడ్చి సోలె కన్నీరు గురియ
శోకసీతను జూచి యశోకలతలు
నేలపై జారి మంచు కన్నీరు గురిసె. 163

ఆ. లోకమాత సీత శోకాన విలపింప
ప్రకృతికాంత దుఃఖభరితయయ్యె
దివియు కోటికనులఁ దిలకించి అస్రుల
ధార గురిసె పెనుతుషారవృష్టి. 164

ఆ. జాలితోడ పక్షిజాతులు గన్గొని
నీరములను కనుల నీరునింపె
జాలిగొనుచు జంతుజాలమ్ము సీతను
మోము సాచి చూచె మూగకనుల. 165

ఆ. వన్యకాంతనగుచు వసుమతీసుతపడు
కష్టములను గాంచి కనికరమున
ఎంత పొక్కినావొ ! ఏమంచు శ్రీరామ !
ప్రకృతిమాతె కష్టపాటు చెందె. 166

## త్రిజటా స్వప్నవృత్తాంతము

ఆ. అంతలోన 'త్రిజట' అను కాంత చనుదెంచి
క్రూరరాక్షసులను కోపగించి
ధరణితనయఁ దేర్చి తా గన్న స్వప్నంబు
చెప్పఁదొడఁగె సీత చిత్తమలర. 167

ఉ. రక్కసులార! స్వప్నమున రాముని గాంచితి ఈమె నాథునిన్
చక్కదనంబునన్ గెలువజాలును రాముఁడు కామునైన- పెం
పెక్కిన వీర్యదర్పమున ఎల్లజగంబుల నేలజాలు- ఆ
చక్కని మోము సొంపున ప్రసన్నత చంద్రుని నేలఁజాలెడిన్.

గీ. తమ్ముతోఁ గూడి ఐరావతమ్ము నెక్కి
అతఁడు చనుదెంచి దివినుండి అవనితనయ
అంకమునఁ జేర్చి గొనిపోయె నచ్చెరువుగ
స్వప్నమున గంటి దీని విస్పష్టముగను. 169

గీ. ధవళమాల్యాంబరాదులు దాల్చి సీత
పుష్పకము నెక్కి రాముని భుజముపట్టి
చంద్ర సూర్యుల తనదు హస్తమునఁ దాకి
ఇంటిత్రోవను జనుట గన్గొంటి నేను. 170

గీ. రావణుఁడు రక్తమాల్యాంబరములు దాల్చి
పంకగర్తంబునందున పడుట గంటి
కాలకాళిక దశకంఠు కంఠములకు
పాశమునుగట్టి తా దక్షిణాశ కేగె. 171

గీ. గర్దభము నెక్కి అలకుంభకర్ణుఁ డేగె
శింశుమారమ్ముపై నింద్రజిత్తు పోయె
తక్కువారలు నూనెలో తానమాడి
దిసమొలలతోడ దక్షిణదిశకుఁ జనిరి. 172

గీ. రాముఁ డంపిన దూత దుర్వారబలుఁడు
వానరాధిపుఁ డొక్కండు వార్ధి దాటి
వచ్చి యా సీతతో నేదో ముచ్చటించి
కాల్చె నిశ్శంక లంక నే కలను గంటి. 173

గీ. రత్నరంజిత భూషాంబరములు వెలయ
రాజమకుటంబు తనదు మూర్ధమున వెలుఁగ
ఛత్రచామరములు వట్టి సతులు గొలువ
స్వర్ణపీఠమ్మునన్ విభీషణుని గంటి. 174

గీ. రావణుం డోడు గెలుపొందు రాఘవుండు
గాన సీతను మీరలు గారవమునఁ
గొలుపుడీ భక్తి క్షేమమ్ము గలుగు మీకు
జానకీదేవె మన కింక శరణమగును. 175

గీ. త్రిజట స్వప్నంబు వినుచు సాధ్వీమతల్లి
సీత ముదమందె నెంతయు చిత్తమందు
ఆమె వామాక్షి-వామోరు లదరె నంత
మోము వికసించె తనువున పులకరించె. 176

## సీత రాక్షసాంగనలకు అభయమిచ్చుట

గీ. "ఆమె స్వప్నంబు గాని సత్యంబ యయిన
అభయ మిచ్చెద మీకు భయంబు వలదు"
అనెడి జానకి పల్కుల ఆలకించి
అసురకాంతలు ఆశ్చర్యమందినారు
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 177

అని తన స్వప్నము త్రిజటయు
వినిపించిన భయముచెంది విహ్వలులగుచున్
జనకజ మ్రొక్కుచు దూరము
చని వారలు పండుకొనిరి నందడి యడగెన్. 178

గీ. రామ! నీవలె జానకీరమణి గూడ
శరణుగోరిన వారి రక్షణము సేయు
ప్రబలశత్రువులైన ప్రపన్నులైన
వారిఁ బ్రోచుట మీ కది వ్రతమదేమొ
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 179

## సీత నిరాశ చెంది ప్రాణముల విడువఁదలచుట శుభశకునముల గనుట

గీ. నిండె పదిమాసములు నిఁక రెండు నెలలు
గడువు నిచ్చెను దుష్టరాక్షసుఁడు నాకు
ఇంతకును రాడు నాథుఁ డింకెప్పుడు వచ్చు
ఎట్లు గడిపెద రెన్నాళ్ల లింకమీద. 180

గీ. ఏను జేసిన పాప మ్మదేమొ గాని
రామలక్ష్మణు లిరువురు రా రిదేల!
ప్రాణముగ నన్నుఁ గాంచెడి భర్త కిట్లు
దూరముగ నుంటి బ్రతుకును భారమయ్యె. 181

గీ. రాముఁ డిదె వచ్చు వధియించు రాక్షసేశు
నన్ను గొనిపోవు ననుచుఁ బ్రాణమ్ము లెట్లొ
దాల్చియుంటిని ఇంక నే తాళజాల
క్షణము నిలువంగలేను రాక్షసుల మధ్య. 182

గీ. క్రూరరాక్షసకాంతల బారిఁబడక
విషము భక్షించి అసువుల విడుతు నన్ను
గరము నిచ్చెడువార లెవ్వరును లేరె!
ఏమి సేయుదు— ప్రాణంబు లెట్లు విడుతు. 183

గీ. దీర్ఘవేణిక యిదె నేను దీనితోడ
చెట్టుకొమ్మకు నిపు డురిపెట్టుకొందు
అనుచుఁ దలపోయుచుండ వామాక్షి యదరె
భూమిసుత కంత వామోరు భుజములదరె. 184

గీ. శుభము సూచించు శకునముల్ విభునిరాక
దెలుపుచున్నవి యని మదిఁ దలఁచి సీత
మొగము తళుకొత్త తనువున పులకలెత్త
ఆన చిగురొత్త దీర్ఘనిశ్వాస మూర్చె. 185

గీ. కామసుందరు నిను నాథు రామచంద్ర !
మదిని దలపోసి భక్తి నమస్కరించి
"శత్రువుల మధ్యనున్న నీ సతిని నన్ను
వేగ రక్షింప శ్రీరఘువీర ! రావె"
అనుచు మొఱవెట్టెనంత ఆ అవనిజాత. 185

గీ. చెట్టుపై నున్న హనుమ ఆ సీతఁ గాంచి
"ఇదియ సమయంబు రాక్షసులెవరు లేరు
ఈమె దర్శించి శ్రీరాము క్షేమవార్త
మధురవాక్కుల వినిపింతు మనుజభాష". 186

## వృక్షముననున్న హనుమంతుఁడు
## శ్రీరాముని గుణగణమును గానము సేయుట

క. అని నిశ్చయించి మారుతి
జనకజ మునుముందు దాఁ బ్రసన్నను జేయం
జనునని శ్రీరాముని గుణ
గణమును మృదుమధురఫణితి గానము చేసెన్. 187

ఉ. వనధిగభీరుఁ డార్యుఁ డనవద్యచరిత్రుఁడు కామసుందరుం
డినకులవార్ధిచంద్రుఁడు అహీనగుణుండును మేరుధీరుఁడున్
జనసుతకీర్తిసాంద్రుఁడు ద్విషద్గణభీముఁడు రాముఁ డెన్న – ఆ
జనపతి పంప వచ్చితిని జానకి గాంచితి నిశ్చయంబునన్. 188

సీ. దశరథక్షితిపాలతనయుండు రాముండు
జనకాజ్ఞ తలఁదాల్చి వనికి వచ్చి
తనసతి సీతయు – తమ్ముండు సౌమిత్రి
తన్ను గొల్వఁగ నుండె దండకమున
అనుజునితో మృగయార్థ మేగినతఱి
అసురుఁ డెవ్వఁడో సీత నపహరించె
ఆమె నన్వేషించు చా రాఘవేంద్రుండు
కిష్కింధ చేరి సుగ్రీవు గలసి
అనలసాక్షిగ అతనిసఖ్యమ్ము చేసి
వాని యగ్రజు దుష్టాత్ము వాలి జంపి
రాజుగా జేసి సుగ్రీవు రాజ్యమునకు
అనుజుతోఁగూడ ప్రస్రవణాద్రి నుండె. 189

గీ. మిత్రభావంబు పాటించి మిత్రసుతుఁడు
అవనిజాతను వెదకి రం డనుచు మమ్ము
దక్షిణాశకుఁ బంప సంపాతి వలన
లంకలో నుంట తెలిసి నిశ్శంకవృత్తి. 190

గీ. అబ్ధి లంఘించి వచ్చి ఆ అమలచరిత
శోకసంతప్త సీత నశోకవనిని
గంటి నియ్యెడ ధన్యతఁ గాంచినాఁడ
అనుచు విరమించె నంతలో ననిలసుతుఁడు
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 191

## శ్రీరాముని గుణకీర్తమును ఆలించి ఆశ్చర్యచకితయై సీత వితర్కించుట

గీ. అట్లు నీధ్దైన సత్కథ నాలకించి
అవనిజాతయు విపుల నాశ్చర్యమంది
తొలకరించిన వానల పులకరించు
పుడమి పోలిక తనువునఁ బులకలెత్త. 192

గీ. లంకలో నిట్లు శ్రీరఘురాము చరిత
మెవరు వినిపింతు రియ్యెడ నెవరు లేరె!
నాదు భ్రమయేమొ! లేక స్వప్నమ్మిదేమొ
నాకు నిద్రయె లేదు స్వప్నం బదెట్లు? 193

గీ. నేను సతతంబు విభుని ధ్యానించుచుంట
భ్రాంతిచే నిట్లు వింటినో రాముకథను
భ్రాంతి యెట్లగు వింటి విస్పష్టముగను
కనులఁ గనుచుంటి వీనుల వినుచునుంటి. 194

## హనుమ వృక్షమునుండి దిగివచ్చి సీతతో ఆడిన మాటలు

గీ. అనుచు దిక్కులు నలువంక లరసి యరసి
మీఁదికిన్ జూడ వృక్షమ్ముమీఁద నచట
కనులు మిఱుమిట్లు గొల్పెడి కాంతితోడ
వానరం బొండు వింతగా గానిపించె. 195

గీ. వానరమ్మును గన్నచో స్వప్నమందు
అశుభమందురు శాస్త్రజ్ఞు లదియు లేదె
స్వప్న మిదిగాదు సత్యంబు శంక లేల
వింటి వీనుల శ్రీరఘువీరు కథను. 196

గీ. మహిత శ్రీరామచంద్రుని మధురగాథ
వీనుదోయికి విందుగా వినిచె నెవఁడొ
అనఘచరితుని ఆతనిఁ గనఁగ నాదు
డెంద మెంతయు నుత్కంఠ నందుచుండె. 197

## హనుమంతుఁడు శ్రీరాముని క్షేమవార్తను సీతకుఁ దెల్పుట

గీ. అనిన జానకి పలుకుల నాలకించి
నగము దిగి వచ్చి సాష్టాంగనతులు చేసి
వినయ వినమితగాత్రుఁడై హనుమ అంత
ఇంపు మీరఁగ ఆమెతో నిట్టు లనియె. 198

గీ. దివ్యతేజమ్ము చూడ ఓ దేవి! నీవు
దినకరుని పత్నియైన పద్మినివి యేమొ!
సౌమ్యభావంబు వదనప్రసన్నత గన
హిమకరుని ప్రాణదయిత రోహిణివి యేమొ! 199

గీ. సాత్వికత్వమ్ము - నీ కష్టసహన మరయ
దేవి! రూపమ్ము గొన్న భూదేవి వేమొ
అమ్మ! నీ రూపశీలధైర్యమ్ము లరయ
లక్ష్మికళ లొల్కు క్షత్రియ లలన వేమొ. 200

గీ. పంచవటి నుండి అట్లు వంచించినాడు
రావణుఁడు తెచ్చినట్టి యా రమణివైన
తల్లి! శ్రీరామునతివ సీతమ్మ వగుదు
అదియె సత్యమ్మటంచు నా మదికిఁ దోచు. 201

గీ. అతని మాటల నాలించి అవనితనయ
ముఖము వికసింప - తనువెల్ల పులకరింప
ఔను శ్రీరాము సతిని నే నౌదునోయి!
నీ వెవండవొ తెల్పుమా నిర్మలాత్మ! 202

గీ. అనిన హనుమంతుఁ డామెకు నంజలించి
తల్లి! ధన్యుండనైతి త్వద్దర్శనమున
మాత! శ్రీరాముఁ దంపిన దూత నేను
క్షేమముగ నుండెనమ్మ! శ్రీరామవిభుఁడు. 203

క. తన పతి కుశల సువార్తను
వినిపించిన హనుమఁ గాంచి వికసితముఖియై
తనువున - పులకలు దేరఁగ
కనులను సమ్మోద బాష్పకణములు జారన్. 204

ఆ. మరల మరల నడుగ మారుతి భవదీయ
కుశలవార్త దెలిపి విశదపఱిచె
మోద మెసఁగ నంత ముందుకు రాఁగని
రాక్షసేశుఁ డనుచు రమణి దలఁచి. 205

## సీత హనుమంతుని రావణుఁడని శంకించుట

గీ. నాఁడు దండక మాయసన్యాసి వగుచు
వచ్చి పాపాత్మ! నన్గాని వచ్చినావు
మర్కటాకృతి నే డిట్లు మాయ బూని
నన్నుఁ జెనకంగ జూచిన నాశమగుదు. 206

గీ. అనుచు వెనుకకు జరగి యా అవనితనయ
భయము నందుచు మానె సంభాషణమ్ము
పవనతనయుండు జానకి భావ మెఱిఁగి
వినయమున మ్రొక్కి ఇట్టులు విన్నవించె. 207

ఆ. తల్లి ! నేను రామదాసుండ నమ్ముము
రావణుండఁ గాను— పావనాంగి !
నీదు విభుఁడు పంప నీరధి తరియించి
వచ్చినాఁడ నేను వాయుసుతుఁడ. 208

## హనుమంతుఁడు జానకి సందేహమును తీర్చుట

గీ. అనిన జానకి గనుగొని అనిలసుతుని
వానరులు మీరు నా భర్త మానవుండు
నరుల కెట్టులు జగతి వానరులతోడ
సఖ్య మేర్పడు ? తీర్చు నా సంశయమ్ము. 209

గీ. అనిన— నీదైన సందేహ మర్థవంత
మగుసు దెల్పెద వినుమమ్మ ! అమలచరిత !
అపుడు రావణుఁ డట్లు నిన్నపహరింప
రాఘవుం డెంతొ దుఃఖసంక్రాంతుఁ డగుచు. 210

గీ. కొండకోనల పర్వతగుహల పొదల
నిన్ను వెదకుచు నొకచోట నీ విభుండు
అల జటాయువు కంఠగతాసుఁ గనియె
అతఁడు "సీతను రావణుం డపహరించె"
అనుచుఁ దెల్పుచు— ప్రాణము లంత విడిచె. 211

'రావణునితోడ నటు ఘోరరణము సేసి
ప్రాణముల నిచ్చె సీతకై పక్షిరాజు'
అనుచు కరుణను వహ్నిదాహంబు సేసి
అమ్మ! అతని కిచ్చె మోక్షమ్ము విభుఁడు. 212

తమ్మునితోడఁ గూడి యటు దక్షిణదిక్కుగఁ బోయి ఋష్యమూ
కమ్మును జేర వారలను గాంచి భయమ్మును జెంది భానుజుం
డమ్మహితాత్ము లెవ్వరొకో అరసి రమ్మన బ్రహ్మచారి వే
షమ్మునఁ బోయి వారిదగు సర్వచరిత్ర మెఱింగి తమ్మరో! 213

అమ్మహాత్ముల నాదు స్కంధమ్మునందు
అమ్మ! ధరియించి ఋష్యమూకాద్రిఁ జేర్చి
హరివిభుండగు ఇనజున కంత దెలుప
వారి దర్శించె స్నేహభావమ్ము దోప. 214

నీదు చెఱఁగున ముడివైచి నీవు నాఁడు
నగమునందున విడిచిన నగలమూట
నేను గొనితెచ్చి చూపింప నీ విభుండు
గాంచి వానిని మిగుల దుఃఖించె తల్లి! 215

అతని నోదార్చి ఆ ప్లవగాధినేత
"రఘుకులోత్తమ! నీ శత్రురాశినెల్ల
సంహరింపంగ వత్తు ససైన్యముగను
సాయ మొనరింతు నీకు నా శక్తికొలఁది". 216

అనుచు శపథమ్ము గావింప హరివిభుండు
అనలసాక్షిగ వారు సఖ్యమ్ము చేసి
రంత నీ భర్త ఇనజు భార్యాపహర్త
వాలి దుర్వారబలు నొక్క కోలఁ గూల్చె. 217

గీ. ప్రాజ్యవిస్తార ప్లవగసామ్రాజ్యమునకు
రాజుగాఁ జేసె సుగ్రీవు రాఘవుండు
రామునకు నిట్లు వానరరాజుతోడ
దృఢతరంబైన మైత్రి సిద్ధించె తల్లి ! 218

గీ. తావకాన్వేషణార్థ మత్యంత బలుల
వానరులఁ బంపె నా హరివల్లభుండు
అందు నొక్కండ నేనమ్మ ! అబ్ధి దాటి
వచ్చినాఁడను లంకను జొచ్చినాఁడ. 219

గీ. రాత్రి యంతయు లంకాపురమ్ము వెదకి
రాక్షసేశ్వరు నంతఃపురమ్ము నరసి
కంటి నియ్యెడ ఈ యశోకమ్మునందు
మాత ! నమ్ముమ రామునిదూత నేను. 220

గీ. అంజనాదేవి నా తల్లి- అవనితనయ !
వానరేంద్రుని మంత్రిని, వాయుసుతుఁడ
రఘుకులాంభోధిచంద్రుఁడౌ రాముదూత
తల్లి ! నమ్ముము నీదు పాదమ్ము లాన. 221

## అంగుళీ ప్రదానము - సీత ఆనందపారవశ్యము

చ. అని వచియించి నీవు నవు డంపిన ముద్రిక భక్తినీయ భూ
తనయయు దాని గన్గొని ముదమ్మున కన్నుల నశ్రులొల్కఁగా
తన శిరమందు భక్తిమెయి దానిని దాలిచి ముద్దుపెట్టి తాఁ
దనువునఁ బుల్కలెత్తఁగ నెదన్ గదియించుచు లజ్జపెంపునన్.

గీ. నిన్ను గాంచినయట్టుల నీదు రత్న
ముద్రికను గాంచి సీతమ్మ మురిసిపోయె
జనకుఁ డానాడు తన పెండ్లిసమయమందు
అల్లునికి నిచ్చె నిద్దాని ననుచుఁ దలఁచి. 223

గీ. మరల మరలను త్వన్ముద్ర శిరమునందు
ఉరమునందును జేర్చుచు ఉర్వితనయ
తనివితీరగ ముద్దాడి తనివి నసక
మదిని గాంచుచు నిన్ మయిమఱచిపోయె. 224

గీ. వినయవినమితగాత్రుఁడౌ అనిలతనయు
ఎదుటఁ గనుగొని ప్రీతిమై యిట్టులనియె
రామదూతవె గావు నా ప్రాణదాత
వైతి హనుమంత! అనుచు నుతించె నతని. 225

గీ. అవనితనయకు నమ్రుఁడౌ పవనతనయు
నందు నేర్పడె విశ్వాస మమలబుద్ధి
అంత జానకి ప్రీతి మాట్లాడె నిట్లు
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 226

## సీత — రామలక్ష్మణుల క్షేమాదులడుగుట

గీ. రాముఁ డెట్లుండె? ఎట్లుండె లక్ష్మణుండు
నన్ను దలపోయుదురె వార లెన్నడైన
ఇన్ని దినములు గడచిన ఇట్టులున్న
నన్ను గొనిపోవ రాడేమి నా విభుండు? 227

గీ. మఱది లక్ష్మణు కఠినంపు మాటలాడి
పంపినందుల కేను తత్ఫలము గంటి
అంతలాడిన నాపైని ఎంతొ భక్తి
అట్టి మఱదులు లోకమ్మునందు లేరు. 228

గీ. అన్నకున్ నాకు సేవల నాచరించు
అమితభక్తిని లక్ష్మణుం డహరహంబు
తల్లిదండ్రుల - ఊర్మిళాతరుణి విడిచి
మమ్ము సేవింప వచ్చిన మఱది యతఁడు. 229

గీ. తండ్రిగానెంచు రాము చిత్తమ్మునందు
తల్లిగా నెంచి గొలుచు నాతండు నన్ను
అట్టి లక్ష్మణుఁడైన రాడయ్యె నకట !
అన్న యానతిలేక రాడయ్యె నేమొ ! 230

గీ. అమితతేజులు వారు వాయ్వగ్నిసములు
వారి నెదిరించు వీరు లెవ్వారు లేరు
రాముఁ డొక్కండ చాలు నీ రావణాది
రాక్షసులఁ జంప నతఁడు దుర్వారబలుఁడు, 231

గీ. అర్కతేజుండు రాఘవుం డమితబలుఁడు
రావణునిబోలు వీరు విరాధుఁ గూల్చె
రాముఁ డానాడు దండకారణ్యమందు
ఖరఖరాదుల గూల్చె నొక్కండె గాదె ! 232

గీ. అట్టి రఘువంశభూషణుం డనిలతనయ !
సతిని నటు గొనిపోవ రాక్షసుఁ డొకండు
రాక్షసుల జంపి నన్గాన రాఁడిదేమి ?
దోషమేదైన నాయందు దోచెనేమొ ! 233

ఆ. భ్రాతృనిరతభక్తిభరితుండు భరతుండు
అనుజు శత్రుహంత నమితబలుని
అఖిలసైన్యపతుల అక్షౌహిణీబల
సహితముగను బంపి సాయపడునె? 284

క. అని యిటు లెన్నియొ యడిగెడు
జనకజఁ గనుగొనుచు భక్తిసంయుతుఁ డగుచున్
మనమున నిన్గని మ్రొక్కుచు
హనుమంతుఁడు పలికె నిట్టు లవనిజతోడన్. 285

## హనుమంతుఁడు సీత ప్రశ్నలకు సమాధానముఁ జెప్పుట

చ. కుశలము రామచంద్రునకు కూరిమి తమ్ముఁడు లక్ష్మణుఁడు తా
కుశలమ తల్లి! రాఘవుఁడు కోమలి నిన్నెడబాసి తా నహ
ర్నిశలును ఖేదమందుచును నిన్నె దలంచుచు సాశ్రునేత్రుఁడై
అశనమునైన దాను గొనఁ డమ్మరొ! త్వద్విరహవ్యథాత్ముఁడై.

ఆ. అతఁడు నిన్నె మదిని ధ్యానించుచుండును
రేయిపవలు నిద్రలేక యుండు
మశకమక్షికములు మైప్రాల ద్రోలఁడు
దెసల దాను గాంచు దీనదృష్టి. 287

ఆ. కందమూలఫలము లందందు గొనివచ్చి
తమ్ముఁ డీయ భక్తితత్పరతను
అమలజలము ఫలము లంతియ గైకొను
అతఁడు స్వీకరింపఁ డామిషమ్ము. 288

గీ. ప్రకృతిదృశ్యంబు లెవి గన్న ప్రభువు నిన్నె
'జానకీ' యంచు మదిలోన సంస్మరించు
నీదు విరహాభితప్తుఁడై నీ విభుండు
క్షణముకాలము నొక్క యుగముగ నెంచు. 239

గీ. నిన్ను చెఱగొన్న దుష్టాత్ము నీచ దనుజు
సర్వనాశంబు చేయంగ శపథ మతఁడు
చేసియున్నాడు నీదైన క్షేమవార్త
తెలిసికొన నన్నుఁ బంపె నో దేవి ! వినుమ. 240

గీ. ప్లవగనాథుండు సైన్యాధిపతులతోడ
భూరి బలయుతుఁడగుచు సంభోధి దాటి
వచ్చి రాక్షసకోటిని వ్రచ్చు నతఁడు
ఆ రఘూత్తంసునకును సాహాయ్యపడును. 241

గీ. అనిన జానకి ఆ మాట లాలకించి
అధికసంతోషపారవశ్యంబు నంది
మదిని నిను గాంచి భక్తి నమస్కరించి
పవనతనయుని కూర్మిమై ప్రస్తుతించె
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 242

గీ. అనిలనందన ! నీవు రామావనీంద్రు
సన్నిధిని నుండు వాతని సద్గుణముల
రూపరేఖల నెఱుఁగుదు రూఢమతిని
వాని వర్ణింపవే యన్న వాయుసుతుఁడు. 243

గీ. మదిని తలపోసి నిన్ను నమస్కరించి
జానకీదేవి భక్తిమై చాఁగి మ్రొక్కి
అమ్మ! నా కింతకంటె భాగ్యమ్ము గలదె!
ధవుని గుణరూపశీలాదు లవధరింపు. 214

## హనుమంతుఁడు శ్రీరామచంద్రుని రూపగుణశీలాదులను వర్ణించుట

. కోమలనీరదశ్యామలదేహుండు
ఆజానులంబిభుజార్గళుండు
వ్యాయతోన్నతపీనవక్షోవిభాగుండు
ఆకర్ణదీర్ఘనేత్రాంబుజుండు
సమవిభక్తాంగసౌష్ఠవచారుదేహుండు
సంహతాంగుఁడు సింహసంహనుండు
గంభీరమృగరాజగమనాభిరాముండు
అనయంబుమందస్మితాననుండు
సత్యనిరతుండు సజ్జనసన్నుతుండు
మహితచరితుండు సద్ధర్మమార్గరతుఁడు
త్యాగశీలుండు చండకోదండధరుఁడు
మేరుధీరుండు వార్ధిగంభీరుఁ డతఁడు. 245

భానుసహస్రతేజుఁ డరిభండనభీముఁడు మేరుధీరుఁ డా
జానుసుదీర్ఘబాహుఁడు విశాలసుఫాలుఁడు నార్యసన్నుతుం
డానతశాత్రవుండు శరణాగతరక్షణదక్షుఁ డమ్మ! క
ల్యాణగుణాభిరాముఁ డకలంకచరిత్రుఁడు రాఘవుం డిలన్. 246

ఆ. ఆదిశేషుఁడైన ఆతని వర్ణింపఁ
జాలఁడన్న నేను జాలుదెట్లు?
పుణ్యపురుషుఁ డతఁడు పురుషోత్తముండమ్మ!
పూజ్యగుణుఁడు లోకపూజ్యుఁడమ్మ! 247

గీ. సకలశస్త్రాస్త్రవిదుఁడు షట్ఛాస్త్రవిదుఁడు
వేదవేదాంగవిద్ధనుర్వేదవిదుఁడు
విశ్వవిఖ్యాతచరితుఁడు విపులయశుఁడు
విష్ణుతుల్యుండు ఘనరోచిష్ణుఁ డతఁడు. 248

ఉ. ధరణీశోత్తముఁడు త్రిజగంబుల నేలఁగఁజాలు వీరుఁడున్
గారణజన్ముఁ డార్తజన కష్టనివారణదక్షుఁ డర్థిమం
దారుఁడు చారుగాత్రుఁడు నుదారుఁడు ధీరుఁడు రామచంద్రుఁ డీ
క్రూరు నిశాచరేశ్వరుని గూల్చి నినున్ గొనిపోవు నమ్మరో!

## సీత మరల మరల ప్రశ్నించుట
## హనుమంతుఁడు సమాధానములు చెప్పుట

గీ. హనుమ నీ రూపశీలవీర్యాదులెల్ల
అట్లు వర్ణింప పారవశ్యమ్ము నంది
కనుల నానందబాష్పముల్ గ్రమ్మి కురియ
సీత హనుమంతు మఱియు ప్రశ్నించె నిట్లు. 250

గీ. రామలక్ష్మణు లెటు సాగరమ్ము దాటి
వచ్చువారలు చెప్పవే వాయుతనయ!
వానరేశుండు సేనలు వచ్చునెట్లు?
ఓయి! ఈ వార్ధి దాటు నుపాయమేది? 251

గీ. ఇంతచింతలు చూడ మీ రంతలేసి
రాక్షసులతోడ నెట్లు పోరాడగలరు?
సాయుధులు వారు మీరు నిరాయుధులుగ
గాత్రఖడ్గాది చటులశస్త్రములు గలవె? 252

గీ. తగిన సన్నాహ మెదిరేక దైత్యకోటి
నెదిరి సంగ్రామమును జేయ నెవరితరము!
వ్యూహనిర్మాణచతురులౌ యూథపతులు
వానరేంద్రుని సేన నెవ్వారుగలరు? 253

గీ. మాత! వినుమమ్మ! రామలక్ష్మణుల నాదు
భుజములందున దాల్చి అంభోధి దాటి
వత్తు నే నింక వానరవల్లభుండు
క్షణములో దాటివచ్చు నీ సాగరమ్ము. 254

గీ. అంగదాదికసకల యూథాధిపతులు
వార్ధి తరియింప వారు సమర్థులమ్మ!
వ్యూహనిర్మాణదక్షు లాయోధనమున
అగనగమ్ములె మాకెల్ల నాయుధములు. 255

గీ. అనిన ఇంచుక నవ్వి ఆ అవనితనయ
హనుమ చూడంగ నీవు ప్రేలంత లేవు
దాల్తు వెట్టులు వారి స్కంధమ్ములందు
నీదు పలుకెట్టు విశ్వసనీయమగును? 256

గీ. వానరులు తాము నీవంటి వారుగాదె!
అగనగమ్ములు దాల్చి పోరాడగలరె!
వారు తరియింతు రెట్లు దుస్తారవార్ధి?
వ్యక్తమయ్యెను నీ కపిత్వమ్ము హనుమ! 257

## హనుమంతుఁడు తన శరీరమును పెంచుట

ఆ. అనిన ఆమె మాట లాలించినంతనే
చిన్నవోయి హనుమ సిగ్గుగొంది
తరువు దాటి జనకతనయ నివ్వెఱగంద
తనువు పెంచె పర్వతమ్ము వోలె. 258

క. చుక్కలు తలపూవులుగా
దిక్కుల వాలమ్ము నంట దినకరదీప్తిన్
దృక్కులు మిఱుమిట్లు గొన
లక్కజముగ మేరుమందరాకృతిధరుఁడై. 259

క. కొండల పిండి యొనర్తును
ఖండనమున శత్రుకోటి ఖండింతును భూ
మండల మెల్లను జుట్టెద
దండించెద నెల్ల దైత్యదానవకోటిన్. 260

క. అనినంతనె జానకి ఆ
హనుమంతుని గాంచి మిగుల నచ్చెరుపడుచున్
ఘనమగు నీ యీ రూపము
దనుజులు గాంచెదరు సూక్ష్మతనువున్ గొనుమా! 261

క. "ఇంతటి వాఁడవె" అని నా
చెంతకు నిను బంపెగాదె శ్రీరఘుపతిదం
డెంతటి పనికైనను హను
మంతా! తగు దీప్త శక్తిమంతుఁడవవుగా. 262

ఆ. అమ్మ ! వినుమ నేన ఆ వానరేంద్రుని
సేనలందు చాల చిన్నవాఁడ
నన్నుఁ బోలువారు నాకంటె బలవంతు
లున్నవారు నమ్ము ముర్వితనయ ! 263

ఆ. అనిన హనుమ గాంచి ఆ తల్లి నీవంటి
వినయపరుల నెందు వినుటలేదు
ఇంతివాఁడవయ్యు ఈరీతిఁ బల్కు దే
గర్వ మింతలేని ఘనుఁడ వీవు. 264

గీ. అనుచు నగ్గించు సీతను హనుమ గాంచి
తల్లి మీ పాదదాసుండ తగునె పొగడ !
రామవిభునకు నీదగు క్షేమవార్త
దెలుపఁ బోయెదనమ్మ ! పృథ్వీకుమారి ! 265

గీ. దేవి ! విభునకు నంపు సందేశ మేమి ?
ఏమి చెప్పద ప్రభునకు ఏమిగొందు
అతఁడు ముద్రిక నంపినయట్టు లీవు
ఆనవాలుగ నేదైన అమ్మ ! యిమ్మ ! 266

## సీత రాముని కందజేయు సందేశము

గీ. అనిన పవనజుఁ గనుగొని అవనితనయ
కనుల నశ్రులు ధారలై కారి పాఱ
కంఠమెంతయు గద్గదికమ్ము నెంద
దైన్యభావమ్ము మోమునఁ దాండవింప. 267

కం. వింటివి రావణు మాటలు
కంటివి నా కష్టగాథ కనులన్ హనుమ !
వంటింపక యిఁక నించుక
కంటకు దశకంఠుఁ డనుముగావలె ననుమా ! 268

గీ. చీర మాత్రమ్ము గొని నిరాహారదీక్ష
జడలుగట్టిన కేశపాశమ్ముతోడ
నేల శయనించి తా నహర్నిశలు నిన్నె
ధ్యానమున నిల్పు సీత డెందమున ననుమ. 269

గీ. సతిని చెఱగొన్న దుష్టరాక్షసు వధించి
తరుణిఁ గాచుట యది క్షాత్రధర్మ మనుమ !
దుష్టరాక్షసకోటిని దునుమ తాను
చేసె శపథమ్ము నది జ్ఞప్తిచేసె ననుమ ! 270

గీ. అన్యచింతన లేక యనన్యమతిని
నియతభక్తిని మదిలోన నిన్నె నిలిపి
తపము సేయుచునుండె సీతమ్మ యనుమ
ఆతని ప్రత్యక్షమగుమని హనుమ ! అనుమ. 271

గీ. అసహవిరహాభితప్తయై అవనిజాత
గుండె బరువెక్కి తా నట నుండె ననుమ
గడియ అది యొక్కయుగముగా గడుపుచున్న
తన్ను రక్షింప వేగ రమ్మన్న దనుమ. 272

చ. అని యిటులెన్నియేని జనకాత్మజ దెల్పుచు విన్మ పావనీ
దనుజుఁడు రెండు మాసములె దా గడువిచ్చెను నాకుఁ గాన ఆ
యినకులరాజమౌళి గడువింతకు దాటకమున్న వచ్చి రా
వణు వధియింపగావలెను వారికి నీయది తెల్పి పంపుమా ! 273

## జానకి ఆనవాలుగా తన శిరోమణిని హనుమంతుని కిచ్చుట

క. అని తన సందేశమ్మును
వినుపించుచు కనుల నశ్రుబిందులు దొరగన్
తన కేశంబుల దాల్చిన
మణి దీసి యొసంగి పలికె మంజులఫణితిన్. 274

క. అనిలజ! ఇద్దానిని నా
జనకుఁడు దా నొసఁగె పెండ్లిసమయమునందున్
అనుదినమును దీనిం గన
కనిపించును నాదు పెండ్లి కన్నులయందున్. 275

క. అని తెల్పి మణిచరిత్రము
జనకాత్మజ యెంతొ సుప్రసన్నాననయై
వినుమని కాకాసురు కథ
వినిపించెను కనుల సుంత వ్రీడ నటింపన్. 276

## సీత కాకాసుర వృత్తాంతమును దెల్పుట

గీ. మున్ను నాకును ప్రియుఁడు రామునికి దక్క
అన్యు లెరికిఁ దెలియనియట్టి దొక్క
చిత్రమౌ కథ విన్పింతు చిత్తమలర
అది అభిజ్ఞానముగ దెల్పు మనిలతనయ! 277

గీ. చిత్రకూటాద్రిపాదవిచిత్రవనికి
విహరణార్థమ్ము నేను నా విభుఁడు నేగి
వారిశీకరజాహ్నవీతీరభూమి
లలితకోమలపులినస్థలమ్మునందు. 278

గీ. దర్భశయ్యను మేము మోదమున నుండి
లరని అన్యోన్యమును గపోలములు సేర్చి
భూతపూర్వాతిమధురానుభూతు లేవొ
మదిని కదలింప తనువులు మరచియుండ. 279

గీ. కాకరాక్షసుఁ డొక్కఁ డాకాశవీథి
అంచితాలక్తమచ్చరణాంగుళమును
ఆమిష భ్రాంతిఁ గాటోలు నరసి వచ్చి
శాతచంచువుతో రక్కి క్షతము చేసె. 280

గీ. ఎంత త్రోలిన పోవక ఎగిరివచ్చి
ముక్కునన్ జీర రక్తమ్ము పొంగిపొరలె
పక్షి గనుగొని విభుఁడు తామ్రాక్షుఁడగుచు
అచటి సంస్తరదర్భ బ్రహ్మాస్త్రముగను. 281

మ. అభిమంత్రించి జవంబునన్ బరపగా ఆ దుష్టకాకాసురుం
డభయార్థమ్ము నభమ్మునం బఱచి తా నాయింద్రబ్రహ్మాదులన్
సభయుండౌచును వేడ వారలు మహాసంభ్రాంతి పోఁద్రోలగా
ప్రభుపాదమ్ముల వ్రాలి ఆర్తుఁడగుచున్ బ్రార్థించె సంత్రాణమున్

ఆ. శరణటంచు రాము చరణాబ్జముల వ్రాల
కరుణతోడ వాని గావనెంచి
వాని దక్షిణాక్షి బ్రహ్మాస్త్రమున కిచ్చి
విడిచిపుచ్చె రామవిభుఁడు వాని. 283

గీ. అతఁ డింద్రుని సుతుఁడు జయంతుఁడంద్రు
పాపబుద్ధిని కాకరూపమ్ము దాల్చి
పొంచి యారీతి నన్ను నొప్పించి తుదకు
ప్రభుని కారుణ్యమున నట్లు బ్రతికిపోయె. 284

ఆ. పక్షిపైని నాడు బ్రహ్మాస్త్రమట్టులు
పరపె విభుఁడు నేడు పరవఁడేమి ?
ప్రభువు కోపగింప బ్రహ్మేంద్ర రుద్రాదు
లెదుర లేరు రాక్షసేశుఁ డెంత ! 285

గీ. ప్రభువు ప్రేముడి నా గండఫలకమందు
మకరికలు దీర్చుటది మది మఱవ ననుము
ఈ యభిజ్ఞానమును దెల్పుదేని హనుమ !
విభుఁడు సానందుఁడై నిన్ను విశ్వసించు. 286

## సీత తన మాటలుగా లక్ష్మణునితో చెప్పుమనిన మాటలు

గీ. వదినె ఆడిన మాటలు మదిని నిడక
అన్నగారికి కుడిభుజమట్లు నిలిచి
సంగరమ్మున క్రూర రాక్షసులఁ ద్రుంచి
తన్ను రక్షింపఁ బ్రార్థించుచున్న దనుమ. 287

గీ. అనుచు నీ మాట మఱది లక్ష్మణునితోడ
నాదు మాటగఁ దెల్పి "మనంబునందు
కినుక చూపక క్షమియించు" మనుము హనుమ !
అన్న కన్నిట తోడ్పడుమంటి ననుమ. 288

గీ. ఈ శిరోరత్నమును నిచ్చి యిపుడు నీకు
తెలియఁజేసిన కథలను దెల్పినంత
విభుఁడు రాఘవుఁ డెంతయు విశ్వసించు
అమితమౌ ప్రేమ నిన్నెంతొ ఆదరించు. 289

క. అని తన సందేశమ్మును
వినిపించిన- హనుమ భక్తివినయాన్వితుఁడై
జననీ! సర్వంబును నే
వినిపించెద వినినయంత విభుఁడున్ వచ్చున్. 290

గీ. అవట కిష్కింధ ప్రస్రవణాద్రియందు
నీ విభుండును - ఇనజుండు- నీ మఱంది
ఎదురుచూతురు నా రాక కెల్లవారు
నెల వొనంగిన పోయివచ్చెదను తల్లి! 291

క. అని మైథిలి సెలవుం గొని
జనకజ మృదుపాదపంకజములకు వినతుల్
వినతుండై పచరించుచుఁ
జనె పావని కొంతదవ్వు జననిన్ గనుచున్. 292

## హనుమంతుఁడు తన మదిలో కార్యశేషమును చింతించుట

గీ. పూర్వకార్యవిరోధంబు పొసగకుండ
అన్యకార్యంబు సాధించు నతఁడె గాదె
సకలదూతార్థవిదుఁడంద్రు శాస్త్రవిదులు
జనని గనుగొంటి కార్యశేషం బికేది? 293

గీ. అనుచుఁ జింతించి ఇంక రావణునితోడ
మాటలాడంగవలె వాని మతము నెఱిగి
చెప్పవలసిన బుద్ధులు చెప్పి నాదు
మదము నించుక చూపి పోయెదనుగాక! 294

ఆ. భుజము నప్పళించి భూతమ్ము లదరంగ
సింహగర్జనంబుఁ జేసి బలిమి
వనము గూల్చి దనుజవరులను వధియించి
లంక గాల్చి మీదు బింక మడచి. 295

ఆ. వార్ధి దాటి పోయి వచ్చెద మరలను
రామవిభుని గూడి రణము సేయ
నన్ను బోలువారు నాకంటె ఘనులును
వానరేంద్రుతోడ వత్తురింక. 296

ఆ. జయము రాఘవునకు జయము లక్ష్మణునకు
జయము ప్లవగపతికి జయము మాకు
జనకజాత పరమసాధ్వీమతల్లిని
తెచ్చె రావణుండు చచ్చు నింక. 297

## హనుమంతుఁడు అశోకవనమును భంజించుట

గీ. అనుచు బొబ్బలు పెట్టుచు తనువు పెంచి
పర్వతాకారమును దాల్చి పవనసుతుఁడు
తోక జాడించి యెగసి అశోకవనము
క్షణములోఁ గూల్చె పెను ప్రభంజనమువోలె. 298

గీ. దానజలగండమత్తవేదండమట్లు
జవమునన్ వీచు పెనుప్రభంజనమువోలె
వ్రేళ్లతోడుత పెకలించి వృక్షచయము
లతలఁ గూలిచి వీరుధ ప్రతతితోడ
పూపుపొదరిండ్లు భంజించి ప్రోవువెట్టె. 299

గీ. నందనము మించు రెండవ నందనమ్ము
చైత్రరథమును మించు విచిత్రవనము
లోకవిఖ్యాతిగన్న అశోకవనము
క్షణములో గూల్చె నా ప్రభంజనసుతుండు. 300

క. ప్రమదాజనయోగ్యంబును
ప్రమదాళినికుంజపుంజభాసురమును నౌ
ప్రమదావనముఁ సీతా
ప్రమదాసగమొండు దక్క భంజించె వెసన్. 301

గీ. జానకీదేవి యున్న వృక్షమును విడిచి
తక్కఁగల వృక్షలతికాప్రతతులనెల్ల
కూల్చి పుష్పఫలాదులు రాల్చి డుల్చి
శోకవనముగఁ జేసె నశోకవనము. 302

క. వనభంగము గావించిన
హనుమంతుని గాంచి విస్మయంబును గొనుచున్
వనపాలకు లెదిరించిన
ఘనవృక్షముతోడ వారిఁ గెడపెన్ బెలుచన్. 303

## హనుమంతుఁడు చైత్యప్రాసాదమ్మును గూల్చుట

క. లంకాద్వీపమ్మునకే అ
లంకారంబౌచుఁదగు సులక్షణచైత్య
మ్మింకన్ గూల్చెదనని ని
శ్శంకన్ మదినెంచి దాని సౌరది యడగన్. 304

క. హుమ్మని చైత్యప్రాసా
దమ్మును బడఁద్రోసి నేల తద్రక్షక సం
ఘమ్మును వీఁకన్ నిజవా
లమ్మునఁ బడఁగొట్టి పదతలమ్ముల రాచెన్. 305

## వనభంగమును విని రావణుఁడు కోపావేశమున హనుమంతుని వధింప ఎనుబదివేల కింకరులఁ బంపుట

మ. వనపాలుర్ హతశేషులైన దనుజుల్ వారెల్ల రేతెంచి, యా
వనభంగంబును దెల్ప రావణుఁడు దుర్వారోగ్రకోపమ్మునన్
ఘనబాహాబలశౌర్యధుర్యులను సుగ్రస్ఫారశస్త్రాస్త్రులన్
హనుమంతున్ వధియించి రండనుచుఁ దా నంపెన్
రూక్షతామ్రాక్షుఁడై. 306

ఉ. రావణునాజ్ఞయే తడవు రాక్షసు లెన్బదివేలకింకరుల్
చేవదలిర్ప నొక్కమొగి శీఘ్రగతిన్ జనుదెంచి ముట్టి, తీ
తావహ శాతశూలవిశిఖాదులు బోరుననేయ రెచ్చి, ఆ
పావని వానినెల్ల తన వాలమునన్ బడఁజేసి యుగ్రుఁడై. 307

క. కొందఱ వాలమ్మున మఱి
కొందఱ సాలమున మోది కొందఱ ముష్టిన్
కొందఱ పదఘాతమ్ముల
కొందఱ పరిఘమునఁ గొట్టి కూల్చె ధరిత్రిన్. 308

## రావణుఁడు జంబుమాలిని బంపుట

ఆ. జంబుమాలి యనెడు జయశాలి నయశాలి
అస్త్రశస్త్రవిదుఁ బ్రహస్తసుతుని
గాంచినంత నతఁడు కరములు జోడించి
అసురపతికి మ్రొక్కి ఆజ్ఞపడసి. 311

ఉ. అతఁడు చాపముంగొని దశాననునాజ్ఞ రథాధిరూఢుఁడై
ఆతతసైన్యముల్ గొలువ నార్చుచుఁ బోయి నిశాతసాయక -
వ్రాతమునేయ వాని తన వాలముతోఁ బత వ్రార్చి దూల్చి అ
వ్వాతసుతుండు పాదహతి వాని రథమ్మును గూల్చి వ్రేల్మిడిన్.

క. కరచరణాహతి రథముల
కరిఘటలన్ హరిచయమ్ము కాల్బలమెల్లన్
ధరఁ గూలిచి హనుమంతుఁడు
పరిఘమ్మున జంబుమాలిఁ బరిమార్చె వడిన్. 313

## రావణుఁడు పంచసేనాధిపతులను బంపుట

గీ. కోపభరమున నిప్పులు గురియ కనుల
కటము లదరంగ నిజదంతఘట్టనమున
మర్కటముఁ జంపి రండని సహితబలుల
పంచసేనాధిపతులఁ బంపించె నంత. 314

ఉ. రాక్షసురాజు నానతి పరాక్రమశాలు లనీక నాయకుల్
రూక్షతరాయుధప్రతతిరోచులు దిక్కులఁ బర్వ పీఁకమై
దక్షులు యుద్ధశిక్షితపదాతిదళంబులు వెంటనంట వే
లక్షల యోధవారము తురంగకరీంద్రరథాధిరూఢులై. 315

ఆ. కలసి వెంటరాగ బలదర్పయుతులౌచు
కదలివచ్చి నిశితకాండచయము
బఱపి చుట్టుముట్టి బహువిధ మారణా
యుధములేసి యార్వ నుగ్రగతిని. 316

ఆ. హనుమ అంత మందరాద్రినా మెఱు పెంచి
గగనమునకు నెగసి గరుడునట్లు
వాలమార్చి శస్త్రవారమ్ము వెసఁ దూల్చి
పరిఘమునను నేలఁబడఁగ మోఁది. 317

చ. కరిఘటలెల్లఁ గూల్చి తురగమ్ముల వార్చి శతాంగపాళులన్
పరిఘగదాప్రహారముల భంగమునేసి పదాక్రమించి వే
తరుగిరిశాఖలన్ గొని పదాతిదళంబుల గిట్టి వ్రేల్మిడిన్
కరువలి పట్టి సింహగతి గర్జనసేయఁగ పాఱి రందఱున్. 318

మ. హతశేషుల్ పఱతెంచి పాదనతులై ఆ పంచసేనాపతుల్
హతులౌటన్ దెలుపంగ రావణుఁడు కోపావేశరూక్షాక్షుఁడై
మతిఁ జింతించుచు సప్తమంత్రిసుతులన్ మాతంగయానంబులన్
ద్రుతరీతిన్ జని శక్తిమంతు హనుమంతున్ జంపఁ బంపెన్
వెనన్. 319

## రావణుఁడు సప్తమంత్రిసుతులను హనుమంతున్ జంపఁ బంపించుట

ఉ. వారు చతుర్విధప్రచురవాహినితో నెదిరించి పేర్చి వి
స్ఫారధనుర్విముక్త శితసాయక భల్లములన్ వెలార్ప, నా
ధీరుఁడు మారుతాత్మజుఁడు దీప్తహుతాశసమట్లు రేఁగి, ఆ
తోరణ లోహదండమున దోహలుఁడై పరిమార్చె వారలన్. 320

ఆ. చావుదప్పి భటులు సంభ్రాంతిఁ పఱతెంచి
మంత్రిసుతుల ఘోరమరణవార్త
తెలియఁజేసినంత దీప్తాగ్నిశిఖ వోలె
మండిపడుచు రావణుండు నడచె. 321

## హనుమంతుఁడు అక్షకుమారుని వధించుట

ఆ. దక్షుఁడైన పుత్రు అక్షకుమారుని
జూచినంత నతఁడు లేచి నిలిచి
తక్షణమ్మ తాను లక్షసైన్యమ్ముతో
రథగజాశ్వసుభటరాజితోడ. 322

ఆ. బయలువెడలి వచ్చి పర్వతాకారుని
తోరణస్థు హనుమ శూరవరుని
కాంచి మదిని మెచ్చి కాంచనధనువున
వాడి శరము తొడిగి వాయుతనయు. 323

ఆ. నొవ్వ నేయ నతఁడు నొచ్చియు మదిమెచ్చి
శూరుఁ డితఁడు చాల సుందరుండు
బాలుఁడయ్యు మేటి బలశాలి నయశాలి
రాక్షసేశు పుత్రరత్న మితఁడు. 324

ఆ. వీని బలము చలము వీక్షించి యాపైని
గెదపువాఁడ ననుచు నడరి యార్చి
తోరణస్థగదను దోర్దండమున దాల్చి
హరులు కరులు రథములన్ని గూల్చి 325

ఆ. ఆకసమున కెగయ నాతని గనుగొని
బాహుబలము నస్త్రబలముఁ జూప
రథముతోడ నెగసి రణదక్షుఁ డక్షుండు
హనుమపైని బఱపె నస్త్రచయము. 326

ఉ. వాలముతోడ నస్త్రముల వాలిచి తూలిచి వాయుపుత్రుఁడున్
సాలముతోడ మోఁది రథసారథి సాశ్వరథమ్ము గూల్చి ఆ
కాలుని కాలదండ మనగాదగు ఆయసదండమూని ఆ
బాలసుపీడు శీర్షమును వ్రయ్యలుసేసెను గ్రోధమూర్తియై. 327

ఆ. అక్షపుత్రు గూల్చి ఆ తోరణస్తంభ
మందు నిలిచి వాయునందనుండు
యుద్ధకాంక్షియగుచు నుగ్రరూపము దాల్చి
సింహనాదమంతఁ జేసెఁ బెలుచ. 328

## హనుమ మేఘనాదునితో యుద్ధము సేయుట

ఆ. కొడుకు యుద్ధభూమిఁ గూలిన దుర్వార్త
చెవిని పడినయంత చేష్టదక్కి
పొక్కి మిగుల అక్షపుత్రా ! యటంచును
ఆర్తిఁ గ్రుంగి క్రోధమూర్తియగుచు. 329

ఆ. ఏన వానిఁ జంప నేగెదనని లేవ
ఇంద్రజిత్తు రాక్షసేంద్రు గాంచి
ఏను గలుగ మీర లేగుట తగ దేను
వానరమును బట్టి వత్తు ననిన. 330

గీ. పుత్ర ! ఆతండు వానరమాత్రుఁ డౌనె ?
భవుఁడొ విష్ణువొ ఆ పద్మభవుఁడొ యిట్లు
వానరాకృతి మెయిఁ బూని వచ్చిరేమొ !
ఆత్మరక్షణపరుఁడవై అరుగుమోయి ! 331

చ. అని బహురీతి యుద్ధవిషయ లన్నియు దెల్పుచు హెచ్చరించి వే
చనుమన మేఘనాదుఁడును చాపనిషంగ కృపాణధారియై
కనకమహారథమ్మునయి గర్వపరాక్రమరేఖ నేగి తో
రణగతు వాయునందను దురమ్మునకున్ బురికొల్పి యార్చుచున్.

చ. ఘనతరకార్ముకమ్ము గొని గర్వపరాక్రమహేల మీరగా
తన భుజసారమెల్ల గొని దారుణకాండములేసి నొంప నా
హనుమయు నొచ్చి యార్చుచు విహాయసవీధికి నేగి పీఁకమై
తన భుజలోహదండమునఁ దద్రథమున్ వడి గూల్చి యంతటన్.

క. అరదమ్ముల భంజించియు
తురగమ్ములఁ గొట్టి గిట్టి తుత్తునియలుగా
వరయోధుల మడియించియు
కరిఘటలన్ గూల్చె నొక్క క్షణకాలమునన్. 334

ఆ. ఇంక నాలసింప యేమౌనో యను శంక
అజునిగూర్చి తపము నాచరించి
పడసినట్టి కడిది బ్రహ్మాస్త్రమును నేయ
అనిలసుతుఁడు మూర్ఛమునిగి తెలిసి. 335

ఆ. బ్రహ్మవరము వలన బ్రహ్మాస్త్ర మిది నన్ను
ఏమి చేయదంచు నెంచి మదిని
దనుజపతిని జూడఁదలచిన వాఁడౌట
పట్టుపడియె దనుజభటుల కంత. 336

ఆ. వారు మూర్ఖులగుట వానరమను బుద్ధి
పట్టి కట్టి రాజపథము వెంట
సింహనాదములను జేయుచు గొనితేర
ఇంద్రజిత్తు రాక్షసేంద్రు గాంచి. 337

ఉ. వానరమాత్రుగా మదిని భావనసేయక రాజనీతిమై
దానవనాథ ! యుక్తమగు దండవిధిన్ బరికించి సన్మతిన్
వీనికి శిక్షవేయుఁడని విన్నపమొప్పుగఁ జేసినంత నా
వానరు దివ్యతేజము నవార్యపరాక్రమ మెంచి నెమ్మదిన్. 338

ఉ. వానపుఁడో, కుబేరుడొకొ వారిధినాథుఁడొ, దండపాణొ ఈ
వేసము దాల్చి వచ్చిరొకొ ! వీఁ డరయంగ మహేశుఁడొనొ! సం
త్రాస మొకింత లేదు బహుదైత్యుల నాహవమందుఁ గూల్చి, ఆ
యాసము నంద డేమియు ప్రహస్త ! విచారణ చేయుమీ యనన్.

## ప్రహస్తుఁడు హనుమంతుని ప్రశ్నించుట

ఉ. ఎవ్వరివాఁడ వీవు ? నిను నెవ్వరు వంపిరి ? ఏమి కారణం
బివ్వని గూల్పగా కత మదేమి ? వచింపుమ ! అంతఁబోక ఈ
చివ్వకుఁ గారణం బెదియొ చెప్పుమ ! ఈ యెడ నేమి సేయగా
ఇవ్వనధిం దరించితివొ! ఎల్లను సత్యముగా వచింపుమా ! 340

ఆ. నిజము చెప్పు దేని నిన్నిట విడివింతు
అనృతమాడుదేని హతుఁడవగుదు
రాక్షసేసుఁడైన రావణు కొలువులో
తప్పిపోవ నీకుఁ దరము కాదు. 341

## ప్రహస్తుఁ డడిగిన ప్రశ్నలకు హనుమంతుఁడు రావణుద్దేశించి సమాధానమును చెల్పుట

క. తన వాలము పీఠముగా
హనుమంతుఁడు గూరుచుండి అందఱుఁ గనుచున్
మనమందున లేశంబును
అనుమానములేక తా దశాననుఁ గనుచున్. 342

గీ. రావణా ! వినుమ- నేను సుగ్రీవమంత్రి
రాజమణియైన శ్రీరఘురాముదూత
పవనతనయుండ నంతటి బలయుతుండ
వసుమతీపుత్రిఁ గనఁగ నే వచ్చినాఁడ. 343

గీ. వనముఁ గూల్చితి వానరత్వమునఁ జేసి
నన్ను జంపంగవచ్చు సైన్యమ్ము నెల్ల
సంహరించితి నిందు దోషంబదేమి ?
ఆత్మరక్షణ మరయ న్యాయమ్ము గాదె ! 344

## పావని రావణునకు హితబోధ సేయుట

గీ. అజుని వరమున నన్ను బ్రహ్మాస్త్రమిద్ది
ఏమి సేయంగలేదైన ఇట్టు లేను
గట్టువడి వచ్చినాఁడ నిన్ గాంచ నెంచి
అపుడె నను వీడి యేగె బ్రహ్మాస్త్రశక్తి. 345

గీ. బ్రహ్మవంశమ్ము నందునఁ బ్రభమమంది
వరతపమ్మున వరములు వడసి పెక్కు-
ఖ్యాతికెక్కిన నీవు రాక్షసుఁడ వౌదె !
పరమసాధ్విని అపహరింపంగఁ దగునె ? 346

గీ. రాక్షసేశ్వర ! శ్రీరఘురాముఁ డెన్న
రాజమాత్రుండె అతఁడు నారాయణుండు
అతఁడు గోపింప బ్రహ్మరుద్రాదులైన
ఎదుర నిల్వంగలేరు నీవెంత గనుమ. 347

గీ. వాలి నెఱుఁగుదుగాదె అవ్వాలి నతఁడు
కోల నొక్కట నేలపైఁ గూల్చె వినుమ
కార్తవీర్యార్జునున్ జంపి గణుతిగన్న
పరశురాముని ఆతఁడు భంగపఱచె. 348

చ. పరసతియంచు నెమ్మదిని భావన సేయక పాపబుద్ధివై
పరమసతీమతల్లి గుణభవ్యను సీతను దెచ్చినావహో !
గరళము మ్రింగఁ జూచెదవె ! కాలభుజంగముఁ బట్ట నెంతువే !
పరసతి సీత నీకు యమపాశమ - మృత్యువు గోరుకొందువే! 349

క. నలకూబరశాపమ్మది
తలపునకున్ రాదె నీకు దశకంధర ! నీ
వల సీతాసతి బట్టిన
తల వ్రయ్యలుగాదె మదిని దలఁప విదేలా ? 350

ఉ. రాముని బాణవహ్నికి విరాధ కబంధ ఖరాదులెల్లరున్
హోమముగారె ! ఆతని మహోజ్వలశస్త్రమహాగ్నికీల నీ
ధామము భస్మమౌట యది తథ్యము, నమ్ముము నాదుమాట నీ
క్షేమముగోరి చెప్పెదను సీతను రామునికిచ్చి గొల్వుమా! 351

ఉ. శాతశరాళి రాముఁడు నిశాచరకోటిని గూల్చకుండ భూ
జాతను సీత నాతనికి సన్మతి నిచ్చి ప్రసన్ను జేసి, వి
ఖ్యాత పులస్త్యవంశమును గావు మదట్టులు గాదయేని ము
త్రాతలు గావవచ్చినను తప్పదు మృత్యువు నీకు రావణా ! 352

క. శరణాగతరక్షకుఁడున్
కరుణావరుణాలయుఁడు కార్ముకవిద్యా
పరమేశుఁడు రఘురాముఁడు
నరరూపము దాల్చినట్టి నారాయణుఁడే ! 353

చ. దురమున నీ శిరమ్ములను ద్రుంచకపుండర సత్వరమ్ముగా
ధరణిజ నప్పగించి దగ తచ్చరణమ్ముల వ్రాలి భక్తిమై
శరణము గోరుదేనిఁ గడు శత్రువవైనను బ్రోచు రాఘవుం
డురుకరుణామయుండు మహిమోన్నతి విష్ణుసమానుఁ డెన్నగా.

## హనుమంతుని హితబోధకు రావణుఁడు కోపము చెంది ఈ కోతిని చిత్రవధ చేయుఁడని అంగరక్షకుల కాజ్ఞ నొసంగుట

క. వరదానవసురకిన్నర
గరుడాదులవలన చావు గలుగదు గానీ
నరవానరజాతులచే
మరణమ్మిక తప్పదనుచు మదిలోఁ గనుమా ! 355

క. అని నిష్ఠురముగ నాడిన
హనుమంతుని నుడులు వహ్ని కాజ్యము వోలెన్
కనలున్ బెంపఁగఁ గన్నుల
కణకణమను మండు టగ్నికణములు రాలన్. 356

క. తన యంగరక్షకులఁ గని
వనచరు నిక్కోతిఁ జిత్రవధ సేయుఁ డనన్
హనుమానుఁడు నుత్కటమగు
కనలున నిట్లనియె- పంక్తికంథరుఁ డదరన్. 357

గీ. రావణా ! విన్మ నీ యంగరక్షకులకు
శక్యమే నన్ను వధియింప స్వల్పబలులు
వీరలే గాదు నీవంటివారు వేయి
రావణులుగూడ నన్నుఁ జేరంగలేరు. 358

క. మితిమీఱుచు నాడెదు నీ
మతిహీను వనాటు నిట్లు మడియింపుఁడటం
చతికోపమ్మునఁ బల్కిన
మతిశాలి విభీషణుండు మైకొనకంతన్. 359

## "దూత అవధ్యుఁ"డని విభీషణుఁడు వారించుట

ఉ. ఈతఁడు దోషియయ్యె వధకెంతయు నర్హుఁడునయ్యె అగ్రజా!
దూతను జంపరెయ్యెడను, దోష మదెంతయు, రాజనీతిలో
దూత అవధ్యుఁడంచు విబుధుల్ వచియించుట నీ వెఱుంగవె !
దూతకు కొన్ని శిక్షలు స్మృతుల్ వచియించెను వానిఁ గాంచుమా,

ఉ. భ్రాత విభీషణుండు బహుభంగుల శాస్త్రవిధిన్ వచింపఁగా
అతని బోధలెల్ల విని ఆ దశకంఠుఁడు కొంత శాంతుఁడై
దూతకు యోగ్యశిక్షలు స్మృతుల్ వచియించె నవెన్నియో కశా
ఘాతమొ అంగవైకృతమొ శైశికముండనమో తగున్ గదే! 361

## హనుమంతుని తోక కాల్చుఁడని
## రావణుఁడు ఆజ్ఞాపించుట

ఉ. వానరజాతికెల్ల తమ వాలముపైఁ గడుప్రీతి గాన– ఈ
వానరు వాలముం దిగిచి వస్త్రములన్ దగఁజుట్టి యంతటన్
నూనియలోన ముంచి వెస నూల్కొనఁ జేసి మహాగ్నికీలలన్
వీనిని గట్టి కొట్టి పురవీధులఁ ద్రిప్పుడటంచు పంపినన్. 362

ఉ. వారలు నట్లుచేసి– పరివారముతోడుత వాద్యఘోషలన్
చారుఁడు చోరుఁడంచును విశాలపురమ్మున రాజవీధులన్
కేరుచు కేకరించుచును గీద్పడఁ జేయుచుఁ ద్రిప్పుచుండ దు
ర్వారబలుండు మారుతి పురంబును గాంచగ నోర్చె నోర్మిమై.

## సీతాదేవి ప్రార్థనమున- హనుమంతుని వాలాగ్నికీలలు చల్లనగుట

క. పురకాంతలు వేడుక గో
పురవీధుల నిలిచి చూడ- పురిగల యువకుల్
కరతాళము లేయుచు నా
హరిపుంగవు ద్రిప్పి రంద తాపురమంతన్. 364

ఉ. సీతను గాచు రక్కసులు శీఘ్రగతిన్ బఱతెంచి నవ్వు చా
కోతిని తోఁక గాల్చి కసిఁ గోలలఁ గొట్టి రటంచుఁ దెల్ప భూ
జాతయు జాతవేదసుప్రశస్తవచస్సులఁ బ్రస్తుతింప- అ
వ్వాతజు వాలభాగమున జ్వాలలు శీతలమయ్యె వింతగా. 365

ఆ. వాలమందు నగ్నికీలలు చల్లనై
బాధ కలుగకుండ ప్రజ్వలింప
హనుమ మదిని మిగుల ఆశ్చర్యమును జెంది
మహితజనకపుత్రి మదిని మ్రొక్కె. 366

క. సీతారాముల మహిమగ
వాతాత్మజుఁ డెంచి మదిని వారికి వినతుల్
చేతస్సునఁ బచరించుచు
జాతా మోదమ్ముతోడ జ్వలనున్ గనుచున్. 367

## హనుమంతుఁడు లంకను గాల్చుట

ఆ. వీతిహోత్రునకును విందులు గావింప
వలయుననుచు మదిని దలఁచి హనుమ
బంధనములఁ ద్రెంచి భటులను వధియించి
గోపురమున కెగసి యేపు మీఱి. 368

క. వాలమునందలి యగ్ని
జ్వాలల నవరత్నఘటిత సౌధములెల్లన్
గాలిచి వ్రీలగ గూల్చిన
గోలాంగూలమ్ము గాంచి 'కో' యని దనుజుల్. 369

ఆ. చుట్టుముట్ట వారి జుట్టును మీసముల్
వాలవహ్నిఁ గాల్చి వారిఁ గూల్చి
రాక్షసేంద్రు భవనరాజమ్ముపై దూకి
క్ష్వేళనమ్ము చేసి చిచ్చుపెట్టె. 370

ఉ. రావణు సౌధరాజమును రత్నవినిర్మిత రాణివాసమున్
చావడులున్ సువర్ణమయశాలలు రాజితచంద్రశాలలున్
రావణు పుత్రపౌత్రుల చిరంతనరత్నసువర్ణవేశ్మముల్
పావని వాలవహ్ని నిడి భస్మము చేసెను భీషణాకృతిన్. 371

ఆ. కుంభకర్ణ గృహము కుంభోదరుని మేడ
జంబుమాలికుంభ సదనములను
ఇంద్రజిత్తుభవన మెల్ల లంకాపురి
కాల్చి రత్నధాతుగణము వేల్వ. 372

ఆ. కాలభైరవుండొ కాలుండొ నందియో
ఇట్టువచ్చి లంక నేర్చె ననుచుఁ
దలఁచి దైత్యకోటి తల్లడపాటున
పఱచి వనధిలోనఁ బడిరి భీతి. 373

క. హనుమంతుం డట్లు విభీ
షణు గృహమున్ విడిచి లంక సర్వగృహంబుల్
తన వాలాగ్నిని గాలిచి
చని వనధిన్ వాలవహ్ని చల్లార్చి వెసన్. 374

## లంకాపురదాహమున "సీతాదేవి దగ్ధమైనదేమో" అని హనుమంతుఁడు చింతాక్రాంతుఁడగుట

గీ. పురిని గాల్చితి గాని ఆ ధరణితనయ
ఏమియయ్యెనో గననైతి హీనమతిని
కీడదేమైన ఆమెకు మూఁడెనేని
వ్యర్థమౌ గాదె నాదు ప్రయాసమెల్ల. 375

ఉ. ఏమిఁకఁ జేయువాఁడను మహీసుత వహ్నిని దగ్ధమైన, నే
నేమిఁక అంగదాదులకు ఈ విషవార్తను దెల్పువాఁడ, నే
నేమిఁక రామలక్ష్మణకపీంద్రులకున్ వచియించువాఁడ, నే
మోమెటు జూపువాఁడ కపిముఖ్యులకున్ బిడియమ్ములేక, నే
నా మతిహీనకృత్యపరిణామ మిదిట్టి దటంచు నించుకేన్
నా మది నెంచనైతిని అనంతదురంతవిషాదవార్త నే
నేమని దెల్పు దెల్లరకు ఇచ్చటనే మునివృత్తి నుండు, నే
నీ మెయి అగ్నిలో విడిచి ఇయ్యెడ ప్రాణములన్ త్యజించెదన్.

గీ. అని విచారించుచుఁడ— చారణగణమ్ము
"అగ్ని కాహుతియయ్యె లంకంత గాని
సీత మాత్రమ్ము వనిలోన క్షేమముగను
ఉండె"నను మాట వినువీధినుండి వినిచె. 377

క. జనకజ క్షేమమ్మును విని
మనమున ముదమంది బుద్ధిమంతుండగు నా
హనుమంతుఁడు సీతాపద
వనజమ్ముల వ్రాలి లజ్జపడుచున్ నిలువన్. 378

## లంక గాల్చివచ్చి లజ్జితుఁడై నిల్చియున్న హనుమ గాంచి సీత ప్రసన్నవదనయై అడిన మాటలు

గీ. హనుమ బలవిక్రమములు ప్రత్యక్షముగను
గాంచుటను జేసి మనమున కరము మెచ్చి
పవనతనయుని గాంచి యప్పరమసాధ్వి
జనకపుత్రిక పల్కె ప్రసన్నఫణితి. 379

గీ. ఫలములన్ గొని సంవృతస్థలమునందు
ఇందు నెందైన ఒకదిన ముందువేని
క్రూరరాక్షసపీడ లేకుండ నేను
హాయి నుండెద నొకదినమయిన హనుమ! 380

## సీతాదేవి దుఃఖమును గాంచి హనుమంతుఁడు తన స్కంధమున దాల్చి తల్లిని గొనిపోయెదనని చెప్పుట

గీ. ఈవు పోయిన రెన్నెల లెట్టు లేను
గడపుదానను హనుమ! రాఘవును జూచు
భాగ్యమెన్నడు గల్గు? అభాగ్యురాల
రాము నెట్టులు నేను శీఘ్రమ్ము గందు. 381

గీ. అనుచు దుఃఖించు జానకి హనుమ గాంచి
జనని! అట్లైన నిపుడె నా స్కంధమందు
గూరుచుండుము శ్రీరఘువీరు పాద
సన్నిధిని నిన్ను నిల్పెద క్షణములోన. 382

ఉ. వాయుజవంబు మించి చనువాడను వింటిపథమ్మునంటి నే
నీ యసురాధముల్ విను మదేమియుఁ జేయగలేరు దేవి! ఈ
ఆయతబాహుదండమున అసురకోటిని గూల్తు వారిధిన్
వాయుసుతుండనమ్మ! రఘువంశవిభూషణరామదాసుఁడన్. 383

గీ. అనిన హనుమంత! నీవొదు వంతవాఁడ
విందు నామది సందేహమేమి లేదు
కాని రాఘవుఁ డుత్తమ క్షత్రియుండు
పరులు తనసతి విడిపింప భావ్యమగునె! 384

ఉ. ఆతఁడు రాక్షసాంతకమహాస్త్రవిదుండు, మహాత్ముఁ డీ జగ
జ్జాతమునెల్ల నిచ్చ నుపసంహరణంబును జేయఁజాలు, తా
నాతతవిక్రమస్ఫురణ నసురనాథుని గూల్చి రావణున్
జేతమెలర్ప నన్ గొనిన శ్రీరఘువీరుని కద్దియుక్రమా. 385

క. కావున రెన్నెల కట్టులో
జీవములన్ దాల్చియుండు శ్రీరఘువీరుం
డీ వారిధి బంధించియు
రావణు వధియింప వేగ రావలెననుమా! 386

ఆ. నెల వొసంగుదేని శీఘ్రమ్ము నే నేగి
అమ్మహాత్ము దర్శనమ్ము చేసి
జనని! తావకీన సందేశ మదియెల్ల
విన్నవించి వారి వేగఁదెత్తు. 387

ఆ. అనుచుఁ బలికి పవనతనయుండు వినతుఁడై
జనని విమలపాదజలజములకు
భక్తి నతులు సేయ "పావని! విజయోస్తు!"
అనుచుఁ బలికి హనుమ ననిచెఁ గూర్మి
రమ్యసుగుణసాంద్ర! రామచంద్ర! 388

## హనుమంతుఁడు లంకనుండి మరలివచ్చుట

ఆ. జనని గాంచి కార్యసాఫల్యమును గాంచి
ఇంచు భక్తి మది స్మరించి నిన్ను
తిరిగి పోవనెంచి తిలకించి వైదేహి
అంజలించి భక్తి నరిగె హనుమ. 389

ఆ. చనుచు హనుమ మరల జానకి భక్తి న
మస్కరించి నిన్ను మదిని గొలిచి
జనకుఁ బవను దలఁచి జలధితీరస్థమౌ
అల "అరిష్ట" పర్వతాగ్ర మెక్కి. 390

ఆ. అకసమ్మునంట ఆయతదేహుఁడై
క్ష్వేళనమ్ము చేసి సింహగతిని
పాదఘట్టనమున పర్వత మవనిలో
నరగఁ ద్రొచ్చి భూమి సమత గాంచె. 391

క. మోదమ్మున దివిజుల్ గన
హ్లాదమ్మన జనుచు దా విహాయసవీధిన్
నాదమ్మున దిక్కులు ప్రతి
నాదము లీనంగ సింహనాదము చేయన్. 392

క. ఆ నాదము విని మన హను
మానునిదే యౌను నిజ మమానుష మఱయన్
మానిని సీతన్ గని హను
మానుఁడె చనుదెంచు ననుచు మదికిన్ దోచున్. 393

క. అని జాంబవంతుఁ డనిసన్
విని వానరవీరులెల్ల వికసితముఖులై
వినువీధికిఁ దా మెగయుచు
ఘనవాలములార్చి సింహగర్జన లెసఁగన్. 394

## అంగదాదులు హనుమంతునకు స్వాగతము బల్కుట

ఆ. హనుమ వచ్చు దక్షిణా శాభిముఖులౌచు
అంగదాదులెల్ల నమిత కౌతు
కమునఁ జూచుచుండగా వచ్చె వినువీధి
పవనగతిని మించి పవనసుతుఁడు. 395

ఆ. అంగదాదులెల్ల ఆతని కెదురేగి
స్వాగతమ్ము పలుక వాయుసుతుఁడు
చూచినాడ సీత శుద్ధాత్మ లంకలో
అనుచుఁ బల్కె మోద వవధులెగయ. 396

ఆ. అనినయంత వార లానందముగ్ధులై
అతని నెత్తి భుజములందు జేర్చి
ఆడి పాడి వాల మల్లార్చి దాటుచు
భక్తి రక్తి మధురఫలము లిచ్చి. 397

ఆ. స్వాస్థ్య మడిగి జనకజాత యా సీతమ్మ
క్షేమమడిగి ఆమె స్థితిని నడుగ
పూసగ్రుచ్చినట్లు పోయిన తెరగెల్ల
వారి కంత వినిచె వాయుసుతుఁడు. 398

## హనుమదాదులు మధువనమున ప్రవేశించుట

క. మన మిప్పుడ శ్రీరాముని
గనఁ జని జనకాత్మజాతఁ గాంచిన తెరగుల్
వినిపింపఁగవలెనని ఆ
హనుమంతుఁడు పలుక నంగదాదులు నంతన్. 399

క. వినువీధిని కిష్కింధకుఁ
జనుచున్ మార్గంబునందు సన్మధువనమున్
గనుగొని క్షుత్తృష తీరగ
హనుమంతునితోడ మధువు లానుదమనినన్. 400

క. హనుమానుఁడు శ్రీజానకిఁ
గనివచ్చుటఁ జేసి కౌతుకమ్మున తారా
తనయుం డంగదయువరా
జనుమతిఁ దా నిచ్చె మధువు లానుండనుచున్. 401

చ. దధిముఖరక్షితమ్ము బహుధా, మధుకోశసమంచితమ్ము స
న్మధురఫలావనమ్రతరుమండితమంజులతానికుంజమున్
మధుకరపుంజపక్షికులమంజుకలస్వనరంజితమ్ము నౌ
మధువనమంత గాంచి హనుమంతునితోడుతఁ జొచ్చి రందఱున్.

మానిని- తేనియ లూరెడి తీయనిపండులు తించును కొమ్మల ద్రిమ్మరుచున్
తేనియలానుచు తృప్తిగఁ ద్రేన్పుచు దిక్కుల దాటుచు తేకువతో
గానము సేయుచు గంతులువేయుచు కయ్యముసేయుచు
గర్వముతో
వానరులెల్ల రవారితవృత్తిని వాలుచు సోలుచు నర్తిలగా. 403

## దధిముఖుఁడు వారల వారింపలేక సుగ్రీవునకు విన్నవించుట

గీ. మధువనంబును పాలించు దధిముఖుండు
హనుమదాదుల వారింప అంగదుండు
బాహుదండంబునన్ వ్రేయ పాఱి యతఁడు
విన్నవించెను సుగ్రీవ విభునకెల్ల. 404

క. అది విని సుగ్రీవుండును
మదిలో నానందమంది మధువనపాలున్
సదయన్ గాంచుచు- అయ్యం
గదముఖ్యుల వేగఁ జూడఁగావలె ననుచున్. 405

ఆ. మధువనంబునట్లు మధియించుటది చూడ
వారు సీతఁ గాంచి వచ్చియుందు
రనుచు మాకుఁ దోచు అంగదముఖ్యుల
పంపు మిప్పుడ యనుచు పనిచి వాని. 406

చ. ఇనకులవార్ధిచంద్ర ! మన మిప్పుడ జానకి క్షేమవార్త యీ
అనఘచరిత్ర ! విందు మదే. అంగదముఖ్యులు వచ్చుచున్నవా
రని వచియించుచుండగ విహాయసవీధిని వచ్చి వారు స
జ్జనసుతరామ ! నీదు పదసన్నిధి వ్రాలిరి భక్తి నమ్రులై. 407

## హనుమంతుఁడు సీతక్షేమాదులను దెల్పుట

క. హనుమంతుఁడు త్వన్మృదుపద
వనజమ్ముల కెఱగి భక్తిభావముతోడన్
కనుగొంటిని జానకి ననె
కనులన్ సమ్మోద బాష్పకణములు జారన్. 408

ఆ. సీతఁ గంటిననుచుఁ జెప్పిన నిసజుండు
నీవు లక్ష్మణుండు నిండుప్రీతి
హనుమ గాంచి మిగుల ఆనందముగ్ధులై
అతని భక్తి శక్తి నభినుతించి. 409

ఆ. ఎచట నుండె సీత ఏ రీతి తా నుండె ?
క్షేమమౌనె ఆమె యేమి తెల్పె ?
ఆనవాలుగాగ అవనిజ ఏమిచ్చె ?
అనుచు నీవు నడుగ అనిలసుతుఁడు. 410

ఆ. అనఘచరిత ! దక్షిణాబ్ధిమధ్యంబున
దైత్యనాథు రాజధాని 'లంక'
అనెడి పురము గలదు అందు నశోకాఖ్య
వనమునందుఁ గంటి జనకపుత్రి. 411

గీ. రావణాసురు నంతఃపురమ్ము ప్రక్కన
అనుపమాన మ్మశోకాఖ్యవనము గలదు
అందు క్షేమమ్ముగానుండె అమ్మ సీత
ఆమె గాంచితి జన్మ ధన్యత్వమందె. 412

ఆ. ఘోరమూర్తులైన క్రూరరాక్షసు లామె
గాచుచుండ్రు సర్వకాలమందు
వ్యాఘ్రములకుఁ జిక్కి వ్యాకులచిత్తయౌ
హరిణి బోలియుండె అవనితనయ. 413

గీ. అనశనస్థితి చిక్కిన యంగయష్టి
ధూళిధూసరగాత్రియై నేల పండి
ఏకవేణియునై నిన్నె ఎల్లవేళ
తలఁచి తపియించు సాధ్వీమతల్లి సీత. 414

గీ. అసురకాంతలు నిద్రించు నవసరమున
అమ్మ సీతమ్మ దర్శించి అంజలించి
ఆర్తి తొలగంగ మీ క్షేమవార్త దెలిపి
విన్నవించితి మీ కథ విస్తరించి. 415

గీ. ఆమె నన్నెన్నొ ప్రశ్నమ్ము లడుగ నేను
ఉచితరీతిని నిచ్చి ప్రత్యుత్తరములు
ఆనవాలుగ త్వన్ముద్ర నందఁజేయ
సీత అద్దాని ముద్దాడి శిరమునఁదు. 416

గీ. ఉరమునందును జేర్చి తా నొక్కక్షణము
కనుల నానందబాష్పముల్ గ్రమ్మికురియ
నిన్ను మదిలోన భక్తి ధ్యానించి జనని
తనువు పులకింప తన్మయత్వమ్ము చెందె. 417

ఆ. నన్ను నంత నమ్మి నాతోడ భాషించె
నను చు పూనగ్రుచ్చినట్లు తనకు
జానకమ్మ కయిన సంవాదమది యెల్ల
విన్నవించి భక్తి వినతి సేసి. 418

గీ. ఆనవాలుగ సీతమ్మ అంపినట్టి
మహితమై యొప్పు ఆ శిరోమణిని నీయ
కనుల నానందబాష్పముల్ గ్రమ్మిజార
దాని గైకొని తన్మయత్వమ్ము నంది. 419

గీ. మణిని జూపించి ఇనజ లక్ష్మణులకెలమి
ఇంద్రుఁ డిద్దాని జనకున కిచ్చె మున్ను
దాని నతఁ డిచ్చె సుతకు నుద్వాహవేళ
అనుచు వచియించి ఎడదకు హత్తుకొనవె !
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 420

గీ. మరల మారుతి గనుగొని మమ్ము గూర్చి
ఇంక జనకజ ఆనవాలేమి దెల్పె
అనుచు నానందవశుఁడవై అడుగ నీవు
సీత చెప్పిన కథలు వచించె నిట్లు. 421

గీ. చిత్రకూటాద్రిపై నీవు సీత గండ
ఫలకమున దీర్చు మకరికా పత్రములను
జ్ఞప్తికిం దెమ్మయని పల్కి జానకమ్మ
ఐంద్రకాకమ్ము వృత్తాంతమంత దెలిపె. 422

ఆ. పక్షిపైని నాఁడు బ్రహ్మాస్త్ర మారీతి
పరపె విభుఁడు నేఁడు పరపఁ డేమి ?
అతఁడు కోపగింప ఆ బ్రహ్మరుద్రాదు
లెదురలేరు రాక్షసేశుఁ డెంత ! 423

ఆ. కాన రాఘవుండు గడువు దాటకమున్న
వచ్చి రాక్షసేంద్రు గ్రచ్చి నాదు
చెఱను బాపి విభుడు శీఘ్రమ్ము గొనవలె
ననుచు విన్నవింపు మనియె జనని. 424

గీ. సతిని చెఱగొన్న దుష్టరాక్షసు వధించి
తరుణిఁ బ్రోచుట యది క్షాత్రధర్మ మనియె
దుష్టరాక్షసకోటిని దునుమ విభుఁడు
చేసె శపథమ్ము నది జ్ఞప్తిసేయు మనియె. 425

గీ. మహితగుణశాలి మఱఁది లక్ష్మణుని సేమ
మడిగినట్టులు దా జెప్పమనుచు ననియె
వదినె ఆడిన మాటలు మదిని నిడక
తన్ను మన్నింపుమని చెప్పమనుచు నుడివె. 426

చ. అని యిటు లెన్నియేని జనకాత్మజ గద్గదఖిన్నకంఠియై
యన విని నేను తల్లి! దనుజాధము రావణుఁ గూల్చి వ్రేల్మిడిన్
నిను గొనిపోవు రాఘవుఁ డనింద్యచరిత్రుఁ డయోధ్యకంచు నా
జననికి ధైర్యముం గొలిపి సాగరమున్ దరియించి వచ్చితిన్.

## అంగదుండు హనుమంతుని బలపరాక్రమాదుల దెల్పుట

ఉ. అంతట నంగదుండు వినయంబున నీకు నమస్కరించి తా
నంతలు సేసికూడ వినయంబున నాత్మబలంబు దెల్పఁ డా
వంతయు వాయుజుం డనుచు ఆతని భీమపరాక్రమక్రమం
బంతయు విన్నవించె కడు నచ్చెరువందగ నీవు నందఱున్. 423

సీ. శతయోజనాయామ సాగరమ్మును దాటె
మైనాకుచేత సన్మానమందె
లంకాధిదేవత బింకమ్ము నడగించె
రావణు నంతఃపురమ్ము సొచ్చె
నందనసదృశవన మ్మశోకము గూల్చె
వనపాలకుల నేల వ్రాల్చి పేర్చె

పంచ సేనానుల పంచత్వమందించె
మంత్రిపుత్రుల పరిమార్చి యార్చె
రాక్షసేశుని పుత్రరత్న మక్షుని జంపె
సమరదుర్వార రాక్షసుల నొంచె
రావణునితోడ భాషించి రమణి సీత
రామవిభునకు నర్పించి ప్రాణరక్ష
చేసికొమ్మని బుద్ధులు సెప్పి వచ్చె
కసరి యాతఁడు తోఁకను గాల్ప పేర్చి
లంకయెల్లను గాల్చె నిశ్శంకవృత్తి
ఇంతసేసియు చెప్ప డావంత యితఁడు. 429

చ. అని వచియింప నంగదుఁడు ఆ హనుమంతుని పేర్మి గాంచుచున్
కనుల ముదశ్రుబిందువులు గ్రమ్మగ బాహులు సాచి కూర్మిమై
ఘనతరబాహుబంధమునఁ గౌఁగిట జేర్చవె అందఱున్ గనన్
హనుమకుఁదక్క నన్యులకు అబ్బునె తాదృశ భాగ్యసంపదల్.

కవిరాజ విరాజితము :

దశరథనందన! తాపసనందన! ధార్మికసత్తమ! ధర్మచరా!
పశుపతిచాపవిభంజన! రంజిత భార్గవగర్వవిభంగకరా!
దశవదనాదికదారుణరాక్షసదారణదక్షసుధర్మకరా!
పశుపతిపూజితపాదసరోరుహ! బంధురకంధర! భవ్యకరా! 431

## కాండాంతగద్యము

శ్రీమదాకుండ్యన్వయపవిత్ర, ఆత్రేయసగోత్ర, మహోక్ర
ప్రపౌత్ర, జగన్నాథశాస్త్రిపౌత్ర, ఉద్దండపండితగ
పుత్ర, విద్వజ్జనవిధేయ, ఉభయభాషాప్రవీణ,
సూర్యనారాయణశాస్త్రినామధేయ ప్రణీ
తంబయిన ప్రత్యక్షరామాయణ
మహోకావ్యంబున సుందర
కాండము సర్వము
సమాప్తము

ఓం తత్ సత్

శ్రీరామచంద్రార్పణమస్తు

—0—

శ్రీః

# శ్రీ ప్రత్యక్ష రామాయణము

## ప్రత్యక్షాత్మానుభూతి రామాయణము

## యుద్ధకాండము

---

క. శ్రీమత్సీతానాయక!
కామితమందారభూజ! కంధిగభీరా!
కామాయుతసుందర! శ్రీ
రామాహృదయాబ్జభృంగరాజ! సవీరా! 1

క. ఘనసుందరమూర్తీ! శ్రీ
జనకమహారాజమౌళి జామాతృవరా!
వినిచెద తదుపరి నీ కథ
విసమితగాత్రుండనగుచు, వినుమో రామా! 2

చ. అనిలసుతుండు తా నటు మహాంబుధి దాటుట లంకఁజొచ్చుటన్
జనకజక్షేమమున్ గనుట జానకితోఁ దగ ముచ్చటించుటన్
దనుజుల సంహరించుటయు దానవనాథుని హెచ్చరించుటన్
విని రఘురామ! నీవు కడు విస్మయమందితిగాదె నెమ్మదిన్. 3

## శ్రీరాముఁడు హనుమంతుని ప్రశంసించుట

ఉ. ఏరికి నూరుయోజనము లీ గతి వార్ధి తరింప శక్యమా !
ఏరికినైన నిట్లు దనుజేశ్వరపాలిత లంక నొంటిమై
చేరవశంబె ! అయ్యెడను సీతను జూడఁగ సాధ్యమౌనె ! దు
ర్వారపరాక్రమక్రముల రాక్షసులన్ వధియింప శక్యమే ? 4

క. ఇంతటి బలవంతుఁడు, మరి
యింతటి మతిమంతుడరయ నిమ్మహి గలఁడే !
ఇంతటి పండితుఁడుం గుణ
వంతుఁడు నెందేని గలఁడె వానరరాజా ! 5

క. ఎంతటి భాగ్యమొ నీయది
అంతటి మతిశాలి సచివుఁడయ్యెను నీకున్
అంతటి వాఁడయ్యును దా
నింతటి నిర్గర్వి వానరేశ్వర ! గనుమా ! 6

## శ్రీరాముఁడు సీతనుగూర్చి చింతించుట సుగ్రీవుఁడు ధైర్యమును దెల్పుట

ఆ. సీత క్షేమవార్త ఈతఁడు వినిపించె
ఇంక మనము వేగ లంక ముట్టి
రాక్షసేశు సర్వరాక్షసగణముతోఁ
గూల్చి జనకజాత గొనఁగవలయు. 7

ఆ. ఎట్టు లినజ ! మనకు ఈ దుస్తరాంభోధి
దాట శక్యమగును ? దైత్యనాథు
ఎట్టు గూల్చువార మే రీతి జానకి
చెరను బాపగలము శీఘ్రగతిని ? 8

ఆ. అనిన నిన్ను గాంచి ఆ వానరేంద్రుండు
స్థైర్యధైర్యశౌర్య వీర్యమెసఁగ.
సర్వకార్యములను సాధింతు మో ప్రభూ !
చింతవిడుము కార్యసిద్ధి యగును 9

ఉ. వారిధి దాటగాఁగలము వానరవీరులతోడ గూడి. దు
ర్వారపరాక్రమం బెసఁగ రావణు గూల్తుము సీత దెత్తుమో
వీరగుణాభిరామ ! ఏను ఒంటిని నీవు ధరించుచేని ఎ
వ్వారలు నిల్వగాఁగల రవార్యపరాక్రమ ! చింతదక్కుమీ ! 10

క. అని యిట్టులు ధైర్యంబుగ
ఇనజుఁడు పలుకంగ మెచ్చి ఎంతయు వానిన్
ఘనువుంగొని ఇదె నా ద
క్షిణనేత్రము సదరె జయము శీఘ్రము మనకౌ. 11

గీ. అనుచు వచియించి ప్రీతిమై హనుమ గాంచి
ఏపు మీరంగ నీవు లంకాపురమ్ము
గాంచివచ్చితి గాదె ! దుర్గమ్ముతీరు
రాక్షసేశుని బలము బీరమ్ము చెపుమ ! 12

క. అని అడిగిన హనుమంతుఁడు
విను మో ప్రభు ! లంకతీరు వినిపించెద యో
జనశతదూరమ్మున ఈ
వననిధి మధ్యమున లంక వరలున్ స్థిరమై. 13

గీ. అబ్ధిమధ్యంబునన్ త్రికూటాద్రియందు
విశ్వవిఖ్యాత శిల్పియౌ విశ్వకర్మ-
రమ్యతమమైన నవరత్నరాజితోడ
లంక నిర్మించె సౌందర్యలక్ష్మి యొలుక. 14

## లంకాపుర దుర్గాది వర్ణనము

ఉ. రావణపాలితమ్ము బహురాక్షసవీరవిరాజితమ్ము, ఐ
రావణదంతిమించు గజరాజితురంగరథప్రచారమున్
దేవపురమ్ముఁగేరు అతిదివ్యమహోన్నతసౌధరాజి సం
భావిత మప్రమత్తభటవర్గసురక్షితగోపురమ్ముగున్. 15

గీ. అబ్ధిగంభీరమౌ పరిఖావృతమ్ము
సంక్రమాంచిత సువిశాల సాలశిఖరి
బహుశతఘ్నీసురక్షిత భద్రసీమ
లంక యెన్నఁగ శత్రుభయంకరమ్ము. 16

ఆ. కోటికోటిదనుజకోటులు నిరతమ్ము
అస్త్రశస్త్రధారులౌచు పురము
రక్ష సేయుచుండ్రు రాక్షసరాజాజ్ఞ
సురలకైన తేరిచూడ వశమె! 17

గీ. ఐన ఓ ప్రభు! విను చతుర్థాంశమందు
ధ్వంసమొనరించి పురి గాల్చివచ్చినాఁడ
నీవు లక్ష్మణుఁ డేతెంచి నిలిచిరేని
నామరూపాలు చెడి లంక నాశమౌను. 18

క. అని దెల్పిన హనుమంతుని
వినుతించుచు నిన్నుఁబోలు వీరులు గలరే!
వననిధి తరియింపఁగ నిఁక
అనువగుమార్గంబు చూడనగుగద మనకున్. 19

క. అని లక్ష్మణు నినజుం గని
మన కిప్పుడ విజయమిచ్చు మంచి ముహూర్తం
బనుకూలంబుగ నున్నది
చనఁదగు మన మిపుడ సర్వసైన్యముతోడన్. 20

## సుగ్రీవుఁడు నీలుని సర్వసేనాధిపతిగా జేసి ప్రస్థానభేరి వేయించుట

ఉ. వానరరాజునంత – అనివార్యపరాక్రమశాలులైన అ
వ్వానరయూథనాథులను వాలిసుతున్ యువరాజు గాంచి, అ
వ్వానరవాహినిన్ నడుప వహ్నిసుతుండగు నీలు ముఖ్యసే
నానిగఁ జేసెగాదె రఘునాయక నీదగు నాజ్ఞ సయ్యెడన్. 21

సీ. ప్రస్థానభేరులన్ పగిలె దిగ్గిరిగుహల్
ధణ ధణ పటహనాదంబు లెసఁగె
వ్యూహనిర్మితిదక్ష యూథాధినాథులు
వ్యూహముల్ దీర్చి రుత్సాహశక్తి
వానరవాహినీవారమ్ము దుర్వార
గతిమించి దివి భువి గప్పినదచె
గిరిశిఖరమ్ములన్ తరువులన్ ధరియించి
వానదుల్ తమ తమ బలము దెలిపి
అంబునిధి దాటి లంకాపురంబుఁ జొచ్చి
అసురవీరులనెల్లర కసిమసంగి
రావణుని గూల్చి జానకీరమణి దెచ్చి
రాఘవుని కిత్తుమనిరి దుర్వారశక్తి. 22

క. హనుమంతుని స్కంధమునం
దున నీవును, అనుజుఁ డంగదుని స్కంధమునం
దును వెలుగగ మీ వెంగట
ఇనజుఁడు నడువంగఁ గదలి రెల్లరు కడకన్. 23

ఉ. కొండలనెల్ల దూకుచును కోనలు దాటుచు నందు మత్తవే
దండము లడ్డమైన భుజదండములన్ విదళించి కుంభముల్
గండకపుండరీకముల కాలను రాయుచు నేలగూల్చి, ఉ
ద్దండగతిన్ జరించి భుజదర్పము చూపిరి యూధనాథులున్. 24

క. ఆగతి దివి భువి మారుత
వేగమునన్ జనుచు గడచి వివిధనగంబుల్
సాగరమట్టులు దక్షిణ
సాగరతీరమ్ము సకలసైన్యము చేరెన్. 25

గీ. తిమితిమింగిల నక్రాదికముల మిగుల
భయదమౌచును ఉత్తుంగభంగములను
గగనముం దాకు అవ్వార్ధి గాంచి నీవు
ధీరముగ నిల్చి అంటి గంభీరభణితి. 26

గీ. ఓయి! సుగ్రీవ! ఇఁక నిరుపాయముగను
అబ్ధి దాటంగ మనకు శక్యంబు గాదు
గాన నియ్యెడ ఈ హరిసేన యెల్ల
విడియ సేనానులకు ఆజ్ఞ లిడుము రాజ! 27

## దర్భశయనము

క. అని నీ వచ్చట దర్భా
సనమున శయనించి శాంతసన్మతి నాలో
చనమున్ జేయఁగడంగితి
ఇనజుఁడు లక్ష్మణుఁడు గొలిచి యిరుదెస నిలువన్. 28

ఉ. చెంగటనున్న వారినిధి చెంగునదాటు తురంగమట్టులు
తుంగతరంగభంగముల తూగుచు త్రుళ్ళుచు పెల్లుబీగుచున్
నింగికి దాటిపోవుచును. నీదగు శాంతసమాధిబుద్ధికిన్
భంగము సేయగా ఫాలఫాలమునందున కోపరేఖ. భ్రూ
భంగము దోప నీవు గన వారిధి మిక్కిలి భీతినంది తా
భంగము చెంది తుంగతరభంగములన్ విడనాడి క్రుంగదే! 29

గీ. దర్భశయ్యకు యోజనత్రయముదాక
రామ! నీరధి తా నిస్తరంగమయ్యె
ఈవు కోపమ్మునన్ కన్ను లెఱ్ఱసేయ
మూఁడు లోకాలు వడకు సముద్రమెంత? 30

గీ. జంతుజాలమ్ము అచట సంచారముడిగె
పక్షికులములు మూకభావంబునందె
నీరవమ్ముగ వీచెను మారుతమ్ము
సర్వభూతాళి అచట నిశ్శబ్దమయ్యె. 31

ఉ. వానరయూథనాథులును వారిధితీరమునందు నాజ్ఞపై
సేనల నిల్ప వారలున్ను చిత్రములట్లు చలింప కించుకేన్
ధ్యాననిమగ్నులైన మునితల్లజులట్లు సమాధినుండి ర
ద్వానరజాతికున్న ప్రభుభక్తికి నచ్చెరువంది రెల్లరున్. 32

## లంకలో రావణుఁడు మంత్రులతో
## మంత్రణము గావించుట

ఉ. అక్కడ లంకలో నల దశాననుఁ డుగ్రత గొల్వుదీర్చి, ఆ
రక్కసజోదులం గని పరాక్రమశాలులు మీర లుండగా
ఒక్కడు వచ్చి వానరుఁ డహో! జనకాత్మజఁ గాంచిపోక వత్
రక్కసులన్ వధించెను పురంబును గాల్చిపోయె బ్రేల్మిడిన్. 33

గీ. అసురగంధర్వయక్షరాక్షసులసురల
గెలిచితిరి గాదె మీరు దిగ్విజయయాత్ర
అట్టి మీరలు వానరున్ బట్టరైరి
దీనికిన్ గారణంబును దెల్పుఁ డనిన. 34

గీ. వానరముపైని బీరమ్ము బలముఁ జూవ
నేటికవి షేము మదిలోన నెంచినాము
కాని ఈరీతి పెక్కురాక్షసుల గూల్చి
కాల్చు లంక నటంచును గానమైతి. 35

గీ. అసురవల్లభ! మాదగు అజ్ఞభావ
మింత చేసెను, మా కాజ్ఞ ఇచ్చితేని
ఇపుడ మే వేగి అవ్వానరేంద్రు జంపి
వసుధ జేసెద మింక నవానరమ్ము. 36

చ. ధనదుని గెల్చి దెచ్చితివి దర్పమెసంగగ పుష్పకమ్ము, ఇం
ద్రుని రణమందు గెల్చి యటు దోచితి స్వర్గధనంబునెల్ల, నం
దనవన కల్పకమ్ములను నాటితి నీదు వనంబులోన, అ
వ్వనధిపిభుం బ్రచేతసు, దివాకరపుత్రుయముం జయింపవే. 37

ఆ. అసురనాథ! నీకు ఆ మానవుండైన
రాముఁ డెంత ప్లవగరాజు నెంత!
అజ్ఞ యిచ్చితేని ఆ నర వానర
పతులఁ జంపి వచ్చువార మనిన. 38

ఆ. ఇంద్రజిత్తు లేచి ఈ నరవానర
బలములెంత వారి బలమదెంత!
అస్త్రశస్త్రవితతి అవ్వారి వధియించి
వచ్చువాఁడ నీవు మెచ్చ రాజ! 39

క. అని వచియించెడి వారలఁ
గనుగొని సోదరుఁడు కుంభకర్ణుఁడు సవిధన్
ధనుజాధిపు రావణుఁ గని
వినుమని ఈరీతి విన్నవించెను సభలో. 40

చ. సురల నదల్చినాఁడ, బలసూదను గెల్చితి, సర్వదిక్పతుల్
శరణము చొచ్చినారలు, రసాతలవాసుల ఘోరపన్నగా
సురుల జయించినాఁడ అతిశూరుల. అట్టిడునాకు నెంత, ఈ
నరులును వానరాధములు ? నా కిడు మాజ్ఞను గూల్చివచ్చెదన్.

## కుంభకర్ణుఁడు సభలో నాడిన మాటలు

ఐన వినుమోయి ! దైత్యరాజాధిరాజ ! కాని

ఉ. రాముఁడు మానవుండనఁగ రాదు పరాత్పరుఁ డింక జానకీ
రామయు లక్ష్మిసుమ్మ ! విను రాక్షసరాజ ! ఎఱుంగవైతి వా
రాముని భార్యదెచ్చి యిటు లంకకుఁ జేటును దెచ్చినావె ! ఆ
రామను సీత భక్తిమెయి రాముని కిచ్చిన నీకు మేలగున్. 42

గీ. అయినదేదియొ అయినది అంత నేను
సమముచేసెద మదికి స్వాస్థ్యమ్ము గూర్తు
చింత విడనాడి ఇంక నిశ్చింతనుండు
నిద్రవచ్చెడు నే నింక నిలువలేను
అనుచుఁ దాఁ బోయి శయ్యాగృహంబు చేరె. 43

## విభీషణుఁడు అగ్రజునకు గావించిన హితబోధ

గీ. వినయమున లేచి అంత విభీషణుండు -
అగ్రజా ! వీర లాగ్రహోదగ్రులగుచు
అందురే గాని కారు కార్యజ్ఞు లరయ
కలదు మనలోన దోష మా ఘనుని సతిని
మాయచే దెచ్చుటది యధర్మమ్ము గాదె. 44

ఉ. వీరలలోన నేడు రఘువీరుని జూచినవారు లేరుగా
ధీరుఁడు రాఘవుండు రణధీరుఁడు— ఆహవభీముఁ డస్త్రశస్త్రవి
చ్ఛారదుడు, శాంతమూర్తి అతిసుందరరూపగుణాభిరాముఁ డా
వీరునితోడ వైర మవివేకము గాదొకో రాక్షసేశ్వరా! 45

ఉ. రాముని శాతసాయకపరంపర లంకను జుట్టకుండ, ఉ
ద్దామశరాగ్నికీలలకు దానవవీరుల రక్తమాంసముల్
హోమము గాకముందర మహోజ్జ్వలలక్ష్మణశస్త్రవహ్ని ఉ
ద్దామభవత్ప్రచండబలదర్పితదైత్యుల నేర్చకుండ, ఆ
రామను భూసుతన్ జనకరాజతనూజను భక్తిమీర శ్రీ
రాముని కొప్పగించి నిజరాజ్యము పుత్రుల బంధువర్గమున్
ఓ మహనీయ! గాచుకొను టొప్పగు నాదగు మాట విన్మ, సం
గ్రామము నిచ్చగింపక సుఖమ్ముగ నుండుము రాజనీతమై. 46

ఉ. అతఁడు శాంతమూర్తి శరణాగతరక్షణదక్షుఁ డెంతయున్,
ధాతయె వేడగా సకలదానవకోటి వధింప బుట్టినాఁ
డాతఁడు, శ్రీశుఁడంచు మది నారయు మో ప్రభు! సాధ్వియైన భూ
జాతను నప్పగించుము ప్రసన్నుని జేయుము రామభూవిభున్.

క. అని బహుధా బోధించిన
విని కుపితుండగుచు నా విభీషణుఁ గనుచున్
వినితింతువు శత్రుని రా
ముని నిట్టులు భట్టువోలె పోలునె నీకున్. 48

గీ. వాని నిరసించి అటు సభవైపు చూచి
మిత్రరూపమ్ము దాల్చిన శత్రు వితఁడు
జ్ఞాతినాశంబె గోరెడు జ్ఞాతు లెపుడు
తమ్ముఁ డీతండు గాడు నా తమ్ముఁడైన
అట్లు పలుకునె ఇంత భయమ్ములేక. 49

గీ. తమ్ముఁ డీతండటంచు నే దలఁచి మదిని
ఇతని మాటల నిట్లు సహించినాడ
అన్యుఁ డెవఁడైన ఇట్లు దా ననియెనేని
సంహరింపనె వాని తక్షణమసంద. 50

క. తమ్ముఁడవైయుండియు నా
సొమ్మును దినుచుండి శత్రు శూరుఁడటంచున్
ఇమ్మెయి వినుతింతువె! ఛీ!
పొమ్మని ఖడ్గంబుదూసి పొమ్మని కసరెన్. 51

క. వినవెంతగఁ జెప్పిన రా
మునివలనన్ లంకకెల్ల ముప్పగు నింకన్
కనలే నేని చేటును
చనువాఁడను రాముఁ డింక శరణము నాకున్. 52

ఉ. రామునితోడ వైరమది రాక్షసరాజ! భయంకరమ్ము, సం
గ్రామమునందుఁ జూచెదవుగా ఇఁక వేరుగఁ జెప్పనేల! శ్రీ
రాముని శాతసాయకపరంపరలొక్కట చుట్టుముట్టి, ఉ
ద్దామమహాగ్నికీలముల దగ్ధముచేయును లంక క్రేల్మిడిన్. 53

గీ. నేను బోయెద పురివీడి నీవు నింక
సుఖముగానుండు నిజసతీసుతులతోడ
రాముతోడుత జగతి వైరమ్ము పూని
బ్రదికిపోయినవార లెవ్వారు లేరు. 54

చ. అని సభనుండి లేచి దనుజాధిప! పోయెద రాము గొల్వ, సా
ధ్విని జనకాత్మజాత గొనితెచ్చిన యప్పుడ యెంత చెప్పినన్
వినవిఁక నెట్లు విందువు! వివేకము సర్వము పోయె నీకు, ఈ
దనుజకులంబుకెల్ల నయొ తప్పదు నాశ మిఁకేమి సేయుదున్.

క. అని తన మంత్రులు నల్వురు
తనవెంటను లేచిరాగ తక్షణమందే
వినువీధి కెగసి రాముని
గనఁ బోయెను దనుజవిభుఁడు కలవరపడగన్. 56

## విభీషణ–శరణాగతి

ఉ. వారిధితీరమందు నట వానరనాథుఁడు లక్ష్మణుఁడు దు
ర్వారబలాఢ్యు లిర్వు రిరువంకను సాయపుతోడుఁ గొల్వగా
ధీరసమాధినున్న రణధీరుని గాంచి విభీషణుండు దా
నో రఘువీర! రామ! శరణో ఘనసుందర! కావుమీ దయన్.

ఉ. నీసతి సీత గొన్న అతినీచదశాననుసోదరుండ, ఆ
దోసముఁజేసి నన్ను నతిదుష్టునిగా మది నెంచఁబోకు, నీ
దాసుఁడ, నీ వినిర్మలపదమ్ముల గొల్చెద దాస్యభక్తి, ఓ
దాసజనావనప్రవణ! దాశరధీ! వరధీ! దయానిధీ! 58

గీ. మాయగా నన్ను నెంచ కమాయకుండ
సత్వగుణపూర్ణ ! నీ దివ్యచరణనతుఁడ
కోటిమన్మథసుందర ! కోమలాంగ !
భక్తమందార ! నీ పాదభక్తుఁ గనుమ ! 59

క. అని వినువీధిని నిలిచియె
వినుతించెడు దనుజు నా విభీషణు దయతో
గనుగొని గొనితెమ్మని ఆ
ఇనజునితోఁ బల్క అతఁ డిట్లనె నెమ్మిన్. 60

ఉ. ఈతఁడు రాక్షసుండు దనుజేశుని సోదరుఁడంట, సాధ్వియౌ
సీతనుగొన్న రావణుని చెంతనె నిత్యము నుండువాఁడ దే
ఆతతబాహుదర్పయుతులౌ పరివారముతోడ వచ్చె, నీ
పీతని నమ్మరాదు గనుమీ నయకోవిద ! రాజధర్మమున్. 61

ఆ. చారవృత్తి నితఁడు చనుదెంచియుండును
రాక్షసుఁడు మఱియు రూక్షబుద్ధి
మనల గలసియుండి మన గుట్టుమట్టులు
అరసి మనల సమయమరసి చంపు. 62

ఆ. ఆజ్ఞ యిచ్చితేని అతని వధియించి
వచ్చువార మనిన వాని గాంచి
శరణుగోరివచ్చు శత్రువునైనను
గాచుటదియ ఇనజ ! రాచపాడి. 63

ఆ. నేను దలఁచితేని నిఖిలలోకమ్ముల
క్షణములోన గూల్చి క్షణములోన
సృష్టి చేయఁగలను స్పష్టమ్ము నా మాట
వలదు సందియమ్ము వానరేంద్ర ! 64

ఆ. శరణటంచు వచ్చు శత్రునకైనను
అభయమిచ్చి గాచుటదియ మాకు
వ్రతము గానఁ బోయి వానిని గొనితెమ్ము
అభయమిచ్చువాఁడ నతని కేను. 65

చ. అని పలుకంగ నీవటు లహస్కరపుత్రుఁడు హృష్టచిత్తుఁడై
మనమును వేఁచుచున్న అనుమానము మాని వివేకమూని అ
ద్దనుజు విభీషణున్ వినతుఁ దద్దయు నెయ్యము దోప తెచ్చి మ
న్నన యెసఁగంగ నీకును గనఁబడఁ జేసిన నాతఁ డయ్యెడన్.

ఉ. శ్యామల కోమలాంగుని ప్రసన్నముఖాంబుజు, పీనవక్షు, ఉ
ద్దామపరాక్రమక్రమవిదారితఘోరఖరాదివీరు, సు
త్రామవిరించిపూజితపదాంబుజు, నిన్గని భక్తియుక్తుఁడై
ఓ మహనీయ! కావుము రఘూద్వహ! నిన్ శరణంటు వేఁడెదన్.

### విభీషణుఁడు— రావణునకు తాను చేసిన హితబోధను రామునకు దెల్పుట

ఉ. "సీతను దెచ్చి లంకకును జేటునుదెచ్చితి వింకనైన భూ
జాతను నిచ్చి రాముని ప్రసన్నుని జేసికొనంగ నెంచుమీ
ఆతఁడు కోపగించిన సురాసురులెవ్వరు నిల్వలేరు నీ
భ్రాతల ఆ ఖరాదుల విరాధుని జంపఁడె— వాలిఁ గూల్చఁడే
ఆతనితోడ వైరమది అగ్రజ! యుక్తముకాదు చూడుమీ
ఆతఁడు శాంతమూర్తి శరణాగతవత్సలుఁ డౌటఁజేసి నీ
ఖాతని వేఁడుకొమ్ము శరణాతఁడు గాచు"నటంచుఁ దెల్పగా
భ్రాతనటంచు నెంచకయె రాక్షసరాజగు రావణుండు సం
జాతరుషాతిరేకమున చంపఁగఁ జూచెను నన్ను నంత నే
నాతతభీతి వచ్చితిని ఆశ్రయ మీయవె కూర్మి రాఘవా! 68

క. అని సాష్టాంగము నీ పద
వనజమ్ముల వ్రాలి మ్రొక్క వానిన్ గని నీ
ఘనబాహుద్వయితో నా
దనుజ విభీషణుని ఎత్తి దయతోఁ గనుమన్. 69

## శ్రీరాముఁడు విభీషణునకు శరణమిచ్చి లంకారాజ్యమునకు అభిషిక్తుని గావించుట

చ. శరణ మొసఁగినాఁడ మరి శత్రుభయంబది నీకు లేదు - ఓ
వరగుణ ! మాకు నీవు నిఁక వానరనాథునివంటివాఁడవే
దురమున శత్రురావణుని ద్రుంచెద పుత్రసమిత్రకమ్ముగా
స్థిరముగ నిన్ను లంకకును జేసెద రాజుగ సత్యవాగ్గతిన్. 70

చ. అని శపథమ్ము చేసి వినయాన్వితు చెంగటనున్న లక్ష్మణున్
గనుగొని వార్ధితోయములు కాంచనకుంభముతోడ తెమ్ము నే
వసధి జలాభిషేకమున వానిగ లంకకు రాజు చేసెదన్
కనుఁడని కూర్మిపేర్మి మెయి కట్టవె పట్టము రాఘవప్రభూ ! 71

చ. ఇనజుఁడు లక్ష్మణుండును హరీంద్రుని మంత్రులు వాహినీపతుల్
వననిధితీరమందు రఘువల్లభ ! అందఱు మోదయుక్తులై
ఘనభుజు ఆ విభీషణుని కమ్రసువర్ణఘటోద్ధృతంబులౌ
వసధిపవిత్రతోయముల వారిరి తా మభిషిక్తు జేసి ర
వ్వనధితరంగఘోషములు వాద్యనినాదము లేకమైతగన్. 72

గీ. రావణుని గూల్పనుంచె వీర్యమ్మెనంగ
ఆ విభీషణు నీవు పట్టాభిషిక్తు
చేయుటది చూచి మెచ్చిరి సిద్ధగణము
ఖేచరుఁడనౌచు నేను వీక్షించినాను
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 73

ఉ. అంత విభీషణుండును మహాభుజు నిన్నని భక్తి నమ్రుఁడై
ఇంతటి గారవం బెసఁగ ఇంతటివానిగ జేసినావు నే
నెంతగ పూర్వజన్మమున ఇంతగ పుణ్యము చేసినానొ ! వే
దాంతనుతాంఘ్రిపంకజ ! ఉదారగుణా ! రఘువంశభూషణా !

క. ఆపద తొలగంజేసితి
నీ పదకంజముల భక్తినిరతిన్ గొలుతున్
ఏ పదవిన్ నే గోరను
తాపసమందార ! భక్తి దయచేయఁగదే. 75

గీ. వసుమతీపాలనంబు - శాశ్వతము గాదు
భోగభాగ్యమ్ములా అవి బుద్బుదములు
గాన గోరెద నీదు ఏకాంతభక్తి
అదియె చాలును నాకు అన్యంబు వలదు. 76

గీ. అని వచించెడు ఆ విభీషణుని గాంచి
నీదు భక్తికి మెచ్చితి నిర్మలాత్మ !
లంక పాలించి సుచిరకాలమ్ము నీవు
అంతమందున మోక్షమ్ము నందఁగలవు. 77

## సుగ్రీవ - విభీషణుల సంభాషణము

గీ. ఇనజుఁ డంతట ఆ విభీషణుని మెచ్చి
కౌఁగిటను జేర్చి మిగుల సఖ్యమ్ము నెరపి
రామ-రావణ ఘోరసంగ్రామమందు
వలయు సాహాయ్యమును జేయవలయు నీవ. 78

గీ. అనిన సుగ్రీవ! నాదు సాహాయ్యమెంత
రాముఁ డాతండు ఆదినారాయణుండు
అతని సరికారు బ్రహ్మరుద్రాదులైన
మనము చేసెడి సాహాయ్యమనఁగ నెంత? 79

గీ. అయిన నా శక్తికొలది సాహాయ్య మేను
చేయఁగలవాఁడ దాస్యమ్ము చేయువాఁడ
కలిగె మీ చెల్మి నాదు భాగ్యమ్మువలన
ఎంత ధన్యుండ! వానరాధీశ! నేను. 80

## రావణునిచే పంపఁబడిన శుకుఁడను చారుఁడు సుగ్రీవు నుద్దేశించి ఆడిన మాటలు

చ. అదె సమయంబునందున దశాననుఁ డంప శుకాఖ్యదైత్యుఁడున్
చదలను నిల్చి పల్కె విశదంబుగ నిట్టులు వానరేంద్ర! ఓ
సదమలశీల! రామునకు సాయము సేయఁగ వచ్చినావె! ఆ
త్రిదశులకైన రావణు నరిందము గెల్వగ శక్యమౌనాకో! 81

గీ. రాక్షసేశ్వరుఁడైన ఆ రావణుండు
పంప వచ్చిన దూత నో వానరేంద్ర!
పంపె నాతండు భ్రాతృభావంబుతోడ
అతని మాటల వినిపింతు అవధరింపు. 82

గీ. "నరుఁడు రాము డు నీవు వానరుఁడవోయి!
వాని సేవింతువేల ఓ వానరేశ!
భ్రాత! ఎందైన ఇల నరవానరులకు
చెలిమి యున్నదె? తుది నీకు చేటువచ్చు. 83

గీ. రామునతియైన జానకీరామ నేను
అపహరించితి ఇఁడు సీతైననేమి ?
పొమ్ము కిష్కింధ కాతని పొత్తు విడిచి
అసురులన్ గెల్వ మీకు శక్యంబుగాదు. 84

గీ. అవసరంబైన నీకు సాహాయ్య మేను
చేయఁగలవాఁడ అతఁడేమి చేయఁగలఁడు ?
వానరేంద్రుఁడవైన నీవంటివాఁడు
అల్పమానవు గొల్వంగ నగునె గనుమ !" 85

ఆ. అనినయంత వానరాధీశు పంపున
ప్లవగవీరు లతని బట్టి కొట్ట
రాఘవేంద్ర ! నన్ను రక్షింపవే ప్రభూ !
దూతఁ జంపఁదగునె ? పూతచరిత ! 86

ఆ. అనుచు మొఱ్ఱవెట్ట ఆతని దయగని
విడువుఁ డనుచు ఆజ్ఞనిడగ నీవు
వారు విడువ నతఁడు వానరవిభుఁ గాంచి
ఏమనందు రాక్షసేశుతోడ. 87

ఆ. అనిన వాని గాంచి ఆ వానరేంద్రుండు
ఇట్టు లనుము రాక్షసేశుతోడ—
"సీత నపహరించి శ్రీరఘువీరుతో
వైరమూని బ్రతుకువాఁడ వెట్లు ? 88

ఉ. వానరసేనతోడ నిదె వచ్చెద మంబుధిదాటి యింక నీ
జ్ఞానవిహీనతన్ వినుము చత్తురు పుత్రులు బంధుమిత్రులున్
సానలఁగొన్న రాఘవుని శాతశరాశిమహాగ్నికీల నీ
ప్రాణము లాహరించు నిను బ్రహ్మయు గావఁగలేఁడు రావణా !"

క. అని యినజుఁడు శుకునిం గని
తన మాటలుగాఁగ ననుము దైత్యేశునితో
అనె, అంతట నీ యాజ్ఞను
దనుజున్ శుకు బందిగొనిరి తక్షణమందే. ౯0

ఆ. వ్యాఘ్రనామదనుజుఁ డంతకుముందర
వచ్చి ప్లవగరాజు బలము గాంచి
రాక్షసేశుఁడైన రావణునకుఁ దెల్పు
బుసలుకొట్టు చతఁడు భోగివోలె
కోపతాపమంది కుములంగఁ జొచ్చెను
రమ్యసుగుణసాంద్ర ! రామచంద్ర ! 91

## శ్రీరాముఁడు సముద్రునిపై కోపమునందుట

గీ. అనుజ ! భానుజ ! చూడుఁ డీ అబ్ధి మిగుల
వింటికంటెడు వీచుల విఱ్ఱవీగు
మనల చూడంగనైనను మదిని గనఁడు
ఇతని గర్వంబు నడచెద ఇపుడ గనుడి ! 92

మ. అని కోపమ్మున చాపమంది భయదజ్యానాదముం జేసి, భీ
షణ బ్రహ్మాస్త్రము నారిగూర్చి త్రిజగత్సంహారమున్ జేయునో
అన కోపాగ్నులు బాణవహ్నులొకటై అంభోధి నింకింపఁగాఁ
జన వారాశి కలంగిపోయె, ధరణీచక్రంబు నూగాడె, అ
వనజాతాననవాసవాది దివిజవ్రాతమ్ము భీతిల్లె, యో
జన దూరమ్ముగ వార్ధియేగెను జగజ్జాతమ్ము ఘూర్ణిల్లె, తో
యనిధిన్ సంచరదుగ్రభీకరమహాయాదోగణం బార్తిపై
వనధిన్ వీడి చనంగ మింటి కెగసెన్ వారాశి భీతిన్ వెసన్. ౯౩

## సముద్రుఁడు నిజరూపమున వచ్చి రాముని స్తుతించుట

గీ. నైజరూపమ్ము ధరియించి నయము భయము
వెలయగా నీదు పాదారవిందములకు
నైజగర్భస్థ విమలరత్నములతోడ
పూజ గావించి కరములు మోడ్చి నిలిచి. 95

గీ. జడధి నో ప్రభు ! నన్నిట్లు జడధిగాగ
సృష్టిచేసితి వీవెకా భ్రష్టమతిని
నీదు నాజ్ఞను పాలించి నిలిచితిట్లు
అబ్జజాభవవినుతపాదాబ్జరామ !
వరద ! శరణమ్ము నీవె ! ఆపన్నశరణ ! 95

గీ. ఆజ్ఞ యిచ్చితివేని ఓ అమరపూజ్య !
దారి యిచ్చెద యిదె పాదచారులుగను
పోవ వచ్చును కాని ఓ పుణ్యపురుష !
జలధి బంధించి చన యశస్కరము గాదె. 96

గీ. అనుచు సాష్టాంగపడిన ఓ అబ్ధిరాజ !
ఇమ్మహాస్త్రమ్ము గను మమోఘమ్ము సుమ్మ !
దీనికెయ్యది లక్ష్యమో దెలుపుమనిన
అంత సాగరుఁ డెంతొ సంభ్రాంతి చెంది. 97

## రామబాణము ఆభీరమండలమును భస్మము గావించుట

గీ. దేవ ! నాదగు ఉత్తరతీరభూమిఁ
గలదు ద్రుమకుల్యమనెడి భూఖండ మొండు
క్రూరకర్ములు శూరు లాభీరు లచటఁ
గలరు వారలపై ప్రయోగమ్ము సేయు. 98

గీ. అనిన నీవును బ్రహ్మాస్త్ర మందు విడువ
చండరశ్ముల ఆభీరమండలమ్ము
భస్మమును జేసి సురలు విశ్రాంతి చెంద
శరము వే వచ్చి నీదగు శరధిఁ జొచ్చె
కాంచితిని నేను నీదు విక్రాంతి నపుడు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 99

## వారిధి – వారధి నిర్మాణ మార్గమును దెల్పుట

గీ. అంత కరములు మోడ్చి ఆ అబ్ధిరాజు
రఘుకులాంభోధిచంద్ర ! శ్రీరామచంద్ర !
అబ్ధి తరియించు మార్గమ్ము నవధరింపు
కలఁడు మీ సేనలో విశ్వకర్మసుతుఁడు. 100

గీ. అతఁడు జలమున ఏ వస్తువైన వైవ
కొండలైనను తేలును బెండులట్లు
అట్టి వరమును బడసె మున్నతఁడు రామ !
అతఁడు నిర్మించు సేతువు నబ్ధిమీద. 101

గీ. నీదు కీర్తియు స్థిరముగా నిలిచిపోవు
అనుచు వచియించి నీదగు ఆజ్ఞ వడసి
అంత అంతర్హితుండయ్యె అబ్ధిపతిఁడు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 102

## రాఘవుఁడు సేతునిర్మాణమునకు ఆజ్ఞ లిచ్చుట

గీ. సాగరుం డేగ నీవు తత్క్షణమునంద
నలుని రావించి చాల మన్ననలు చేసి
"విశ్వవిఖ్యాత శిల్పియౌ విశ్వకర్మ
సుతుఁడ వీవంచు శిల్పదక్షుండ వనుచు. 103

గీ. సాగరుఁడు మాకు నీ పరశక్తి దెల్పి
నీదు విన్నాణమెల్ల గన్పింపఁజేసి
సేతునిర్మాణ మబ్ధిపై చేయుమోయి!
అనుచు శంకువు స్థాపించి అబ్ధివేల. 104

### శ్రీరాముఁడు రామేశ్వరుని ప్రతిష్ఠించుట

గీ. లోకకల్యాణవిధి మదిలోన నెంచి
విఘ్ననాయకు పూజ గావించి ముందు
శివుని లింగము అట ప్రతిష్ఠించి భక్తి
రామ! "రామేశ్వరుం"డని నామముంచి
సేతునిర్మాణమున కాజ్ఞ చేయలేదె!
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 105

### నలుఁడు వారిధిపై వారధి నిర్మించుట

క. గిరిశిఖరంబులు, ధరణీ
ధరములు పెనుశిలలు, భూరితరుషండము, వా
నరవీరులు గొనితేరగ
అరుదుగ నలుఁ డందుకొనుచు అతిశీఘ్రగతిన్. 106

క. కొండలు, పెనుబండలు, తరు
షండము, గురుశిలలు. గుండ్లు సాగరమందున్
బెండులవలె నవి తేలెను
చెండులవలె నలుఁడు పట్టి చేతులపైనన్. 107

గీ. పెద్దకొండలు గుండ్లు గుభిల్లుమనుచు
జలధిపైబడిన చదలకు జలధి యెగసె
మీన కర్కాట మకర తిమింగలాది
జలచరంబులు రాశులై చదల నిలిచె. 108

క. త్వన్నామాంకితముద్రల
అన్నిట ముద్రించి అహరహమ్మును దీక్షన్
సన్నుతి సేయఁగ దివిజులు
పన్నుగ నిర్మింపఁదొడఁగె వారధి వార్ధిన్. 109

ఉ. కొందఱు పర్వతమ్ములను కొందఱు భూధరతుంగశృంగముల్
కొందఱు పెద్దబండలను కొందఱు ఘోరశిలావిశేషముల్
కొందఱు భూరుహమ్ములను కొందఱు వృక్షవిశాలశాఖలన్
అందఱు తెచ్చి ఈయ అవియన్నియు ఆ నలుఁ డందుకొంచు ఆ
నందము చెంద మీరలు ఘనంబుగ వారధి గట్టె వారిధిన్. 110

గీ. రేయిపవలును నలుఁడు నిర్నిద్రవృత్తి
పంచదినములలో నెల్లవారు పొగడ
నీవు తమ్ముఁడు వానరానీకపతులు
వానరాధిపుఁ డానందవార్ధిఁ దేల
నూఱు యోజనములమేర వారినిధిని
సేతువును గట్టె సురలు జేజేలు వెట్ట
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 111

గీ. హనుమదంగదస్కంధమ్ములందు నీవు
లక్ష్మణుఁడును గూర్చుండ, రవిసుతుండు
సకలమంత్రులు అలవిభీషణుఁడు గొలిచి
చెంత నడువంగ మార్గవిశ్రాంతి గొనక
కంధినిర్మిత సేతుమార్గమును బట్టి
నడచిపోయెను ప్లవగసైన్యంబదెల్ల. 112

గీ. అంద జారీతి కాల్నడ నబ్ధి దాటి
అధికరమణీయమౌ సువేలాద్రి చేరి
పిడిదిపట్టుగ వారిధివేల నెంచి
అంద ఱచ్చోట విశ్రాంతి నందినారు. 113

గీ. అఖిలసైన్యాధిపతి నీలుఁ డబ్ధివేల
వానరానీకములనెల్ల తాను నిలిపి
సర్వదా సైన్యపర్యవేక్షణము సేయ
దండనాథుల పనిచె నుద్దండబలుల
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 114

## శ్రీరాముఁడు శుకునిద్వారా రావణున కందజేసిన సందేశము

ఆ. శుకుని చెఱను బాప సుగ్రీవు నియమించి
ఆతని బిలువ బంచి అతనితోడ
నాదు మాటలుగను నీదగు ప్రభువుతో
ఇట్టు లనుమటంచు నిట్టులంటి. 115

ఆ. "ఏ బలమ్ము నమ్మి ఎత్తుకవచ్చితో
సాధ్వియైన జనకజాత సీత
ఆ బలమ్ము చూప అవసరమ్మిదె వచ్చె
యుద్ధమునకు నింక సిద్ధమగుమ! 116

ఆ. రాము కోపవహ్ని రగిలిన బాణాగ్ని
లంక గాల్చునింక రాక్షసేశ!
బంధుమిత్రపుత్రపౌత్రులతోఁ గూడ
నీకు చావు మూఁడు నిశ్చయమ్ము." 117

ఆ. అనుచు నాదు మాటలన్నియు వినిపించ
రాక్షసేశుఁడైన రావణునకు
బొమ్మటంచు విడిచిపుచ్చిన శుకచారు
నతఁడు నతులు చేసి బ్రతికిపోయె
రమ్యసుగుణసాంద్ర ! రామచంద్ర ! 108

## సువేలాద్రి నధిరోహించి శ్రీరాముఁడు లంకను గాంచుట

గీ. ఇనసుతుఁడును హనుమ లక్ష్మణులు గొలువ
అంగదాదులు వెనువెంట ననుసరింప
అమ్మహాగిరి నధిరోహణమ్ము సేసి
హనుమ చూపింప నీదు చెంతననె నిలిచి
రాక్షసేంద్రాభిరక్షిత రాజధాని
గాంచితివి గాదె దివ్యలంకాపురమ్ము. 119

చ. అదె దనుజేంద్రపాలితమహాపురమంబరచుంబిగోపురం
బదె రథవాజికుంజరభటాంచితసంకులరాజమార్గమ
ల్లదె బహురత్ననిర్మితమహావిభవాంచితరాజసౌధమ
ల్లదె సువిశాలగోపురసమంచితదుర్గము రత్నభాసురం
బదె బహువర్ణకేతనపటాంచలసుందరధర్మ్యసౌధ ము
ల్లదె సువిశాలవార్ధిపరిఖావృతసాలము సంక్రమాంచితం
బదె శతకోటిరాక్షసబలౌఘసురక్షితదిక్చతుష్టయం
బదె గను లంక, సాధ్వి జనకాత్మజ యున్న వనంబదే ప్రభూ!

క. అని చూపించిన పావని-
కనుగొని లంకాపురమ్ము కడుకోపమునన్
విను మనిలజ ! రాక్షసు రా
వణుఁ గూల్చెద పుత్రమిత్రవర్గముతోడన్. 21

క. అని శపథమ్మును జేయవె
అనుజుఁడు నిసజుండు యోధులెల్లరు మెచ్చన్
ఓసువీధిని జరియించుచు
కనుగొంటిని నిన్ను దేవగణములతోడన్. 122

## శుకుఁడు రావణుని దర్శించి తాను చూచివచ్చినది వినిపించుట

ఆ. శుకుఁడు వచ్చి తాను జూచినదదియెల్ల
వినిచి రావణునకు వినతుఁడగుచు
ఇనజుఁడన్న మాటలెల్లను వినిపించి
భయముగదుర వినయభరితుఁడగుచు. 123

ఉ. వారిధి దాటివచ్చె రఘువల్లభుఁడల్లదె చూడు లక్ష్మణుం
డారవిపుత్రుఁడంగదనలాదిమహాబలయోధనాథులున్
వారె సువేలనుండి రనివార్యపరాక్రమశాలు లందఱున్
వారల గెల్వగాదగినవారలు లేరు జగంబులోన నీ
వారలు చాలరెవ్వడను వారిజలోచనసీతనిచ్చి నీ
వా రఘువీరుపాదశరణార్థివిగమ్ము సుఖమ్ము గొమ్ము, రా
జా ! రజనీచరాన్వయము సర్వము గావుము, కూర్మి పేర్మిదై
వార కళత్రమిత్రసుతవర్గము ప్రోవుమటంచు దెల్పుచున్. 124

ఆ. రాక్షసేంద్రు గూర్చి రాఘవ ! నీవన్న
మాటలెల్లఁ దెలుప మండిపడుచు
కోపగించి అతని పో పొమ్మటంచును
కసరి పంపెనంత అసురవిభుఁడు. 125

### రావణుఁడు శుక-సారణు లనుగూఢచారులను బంపుట

ఆ. శుకుఁడు వెడలిపోవ శుక-సారణాహ్వయ
గూఢచరులతో నిగూఢవృత్తి
మంతనమ్ము చేసి మహితవానరసైన్య
బలము చలము నరయఁ బంప వారు 126

క. వానరరూపము దాలిచి
వానరబలమందుఁ జొచ్చి వారల బలమున్
వానరనాథుని చలమున్
వానరయూథాధిపతుల బలమున్ గనుచో. 127

క. వారల నంత విభీషణుఁ
డారసి రావణుని చారులని మది గని, అ
వ్వారలఁ బట్టించిన— శుక
సారణులున్ లొంగిపోయి సత్యము దెలుపన్. 128

గీ. సత్యమును దెల్పి రీ గూఢచరులు గాన
మన బలమ్ముల మానప్రమాణములను
వారలకుఁ జూపి విడువుఁడు వారిననుచు
ఆజ్ఞ లీవీయ నంత యూథాధిపతులు
సర్వసైన్యమ్ము చూపించి సైన్యబలము
చారులకు దెల్పి పంపించినారు గాదె
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 129

## శుక – సారణులు రావణుని దర్శించి వానర సైన్యబలాదుల దెల్పుట

ఆ. అచట రావణుండు అత్యున్నతంబైన
సౌధగోపురమున సభను దీర్చి
వార్ధివేల అపరవార్ధినా చూపట్టు
వానరేంద్రు సైన్యవార మరసి. 130

ఆ. మంత్రివరులతోడ మంతనములు సేయు
అవసరమున చారులంత వచ్చి
రాక్షసేంద్ర ! మేము రాఘవుబలముల
అరసి వచ్చినార మవధరింపు. 131

ఉ. రాముఁడు శత్రుభీకరపరాక్రమశాలి మహాభుజుఁడు, శ్రీ
రాముని సోదరుండయిన లక్ష్మణుఁ డంతటివాఁడ ఇంక సు
గ్రామసుతానుజుండు రఘురాముని మిత్రుఁడు భానుజుండు సం
గ్రామధురంధరుఁడు రణరంగభయంకరు లంగదాదులున్. 132

గీ. యూధపతులెల్ల వార లాయోధనమున
శిక్షితులు వ్యూహనిర్మాణదక్షు లరయ
చండవిక్రము లంద ఱుద్దండబలులు
వారి నెదిరించువార లెవ్వారు లేరు. 133

గీ. ఒక్కరొక్కరి సైన్య మొక్కొక్కకోటి
వానరులు తాము సమరదుర్వారబలులు
దండనాథుల ఆహవోద్దండు లరయ
వారలెల్లరు దేవాంశభవు లటంద్రు. 134

క. కొందఱు దశగజబలు లిక
కొందఱు శతదంతిబలు లకుంఠితసత్త్వుల్
కొందఱు నాగాయుతబలు
లందఱు వింధ్యాద్రిమందరాద్రి సమానుల్. 135

క. అని దెల్పిన విని వారల
ననిచియు సైన్యాధిపతుల నందఱ గనుచున్
మన లంకాపురవర ర
క్షణకై సన్నద్ధులగుడు సైన్యముతోడన్. 136

## రాఘవుఁడు విచిత్ర శరప్రయోగమున రావణుని ఛత్ర–చామర కిరీటాదులను ద్రుంచుట

క. అని పల్కి మంత్రివరులను
గనుగొని వానరుల నొంపగా గలవారిన్
మనవారల వే బంపుడి
అనుచుండగ అంతలోన అచ్చెరువెసఁగన్. 137

ఉ. అచ్చట నీవు– లక్ష్మణుఁ డహస్కరపుత్రుఁడు యూథనాథులున్
అచ్చెరుపాటు నెందగ విహాయసవీథికినంటు సౌధమం
దచ్చుగ నున్న రావణు నహంకృతి గర్వమడంప నెంచి వే
హెచ్చిన కోపవేగమున ఇంద్రధనుస్సును బోలు చాపమున్
చెచ్చెర దాల్చి నారిని విచిత్రశరావళి గూర్చి యేయగా
వచ్చి శరంబు లొక్కుమొగి వైద్యుతకాంతుల నింపి యెల్లడన్
ద్రచ్చెను ఛత్రచామరపరంపరలొక్కట చిత్రభంగిమై
గ్రచ్చఱ పంక్తికంఠు నవరత్నకిరీటములెల్ల డుల్చి, వే
వచ్చి త్వదీయమౌ శరధి అన్నియు నెప్పటియట్ల సేరగా
అచ్చెరువంది చూచిరి వియచ్చరులున్ దనుజేంద్రు మంత్రులున్.

క. అబ్బురపడి రందఱు సభ
తబ్బిబ్బై పాఱఁబోదగె దైత్యగణమ్మున్
గబ్బుసెడి రావణుఁడు మది
గొబ్బున సభ వీడిపోయె కొందలపడుచున్. 139

## రావణుఁడు తన యూథనాథులకు ఆజ్ఞ లొసగుట

ఉ. ఎంతయు గోపమంది కను లెఱ్ఱగఁ జేయుచు రావణుఁడు తా
నంతట సైనికాధిపతులందఱఁ గాంచి వచించె నిట్లు మీ
రెంతటి యోధులో యెఱుగు దీ నరవానరులెంత మీకు కా
లాంతకతుల్యులైన మిములన్ గని నిల్తురె ఆ నరాధముల్
చింత యొకింత సేయకిఁక శీఘ్రగతిన్ బహుశస్త్రధారులై
దంతురదంతిసైంధవశతాంగపదాతిదళంబుతోడ మీ
పంతముమీర ద్వారములవట్టున ధీరత నిల్చి ఉగ్రకా
లాంతకులట్లు శత్రువులనందఱ పోర వధింపుఁడీ వెనన్. 140

ఆ. అనుచు నాజ్ఞ లొసఁగి అంతఃపురమ్మున
కరిగి కోపతాపమందుచుండ
మాల్యవంతనామమాతామహుండంత
వచ్చి శాంతపరచి పలికె నిట్లు. 141

## మాతామహుఁడు మాల్యవంతుఁడు రావణునకు హితబోధ గావించుట

సీ. రాక్షసరాజేంద్ర ! రాగమ్ము చెందక
విను మోయి నా మాట విసువుగొనక
శ్రీరాము సతియైన సీతామహాసాధ్వి
గొనితెచ్చినదిమొదల్ మన పురమున

దుశ్శకునమ్ములు దోచెడు నింటింట
 కాలుండు భయదుఁడై కానిపించు
కాళిక తా దంతఘట్టనమ్ములతోడ
 పురిచుట్టు రాతిరి ప్రొద్దు తిరుగు
అంబరమున నుండి అశనిపాతమ్ముల
 జలదముల్ రక్తవర్షంబు గురియు
ఆలయంబుల విగ్రహంబులు చలియించి
 అక్షులన్ గార్చెడు అశ్రుజలము
గోవులగర్భాన గోమాయువులు పుట్టు
 మనుజులకున్ జంతుగణము పుట్టు
మూషముల్ మార్జాలములతోడ పోరాడు
 గరుడులతో పన్నగములు పోరు
చేయగా బంచు రుద్రాభిషేకములను
శాంతి చేయించి పౌరరక్షణము సేయు
భూమితనయను సత్కారపూర్వకముగ
రామునకు నిమ్ము! అతఁడు నారాయణుండు
శరణుజొచ్చినవారి ప్రసన్నదృష్టి
గాంచి వారలఁ గూర్మి రక్షించు నతఁడు
రాజ్యరక్షణమును ప్రాణరక్షణమ్ము
చేసికొమ్మోయి! కులము రక్షించుకొమ్ము. 142

గీ. అనుచు బోధింప కోపమ్మునంది అతఁడు
వృద్ధుఁడవు నీవు నీడగు బుద్ధి చెడెను
శత్రువుల నుండి ఏదో లంచమ్ము నంది
ఇట్లు బోధింతువేమొ మాకింక పొమ్ము

ఇట్టి మాటలు మాచెవి కింపుగావు
బంధుపుడవౌట ఓర్చినవాఁడ ననిన
ఎంత చెప్పిన వినవు నే నేమిసేతు
అనుచు మాతామహుండు తా నరిగెనంత
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 143

## రావణుని ప్రేరణమున మాయావి విద్యుజ్జిహ్వుఁడు ఖండితమగు రాముని శిరంబును ధనుర్బాణములను సీతకు జూపించుట — విభీషణుని భార్య సరమ సీత నోదార్చుట

సీ. రక్షోధినాథుండు రావణుం డా సాధ్వి
సీత సమ్మోహితఁ జేయనెంచి
మారీచు మించిన మాయావి దుష్టాత్ము
పనిచె విద్యుజ్జిహ్వు పాపబుద్ధి
అంత నా మాయావి అసురేంద్రు నాజ్ఞమై
మాయచే నీదగు మస్తకమ్ము
నట్టిమా నీ దివ్యచాపమ్ము శరములు
హనుమంతుచే సీత అంపినట్టి
రమణీయమౌ శిరోరత్నమ్ము సృష్టించి
సీతకున్ జూప నామాత భీతి
భోరున ఖేదన శోకభారాన విలపింప
సరమాఖ్యయౌ విభీషణుని రమణి
వచ్చి యోదార్చి ఇవ్వి రావణుని మాయ
అమ్మ ! నామాట నమ్ము భయమ్ము వలదు

రామలక్ష్మణు లయ్యెడ క్షేమముగను
ఉన్నవారలు శాంతిమై యుండుమమ్మ !
అనుచు శాంతింపఁజేసె నా అవనితనయ
సరమనఖినొను గంటి నే సర్వమపుడు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 144

## అంగదుని రాయబారము

సీ. అచట నీవును ఆ సువేలాద్రిమీద
ఇనజలక్ష్మణసన్మంత్రిగణముతోడ
మంత్రణము చేసి రాజధర్మమ్ము నెంచి
కట్టకడసారిగా దశకంఠు కడకు
రాయబారిని బంపుట రాజనీతి
అనుచు భావించి అంగదు ననుపనెంచి
అసురనాథుని సభలోన ఆడదగిన
మాటలను దెల్పి అంగదు మహితవీరు
బంపితివి గాదె ఆ పంక్తివదను సభకు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 145

గీ. అంగదుండును నీదు పాదాబ్జములకు
భక్తినతులను జేసి నభంబు కెగసి
దనుజవల్లభు నా సభాద్వారభూమి
నిలిచి తన రాక ముందుగా దెలియఁజేసి. 146

చ. మదగజరాజు పోలిక సమందగతిన్ సభలోని కేగి, అం
గదుఁడట దివ్యరత్నమయకాంచనసుందరరత్నపీఠిపై
మదమదిరేక్షణాగణము మంజులచామరరాజి వీవ, ఇం
పొదవెడు రాచఠీవిని సముజ్జ్వలహారకిరీటకాంతిసం
పదలవెలుంగు రావణు అభంగురవీర్యపరాక్రమున్ గనెన్. 147

గీ. దాంటి ముందుకుఁ జని సమీపించి నిలిచి
రాక్షసేశ్వర ! నన్ను శ్రీరామవిభుఁడు
పంపె నీ చెంతకిటు రాయబారిగాగ
అతని మాటల వినిపింతు అవధరింపు. 148

గీ. అనిన మున్నొక వానరుం డబ్ధిదాటి
వచ్చె నీవేల వచ్చితి వాఁడు లేడె ?
అసురరాజేంద్ర ! నీ పుత్రు నక్షు జంపి
లంక గాల్చిన యతఁడ నిశ్శంకవృత్తి ? 149

గీ. అతని కాలిన వాలమ్ము నరసి మేము
వెన్నుదన్నుచుఁ గొట్టిన చిన్నవోయి
దిక్కులనుబట్టి పోయె ఏ దిక్కులేక
వాని జాడలు తెలిసినవారు లేరు
వచ్చినన్ నేడొ రేపొ రావచ్చు నతఁడు. 150

గీ. అతఁడు లేకుంట ఇపుడు నన్నంపినారు
వాలి నెఱుఁగుదు వీవుగా వానిసుతుఁడ
అంగదాఖ్యుండ నేనును నంతవాఁడ
రామవిభుఁ డంపు రాయబారమ్ము వినుమ ! 151

గీ. "పంచవటినుండి నాడు వంచించి మమ్ము
అపహరించితి నా సతి కపటబుద్ధి
ఇప్పుడేనియు తప్పు గ్రహించి నీవు
అప్పగింపుము సతిని సఖ్యంబు దోప. 152

గీ. మేము లేనప్పుడటు గొనుటేమి బలము
రాజలక్షణమౌనె ! పరాక్రమమ్మె !
ధర్మ మెడబాసి యిట్టు లధర్మవృత్తి
బోవనెంచిన ఇఁక నష్టపోవు దీవు. 153

గీ. శరణుఁజొచ్చిన వాడెంత శత్రువైన
గాచువాఁడను ధర్మరక్షణముపొంలె
ఉర్వితనయను సత్కారపూర్వకముగ
అప్పగించనిచో చావు తప్పదింక. 154

ఉ. ఏ బలముండి నీవు హరియించితి నా సతి సాధ్విసీత నీ
వాబలమెల్ల చూపుమిఁక ఆహవమందున నిల్చి రావణా !
నీ బలసంపదన్ సుతుల నిన్నును నీదగు బంధుమిత్రులన్
నా బలమెల్ల చూపి కదనంబునఁ గూల్చెద కాచుకొమ్మికన్. 155

చ. అని మొననింక మామకశరాసనముక్త శరాగ్నికీలలన్
దనుజులు దగ్ధమౌదురు సుతప్రకరంబును నాశమౌను, నీ
తనరెడు శీర్షముల్ దునిసి తాళఫలమ్ములవోలె డుల్లు, ఆ
వనజభవుండు తోడుపడవచ్చిన తప్పదు చావు నీ కికన్." 156

గీ. అనిన 'కహ కహ' నవ్వి ఆ అసురవిభుఁడు
"కాంత నిచ్చుట అది వట్టికల్ల వినుమ !
చేతనగునేని యుద్ధమ్ము చేయుమింక
వట్టిమాటల భయపడువాఁడ గాను. 157

మ. సురలన్ గెల్చితి యక్షరాక్షస మహోశూరావళిన్ గూల్చితిన్
ధరణీనాథుల నెందఱెందఱినొ యుద్ధమ్మందు ఓడించితిన్
సురనాథున్ ధననాథు గెల్చితిని ఆశూలిన్ గిలి నోడించితిన్
నరులున్ వానరులెంత మాకు మిను మీ నా మాటలన్ దెల్పుమీ !"

గీ. అనినఁ గోపించి అంగదుం డతని గాంచి
రావణా ! నిన్నుఁ జంప శ్రీరాముఁడేల ?
చాలుదును నేన ఎఱుఁగవే వాలిసుతుఁడ
బలముగలదేని రమ్ము నా బలము గనుము. 159

గీ. రావణుండంత తన అంగరక్షకులకు
"అతని వధియింపుఁ" డంచును నాజ్ఞసేయ
దనుజవీరులు నల్వు రుద్దండబలులు
వచ్చి ఆతనిబట్ట అవ్వాలిసుతుఁడు. 160

గీ. కక్షమున వారి నిఱికించి గగనమునకు
ఎగసి విసరిన జలధి వారెల్లఁ బడిరి
అంబరంబంటు రాజసౌధంబు గూల్చి
నీదు పాదారవిందసన్నిధిని వ్రాలి. 161

గీ. అచట నడచిన వృత్తాంతమంత దెల్ప
"ఇంత ఎఱుఁగడె రావణుండెంత మూర్ఖుఁ"
డనుచు నందఱు ఆశ్చర్యమందినారు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 162

## లంకను ముట్టడింప శ్రీరాముని సన్నాహము

ఉ. ఇంక దినేశపుత్ర ! మన ఎల్లబలంబులు విక్రమోద్ధతిన్
లంకను ముట్టడింపవలె రాక్షసరాజగు రావణుండు తా
బింకము మానఁ డింతకును భీకరయుద్ధమునందు వాని ఆ
పొంకమడంతు సైనికుల వ్యూహవినిర్మితి కాజ్ఞ లిమ్మికన్.

## విభీషణుని మంత్రులు గూఢవృత్తిని లంకాద్వారరక్షణమును గాంచివచ్చుట

ఉ. అంతకుమున్ విభీషణుఁడు ఆయతబాహుబలావలేపు ల
త్యంతపరాక్రమాన్వితులునౌ తన మంత్రుల గాంచి మీర ల
త్యంతనిగూఢవృత్తిఁ జని అచ్చట లంకను ద్వారరక్షణం
బంతయుఁ జూచిరండనుచు అంపిన వారలు గాంచివచ్చినన్.

## విభీషణుఁడు శ్రీరామునకు లంకాద్వారరక్షణమును దెల్పుట

ఉ. వారలవల్లఁ దా వినినవార్త విభీషణుఁ డిట్లు దెల్పె, దు
ర్వారబలుండు రావణుఁడు రాక్షసకోటులతోడ నుత్తర
ద్వారమునందు నుండెనట దక్షతతోడుత, నింక పశ్చిమ
ద్వారమునందు రావణియు దక్షుఁడు రక్షణసేయు, దక్షిణ
ద్వారమునం మహోదరుఁ డుదారబలుండు ఘనుండు నుండె. ప్రాక్
ద్వారమునం ప్రహస్తుఁ డనవద్యపరాక్రముఁ డుండె ఇంక న
ద్వారల గెల్వగాఁ దగినవారల వానరయూథనాథులన్
ధీరుల నిల్పగావలెను ధీరత యోచనసేయు రాఘవా ! 165

## శ్రీరాముఁడు తనవారల ప్రశంసించుట

క. అనినన్ మనవారలలో
ఘనులెందఱొ గలరు దనుజగణమును గూల్పన్
ఇనజుఁడు నా అనుజుండును
హనుమంతుఁడు చాలు వారినందఱ గెడపన్. 166

క. ఘనబాహుల్ వినువీధిన్
జనువారలు యూథపతులు జాంబవదాదుల్
మన అంగదుఁ డీ నీలుం
డా నలుఁడున్ ద్వివిదమైందవాదులు వేరే ! 167

క. వీరల గెల్చెడివారలు
వారలలోఁ గలరె ! ఐన వారికి దీటౌ
వారల వీరులను చతుర్
ద్వారములం దెంచి నిలుపువాఁడను గనుమా ! 168

క. అని అందఱ కలయంగని
ఇనజునితో సంప్రదించి ఎల్లర గనుచో
మునుకొని అహమహమికతో
డను వారలు ముందునిలువ తద్దయుఁ బ్రీతిన్. 168

## శ్రీరాముఁడు లంకాద్వారచతుష్టయమందున్న వీరులను ప్రతిఘటింప తగినవారిని నియోగించుట

ఉ. దారసుగొన్న రావణుని దర్పమడంపఁగ – తమ్ముతో నుదగ్
ద్వారమునందు నుండెదను దక్షతతోడుత నేను, ఇంక ప్రాక్
ద్వారమునందు నీలు డనవద్యపరాక్రమశాలి యుండు, దు
ర్వారబలప్రచండుఁ డల వాలిసుతుండగు అంగదుండవాగ్
ద్వారమునందు నుండు కడు దర్పమెసంగగ, నింక పశ్చిమ
ద్వారమునందు నుండును ప్రభంజనపుత్త్రుఁడు నుగ్రమూర్తియై.

గీ. పశ్చిమోత్తర గోపురద్వారములకు
మధ్యగుల్మమునందున మహితబలుఁడు
ఇనజుడుండును ఈ విభీషణునితోడ
కేసరిన్ బోలు వీరుండు కేసరియును
జాంబవంతుండు అంగరక్షకులుగాగ. 171

గీ. వ్యూహనిర్మాణదక్షులౌ యూథపతులు
వ్యూహముల దీర్చి తగురీతి ఆహవమున
వాహినులతోడ ఈ చతుర్ ర్వాటిగతుల
రక్షసేయంగవలెను నిరంతరంబు. 172

గీ. సర్వరసాయనాదిక శాస్త్రవేత్త
వైద్యవిద్యాప్రవీణుండు సద్యశుండు
శస్త్రఘాతమ్ము చెందిన సైనికులకు
శీఘ్రగతితో చికిత్సను చేయవలయు
ఈ సుషేణుండు మన వానరేంద్రు మామ. 173

గీ. తక్కుగల వీరులెల్ల తత్రత్యులైన
దండనాథులు సమరదోహలులునెల్ల
అవసరంబైనయంత అత్యవసరముగ
తోడుపడవలె వారు తోడ్తోడవచ్చి. 174

చ. అని యిటు లెల్లవారలకు ఆజ్ఞలనిచ్చి శుభప్రభాతమం
దున కులదైవతంబునుఁ తోయజమిత్రున కర్ఘ్యమిచ్చి, వం
దనములు సంస్తుతుల్ సలిపి, దక్షిణనేత్రభుజంబులంతటన్
తన విజయంబు దెల్పుగతి తక్షణమంద స్ఫురింప వీఁకమై
ఘనతరకార్ముకమ్ము గొని కన్నుల రౌద్రరసంబు మీరగా
ఇనజుఁడు లక్ష్మణుండు దనుజేంద్రవిభీషణుఁ డంగదుఁడు రాన్
వెనుకను ముందునన్, ప్లవగవీరులు సేయఁగ సింహనాదముల్
దినకరకోటితేజమున ధీరత నేగవె మ్రోగ భేరులున్. 175

## వానర సైన్యము లంకను ముట్టడించుట

ఉ. రామ ! దినేశపుత్రకపిరాజు మహాజ్ఞను యూథనాథులు
ద్దామబలుల్ ధరాధరగదాతరుపట్టిస శూలధారులై
భూమిని వ్యోమమార్గమున భూరిబలంబులతోడ నేగి ఉ
ద్దామపరాక్రమమ్మెనఁగఁదా మటు లంకను ముట్టడించియున్. 176

గీ. మేరుమందరధీరు లమేయబలులు
అఖిలదిగ్దేశములను భూమ్యంతరిక్ష
మార్గముల్ గప్పి దశదిశల్ మారుమ్రోగ
గర్జలన్ జేసి రాసురతర్జనముగ. 177

గీ. అపరవారాశియుంబోలె అఖిలదిశలు
చుట్టి లంకాపురమ్మును ముట్టడించి
కాలజలదంబులట్టులు గర్జసేయ
ఎల్లలంకాపురమ్ము మూర్ఛిల్లిపోయె. 177

గీ. గగనమునకంటు సౌధభాగమ్మునుండి
రామ ! మీ సైన్యమున్ గాంచి రావణుండు
అచ్చెరువుచెంది మదిలోన మచ్చరించి
వచ్చి యూథాధినాథుల హెచ్చరింప. 178

ఉ. అక్కడ లంకలో అల దశానను నాజ్ఞను ద్వారదేశమం
దొక్కక రాక్కకోటిబలయుక్తిని దక్షతనుండ, సాలమం
దొక్కక గోపురంబున సముజ్జ్వలశూలమహాసిధారులై
రక్కసిజోదులంతటను రక్షణచేయుచు నుండి రుగ్రతన్. 179

## వానరసైన్యమునకు రాక్షససైన్యమునకు జరిగిన సంకులసమరము

శా. అంభోరాశితరంగభంగనినదం బాసైన్యసంహార్భటుల్
ఢం ఢం ఢమ్మని మ్రోగు శంఖముల నిస్స్వానమ్ముభేర్యాది సం
రంభోజ్జృంభితఘోషముల్ సెలగి తోరంబైన సంగ్రామ మా
రంభంబయ్యెను దిర్దిరన్దిరుగ ఆ బ్రహ్మాండభాండావళుల్. 180

గీ. గిరులు గిరిశిఖరమ్ములు తరులుదాల్చి
పోరుసల్పిరి వానరవీరులెల్ల
పరశువట్టిసగురుగదావరిఘములను
దాల్చి సమరమ్ము సల్పె నా దైత్యబలము. 181

క. ఇరుపక్షంబుల యోధులు
సరిదెల్పగరాని ధైర్యసంపద మీరన్
ధరణి చలింప పరస్పర
గురుతరవిజిగీషసమరకౌతుక మెసఁగన్. 182

క. పోరున్ సల్పిరి వెనుకకుఁ
బోరెవ్వరు వీరరసము పొంగులువారన్
ఘోరాహవమున రాక్షస
వీరుల్ ధరపడిరి ప్లవగవీరులచేతన్. 183

ఆ. కాఱుమొయిలు ప్రళయకాలమ్మునందున
క్రమ్మినట్లు దైత్యగణము చెలఁగి
అస్త్రశస్త్రవృష్టినంతట గురిపింప
పాఱె రక్తధార లేఱులగుచు. 184

క. వీరాలాపము లెసఁగన్
ఘోరమ్ముగ పోరుసల్ప ఘూర్ణిల్లె దిశల్
పారిన రక్తపుటేరుల
పారావారమ్ము రక్తపంకిలమయ్యెన్. 185

మ. ఇరుపక్షంబుల యోధులొక్క మెయి తామే గెల్తుమన్ బుద్ధిమై
స్థిరతన్ నిల్చి పరాక్రమించి పెలుచన్ సింహార్భటుల్ సేయుచున్
ధరణీచక్రము సంచలింపఁగ సముద్దాంతప్రచండోత్సవ
స్ఫురణన్ యుద్ధము చేసి రుద్ధతి మహాభూతాళి భీతిల్లగా. 186

గీ. రామ ! త్వద్దృష్టిపాత సంక్రాంతిఁ జేసి
వానరాధీశులైరి దుర్వారబలులు
రామ ! త్వద్దృష్టిపాత సంప్రాప్తిలేమి
రాక్షసానీకమెల్ల దుర్బలత నొందె. 187

క. చచ్చిరి ఎందఱొ దైత్యులు
నొచ్చిరి రణభూమి దనుతనూభవులెల్లన్
విచ్చెను దైత్యవ్యూహము
వ్రచ్చిన దేహముల పాఱివచ్చిరి దనుజుల్. 188

## ఇంద్రజిత్తు గావించిన మాయాయుద్ధము

క. అదిగని రావణి యెంతయు
మదిలోఁ గోపంబుగదుర మాయాయుద్ధో
న్మదితుండై మాయంబయి
చదలన్ దా నిలిచి సమరచాతురి మెరయన్. 189

గీ. "ప్లవగవీరుల బ్రహ్మాస్త్రబలముచేత
ధరను గూల్చెద"నని యింద్రధనువుపోలు
గురుతరంబైన ధనువు గైకొని నిశాత
శరపరంపర గురిసె నిర్జరులు బెదర. 190

మ. రథచక్రంబుల హోరు ఘోరమయి తారావీధి ఘోషింప, దు
ష్పథసంచారి సురేంద్రజిత్తు దృఢచాపం బంది కాండావళిన్
ప్రధనక్షోణినిగప్ప ఘోరతరనిర్ఘాత ప్రపాతంబులన్
వ్యథితంబై ధరగూలె వానరబలం బత్యంత సంభ్రాంతిపై. 191

క. వ్రాలిరి కొండలు ధరపైఁ
గూలిరి చైతన్యముడిగి కొండలు నేలన్
వ్రీలెన్ వ్యూహములెల్లను
కాలాంతమునాఁగ ప్రళయకాలము వోలెన్. 192

క. అంతటి ధీరులు గురుబల
వంతులు యూథాధిపతులు వానరవీరుల్
అంతట రణభువి మూర్ఛా
క్రాంతులు దామోచు బడినఁ గనుగొని వ్యథమై. 193

క. అది బ్రహ్మాస్త్రబలంబని
మదినెంచి తదీయశక్తి మన్నించి కడున్
సదమలమతి బ్రహ్మాస్త్రము
మదిలో స్మరియించి మహితమంత్రస్ఫూర్తిన్. 194

క. అనుజుం గని క్రూరుని రా
వణి నివ్వద ధరణిగూల్తు బ్రహ్మాస్త్రమునన్
గనుమనుచుం ధనువుం గొన
గని రావణి భయము గదురగాఁ జనె పురికిన్. 195

గీ. నీవు లక్ష్మణుఁడున్ పరదైవశక్తి
పరమతేజోవిశేషసంపన్నులగుట
అరసి మిము చేరదయ్యె బ్రహ్మాస్త్రశక్తి
నీవు తచ్ఛక్తిగురుత మన్నింతు వేఘుడు. 193

గీ. పద్మభవదత్త తద్వరబలముచేత
హనుమ పీడింపలేదు బ్రహ్మాస్త్రబలము
తక్కు ప్లవగేశులెల్ల చైతన్యముడిగి
ధరణిసోలుట గాంచి సంతాపమంది. 197

## శ్రీరాముని నియోగమున హనుమంతుఁడు ద్రోణాద్రిని గొనివచ్చుట – దివ్యౌషధములచే మృతవానరుల పునరుజ్జీవితుల జేయుట

గీ. మహితబలవంతు అతిమతిమంతు హనుమ
గాంచి పావని! వాయువేగమున నీవు
క్షీరవారాశిగల ద్రోణగిరికి నేగి
దివ్యతేజోవిశేష దేదీప్యమాన
శస్త్రసంజీవకరణి విశల్యకరణి
అనఁగ నొప్పెడు మహితదివ్యౌషధముల
శీఘ్రగతి తెచ్చి వీరి సంజీవితులుగ
జేయుమనుచును ఆజ్ఞను జేసినంత. 198

ఉ. నీదగు నాజ్ఞ వాయుజుఁ డనింద్యచరిత్రుఁడు తత్క్షణంబ క్షీ
రోదధికేగి బాహువుల ద్రోణగిరిన్ బెకలించి తెచ్చి నీ
పాదసమీపమందు నిడ పావని నెమ్మిని గాంచి ఆతనిన్
సాదరభావమొప్పగఁ బ్రశంసలు చేసితి వీవు రాఘవా! 199

గీ. ద్రోణశిఖరిని అరసి సుషేణుఁడంత
జీవనౌషధమైన సంజీవకరణి
తెచ్చి చేయ చికిత్స తద్దివ్యగంధ
మునసె హరిసైన్యమెల్లను మూర్ఛదొలగి
లేచి నిలిచెను ప్రాణముల్ లేచివచ్చి. 200

గీ. మరల తద్గిరి క్షీరాబ్ధిమధ్య విడిచి
వచ్చె పావని మీరెల్ల మెచ్చి చూడ
కాంచితదియెల్ల నేను నాకాశవీధి
చారణుఁడనౌచు ఆ వియచ్చరులతోడ
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 201

## సంజీవితులయిన వానరులు లేచి విజృంభించుట
## మేఘనాదుఁడు యుద్ధము సేయ మరల వచ్చుట

ఉ. వానరవీరులెల్ల రనివార్యపరాక్రమరేఖ లేచి, అం
భోనిధివోలె పొంగుచును భూధరముల్ ధరియించి ధీరతన్
దానవకోటిపైకుఱికి దర్పమునన్ బరిమార్చి ఆర్వ అ
ద్దాని నెఱింగి రావణుఁడు దారుణకోపపరీతచిత్తుఁడై. 202

క. ఈ వానరులెల్ల పున
ర్జీవితులెట్లైరొ యనుచు చిత్తమునందున్
రావణుఁ డచ్చెరువడి కో
పావేశమ్మెసఁగగా సభాంగణగతుఁడై. 203

గీ. వానరులు తాము దేవాంశభవులె యేమొ
ఆట్లుగాకున్న మరల వారెట్లు బ్రదికి
అధికబలదర్పశౌర్యధైర్యమ్ము లెనఁగ
యుద్ధమును జేయ - ఇట్లు సన్నద్ధులైరి? 204

క. అని మనమున చింతించుచు
తన సభనున్నట్టి శౌర్యధనులన్ ఘనులన్
కినుకన్ కెంపెక్కిన - ఆ
కనుగొలుకులనుండి అగ్నికణములు రాలన్. 205

క. కనినంత మేఘనాదుఁడు
ధనువున్ ధరియించి లేచి దర్పోద్ధతిమై
జనకా! ఇదె నే జని ఆ
వనచరరాఘవులఁ గూల్చి వచ్చెద ననుచున్. 206

క. తనకున్ దీటగు యోధుల
ఘనకార్ముక యుద్ధపటుల ఖడ్గాదికసా
ధన ధారుల రణధీరుఁ
గొని చనె రథవాజిసుభటకుంజరయుతుడై. 207

ఉ. వారలు ఘోరమూర్తులని వార్యపరాక్రమశాలు లుద్ధతిన్
వారిదపంక్తులట్లు - మదవారణవాజిశతాంగపాళి, దు
ర్వారగదాప్రచండకరవాలశరాసనశస్త్రధారులై
భోరున భేరికాధ్వని నభోంగణవీధి ప్రతిధ్వనింపగా. 208

గీ. వచ్చి ఆరీతి రణభూమిచొచ్చి రెచ్చి
అనిలవేగాన రేగు దావాగ్నివోలె
అస్త్రశస్త్రాగ్నికీలలహరిచయమ్ము
కాల్చి కూల్చిరి వ్యూహమ్ము గలఁగిపోఁగ 209

గీ. మేఘనాదుండు–ఆ కాలమేఘమట్లు
గర్జనముచేసి రిపుసైన్యతర్జనముగ
చాపనిర్ముక్తశితశరాసారవృష్టి
ముంచి వానరకోటి, గర్జించినంత. 210

ఉ. వానరయూథనాథులనివార్య పరాక్రమశౌర్యవృత్తిమై
దానవకోటిగూల్చి మదదంతితురంగరథాళివార్చి, దా
వానలమట్లుపేర్చుచు మహాహవకేళినిసల్ప రక్తముల్
వానలు సోనలౌచును ప్రవాహములయ్యె రణాంగణమ్మునన్.

ఉ. శాతశిలీముఖమ్ముల నిశాచరకోటిని నీవు గూల్ప, వి
ఖ్యాతబలుండు లక్ష్మణుఁడు–ఆశుగ వృష్టిని ఘోరరాక్షస
వ్రాతశిరమ్ములన్ దునుమ రక్తపుటేరులు పాఱె. భూతముల్
ప్రేతములెల్ల త్రావుచును త్రేన్చుచు నృత్యముచేసె నయ్యెడన్.

ఉ. కొందఱ నీవు గూల్ప మఱికొందఱఁగూల్పఁగ లక్ష్మణుండు దాఁ
కొందఱ వాయునందనుఁడు కొందఱ భానుతనూభవుండునున్
కొందఱ నంగదుండు మఱికొందఱ వానరయూథనాథులున్
అందఱు నిట్లు రాక్షసులనందఱఁ గూల్చిరి ఒక్క వ్రేల్మిడిన్.

## అంగదుఁడు ఇంద్రజిత్తుని పరాభవించుట

ఉ. అంగదుఁ డంతపోవక మహాహవకేళి సముత్సుకుండునై
చెంగునదాటి నింగికి విచిత్రగతిన్ తలఁదన్ని రావణిన్
భంగముచేసి వానివగు భవ్యరథమ్మును గూల్చి యార్చినన్
భంగముచెంది రావణి - అభంగురదివ్యరథాధిరూఢుఁడై. 214

## ఇంద్రజిత్తు నాగపాశమున రామలక్ష్మణుల బంధించుట

గీ. వాడినారాచమేసి అవ్వాలినూను
నేలగూలిచి వానరానీకపతుల
సర్వులన్ వాల్చి నాగపాశమున మిమ్ము
కట్టిపడవైచె కపులు దుఃఖమ్మునంద. 21

గీ. విజయగర్వంబుతోడుత విఱ్ఱవీగి
తంత్రికదియెల్ల దెల్ప నాతండు మెచ్చి
కౌఁగిటను జేర్చి పుత్రుని గారవించె
నాటిరేయిని గడపె ఆనందముగను. 216

## నాగపాశబద్ధులగు రామలక్ష్మణులను సీతకు జూపించుట

గీ. రావణుఁడు దుష్టచిత్తుఁ డా రాత్రియందు
పుష్పకముపైని భూజాత పూత సీత
పంపి ఆరీతి పన్నగపాశబద్ధు
లవుచు రణభూమిపడిన రాఘవుల మిమ్ము
పిశితభుక్కులచేత చూపింపఁ జేసె. 217

## సీతను సరమ ఓదార్చుట

గీ. సీత మీస్థితి గాంచి నిస్సీమదుఃఖ
భారమున ఏడ్చి క్రుంగి కన్నీరుగార్చి
జనని పొక్కుచు గాఢమూర్ఛను మునుంగ
సరమ ఓదార్చి ఆమె ప్రసన్న జేసి 218

గీ. రావణుని మాయలివ్వి సర్వమ్ము తల్లి!
రాఘవులు లేచివత్తు రమోఘశక్తి
కాంచెదవు గాక ఇపుడ దుఃఖమ్మువలదు
అనుచు నెన్నెన్నొ దెల్పి యా అవనిజాత
శాంతవాక్కుల తేర్చి ప్రశాంతిగూర్చె
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 219

## నాగపాశబద్ధులగు రామలక్ష్మణులను గాంచి సుగ్రీవాదులు దుఃఖాక్రాంతులగుట

నాగపాశమ్మునకు మీరు లోఁగి పుడమిఁ
బడిన మిముగాంచి కడు తడబాటు చెంది
ప్లవగనాథుండు—ఆ ఋక్షవల్లభుండు
హనుమదాదులు—ఆ విభీషణుఁడు మిగుల 220

గీ. పొగులుచుండ — సుషేణుండు "ముఖములందు
జీవకళలొల్కు వీరు సంజీవకరణి
జీవముల గాంచెదరు — పునర్జీవులగుదు"
రనుచు వచియించుచుండంగ నంతలోన 221

## నారదుఁడేతెంచి గరుత్మంతుని స్మరింపుమనుట

మ. వినువీధిన్ జనుదెంచి నారదుఁడు నిన్ వీక్షించి వేదోక్తులన్
వినుతుల్ సేసి మహానుభావ! ఇటు లుర్వీశయ్య నిద్రింతువే!
నిను నీ వింతయెఱుంగవే ప్రభు! మదిన్ నీవాహనంబైన ఆ
వినతాపుత్రు స్మరింపుమా అనుచు జ్ఞప్తిం దెచ్చినంతన్ వడిన్.

## గరుత్మంతుని – ఆగమనము నాగపాశములు వీడిపోవుట

ఉ. ఆతతపక్షవేగమున అంబుధిపొంగి నభంబునంట, ఈ
భూతలమెల్ల ఊఁగ – కులభూధరముల్ చలియింప, మింట కం
జాతభవుండు నా భవుఁడు-సర్వసుపర్వులు నిల్చి చూడ, దా
నాతతభక్తిమై గరుఁడుఁ డాకసవీధిని వచ్చి నిల్చెనన్. 223

గీ. పన్నగారిని గనినంత పట్టువీడి
సడలిపోయెను నాగపాశమ్ములంత
మీరు లేచినయంతనే మింటినుండి
పద్మభవ-భవ-సర్వసుపర్వవరులు
ప్రస్తుతించిరి పుష్పవర్షంబు గురిసి 224

గీ. పక్షిరాజంత మీకు – ప్రదక్షిణించి
అనుమతింగొని వినతుఁడై అరిగె దివికి
నారదుఁడును భక్తిమై నతులు సల్పి
మీదుమన్ననలంది గమించె నంత
కంటి నే నది దేవసంఘముననుండి
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 225

## రామలక్ష్మణులు లేచుట – సుగ్రీవాదులు ఆనందము

ఉ. సీవును లక్ష్మణుం డపుడు నిల్చి ధనుర్ధరులైన యంత సు
గ్రీవుఁడు ఆ విభీషణుఁడరిందముతో హరియూథనాథులున్
పావనియున్ ముదశ్రువుల వర్షము కన్నులఁజారిపార, ఆ
రావణుగుండె వ్రీలఁగ పరాక్రమఖేలల బొబ్బరించినన్. 226

## రావణుఁడు నివ్వెరపాటు చెందుట
## ధూమ్రాక్షుని యుద్ధమునకుఁ బంపుట

ఉ. రాక్షసరాజు నెమ్మది కరమ్ము వెఱంగును జెంది క్రోధతా
మ్రాక్షుఁడునౌచు, యూథపతు లందఱితో సభదీర్చి—అందు ధూ
మ్రాక్షుని వజ్రదంష్ట్రిని-ప్రహస్తు అకంపను గాంచి మీరలున్
ఈక్షణమండ వానరుల నెల్ల వధింపుఁడటంచుఁ బంచినన్. 227

## ధూమ్రాక్షుని యుద్ధము – హనుమంతుఁడు
## వానిని వధించుట

శా. ధూమ్రాక్షుండు మహారథుండు విలసద్దోర్దండగర్వంబునన్
తామ్రాక్షుండయి ఖడ్గశూలపరశూద్దండాయుధాఢ్యుఁడై
ధూమ్రాక్షిద్వయ వహ్నికోణముల— నిర్ధూమాగ్ని కీలావళీ
తామ్రజ్వాలలు ప్రజ్వలింపఁగ మహోద్దండప్రచండాకృతిన్. 228

చ. రథగజవాజిముఖ్య— చతురంగబలంబులతోడ వీరతన్
ప్రథనవిహారమున్ సలిపి వానరవీరులఁ గూల్చి వాల్చుచున్
వ్యథితులఁజేయ వాని గని వాయుసుతుండును జేర్చి యార్చి వే
రథగజవాజిరాజులను రాక్షసకోటిని గూల్చె యుద్ధతిన్. 229

క. గద చేగొని ధూమ్రాక్షుని
మదమడగగ మోది వాని మడియించిన- ఆ
కదనస్థలి వడి వీడుచు
పదములకున్ బుద్ధిచెప్పి పాఱిరి దనుజుల్. 230

## అకంపనుని మారుతి కూల్చుట

చ. కనులను నిప్పులొల్కఁగ అకంపనుఁడంతట కోటిరాక్షసుల్
తనవెనువెంట రాఁ జటుల దారుణశూలగదాసిధారియై
వనచరకోటి గూల్చఁగని వాయుజుఁడుగ్రత వాలమార్చి ఆ
ఘనగదతోడ వ్రేయఁగ అకంపనుఁడంతట వీడె- ప్రాణముల్. 231

## అంగదుఁడు వజ్రదంష్ట్రుని వధించుట

ఉ. అంతట వజ్రదంష్ట్రుడు- అనంతబలాన్వితుఁడౌచు వచ్చి, అ
త్యంతపరాక్రమంబున అహవముగ్రతచేయఁగాంచి, కా
లాంతకు నట్టు లంగదుఁడు అంబరవీథిని వచ్చి వాని, ప్రా
ణాంతకబాహుదండమున అతని గూల్చె ధరాతలమ్మునన్. 232

## రావణుని సర్వసైన్యాధిపతి ప్రహస్తుడు యుద్ధము సేయ వచ్చుట

ఉ. రాక్షసరాజసన్నిధి నిరంతరవర్తియు రాజ్యపాలనా
దక్షుఁడు మంత్రిశేఖరుఁ డుదారచరిత్రుఁడు సర్వసైనికా
ధ్యక్షుడు దేవతానికరదారణదక్షమహాభుజుండు ఫా
లాక్షుని లెక్కసేయనిపరాక్రమశాలి రథాధిరూఢుఁడై. 233

ఉ. దంతితురంగయోధరథదంతురసైన్యసమేతుఁడౌచు, కా
లాంతకు నట్టులుగ్రత- ప్రహస్తుఁడు వచ్చిపరాక్రమించి, దు
ర్దాంతనిశాతసాయకపరంపర వానరకోటి గూల్చి, వి
క్రాంతిని జూపి బాహుబలగర్వమునన్ గడుపేర్చి యార్చినన్.

గీ. అతని యుద్ధతిగాంచి భయంబునంది
యూథనాథులు వానరయోధులెల్ల
కదనభూమిని విడనాడి చెదరి పాఱ
వాహినీపతియైన పావకసుతుండు. 235

## సుగ్రీవుని సర్వసేనాధిపతి నీలుఁడు ప్రహస్తుని గూల్చుట

ఉ. నీలుఁడు కీలివోలె- దివి నిర్జరులెల్లరు మెచ్చిచూడ, ఉ
ద్వేలపరాక్రమోన్నతిని వింటికిదాటి మహాజవంబునన్
వ్రాలి రథంబుగూల్చి మదవారణమట్లు పరిభ్రమించుచున్
వాలపదాభిఘాతముల వాజిగజాళిభటాళి గూల్చనన్. 236

గీ. అన్యరథమున వచ్చి ప్రహస్తుఁ డంత
కోపభరమున ఘనతరచాపమంది
శస్త్రవృష్టిని వానరసైన్యమెల్ల
వసుధ గూలిచె నెత్తురు వఱదలెత్త. 237

ఉ. అగ్నిసుతుండు నీలుఁడును ఆరనికోపముతోడ రేగి, కా
లాగ్నిని బోలి మండుచు మహాగదబూని ప్రహస్తుశీర్షమున్
భగ్నముచేసి యార్చి భటవర్గముగూల్చ నిశాచరాగ్రణుల్
భగ్నమనోరథంబులను బాఱిరి వానరవీరులార్వగన్. 238

## ప్రహస్తుడుఁగూలిన వార్తవిని రావణుఁడు విచారించుట

గీ. అఖిలరాక్షససైన్యసర్వాధికారి
అసమవిక్రమశాలి ప్రహస్తుఁడట్లు
నీలుచేతను రణభూమిగూలు టెల్ల
రాక్షసులు వచ్చి దెల్ప నా రావణుండు. 239

గీ. అట్టిబలశాలి సర్వసైన్యాధికారి
కూలినందుకు మదిలోన కుమిలి రగిలి
యుద్ధమునకేగ తాన సన్నద్ధుఁడగుచు
ఇంద్రజిత్తును గని దనుజేంద్రుఁ డంత. 240

గీ. పురము నల్దెసనున్న గోపురములందు
రక్షులను నిల్పి నగరాభిరక్ష సేయు
మని నియోగించి సకలసైన్యాధిపతులు
దండనాథులు గొలువ నుద్దండశీల. 241

రావణుఁడు బ్రహ్మాండమగు సైన్యముతో యుద్ధమునకు బయలు వెడలుట

సీ. రథరాజిచక్రఘర్షరతీవ్రనాదముల్
ఫణిరాజునకును విభ్రాంతి గొలువ
గజరాజిభయదఘీంకారఘోరధ్వనుల్
దిగ్గజశ్రేణికి దిగులుగొల్ప
హయరాజికఠినరింఖాహతిరేగిన
ధూళికి సురరాజు త్రుళ్లిపడగ
భటరాజిఘనభుజాస్ఫాలనోద్ధతరావ
ముల యక్షగణములు మూర్ఛమునుగ

గీ. పటహఘాంకృతి దిక్చక్రవాళమగల
చటుల భీమాశ్వవాహితస్యందనమున
అఖిలభూతాళి అదర దేవాళి బెదర
రావణుఁడు వచ్చె సంగ్రామరంగమునకు. 242

గీ. పదిశిరస్సులు వింశతి బాహువులును
భీకరాకృతి గని కపివీరులెల్ల
భయముచే పాఱ యూథాధిపతులు నిలిచి
అగనగంబులు ధరియించి ఆర్చి పేర్చి. 243

గీ. రాక్షసాధీశు సైన్యసంరంభ మెల్ల
అడచి రథరాజి గజరాజి నడచి బాహు
బలము చూపించి రాక్షసబలముగూల్ప
రావణుఁడు గాంచి కోపసంరంభమంది. 244

ఉ. వచ్చి మహోగ్రచాపమున వాడి శరంబులుగూర్చి యేసి, వే
వచ్చిన యూథనాథులను వానరయోధుల ఋక్షనాథునిన్
హెచ్చినవిక్రమంబున అహీనబలున్ కపిరాజు, నంగదున్
వ్రచ్చిమహాశుగమ్ముల అవార్యపరాక్రమహేలఁ జూపినన్. 245

క. వచ్చిన వానరయోధుల
విచ్చిన వ్యూహమ్ముగని విభీషణుఁ డంతన్
చెచ్చెర లక్ష్మణునిం గొని
వచ్చి మహిం బడిన యోధవారముఁ జూపన్. 246

ఉ. అంతట లక్ష్మణుండును మహాధనువున్ ధరియించి రెచ్చి వి
క్రాంతిని జూపి ఆశుగపరంపరరావణుఁ గప్పి వాని దు
ర్దాంతమదమ్ము వో నడచి రాక్షసకోటిని గూల్చి పేర్చి ఆ
దంతితురంగసద్భటకదంబము వ్రాలిచి ఆర్చినన్ వడిన్. 247

ఆ. రావణుండు నంత లక్ష్మణు దుర్వార
విక్రమంబునకును వెఱగు చెంది
అతనిచెంతనున్న ఆ విభీషణు గాంచి
కనులనుండి అగ్నికణము లొలుక. 248

ఆ. భ్రాతయయ్యు శత్రుపక్షంబునన్ జేరి
మమ్ముఁ జంపవచ్చె తమ్ముఁ డౌనె?
శత్రువితఁడు మాకుఁ జంపెద నిశ్శంక
అనుచు నతనిగాంచి ఆగ్రహించి. 249

## రావణుఁడు మయదత్తంబగు శక్తిచే లక్ష్మణుని మూర్ఛితుని గావించుట

మ. మయదత్తంబగు శక్తిచేత నితనిన్ ద్రుంతుఁదు నేనంచు దు
ర్ణయవృత్తిం మదినెంచి తమ్మునిపయిన్ రక్షోధిపుండంత ని
ర్దయుఁడై యేయగ లక్ష్మణుండును మహాధైర్యమ్మునన్ నిల్చి దు
ర్జయమౌ దీన్కి విభీషణుండు బలిగారాదంచు లోనెంచుచున్.

గీ. అన్న వీనికిఁ దా సభయంబు నిచ్చె
ఇతని గాచుట ధర్మమంచెంచి మదిని
చాపమును దాల్చి విపుల వక్షమ్ముసాచి
మేరుగిరివోలె నిలిచె నమేయశక్తి. 251

గీ. అమ్మహితశక్తి ఆతని వక్షమ్మునందుఁ
జొచ్చినంతనె సౌమిత్రి సోలి వాలి
గాఢమూర్ఛను మునుగంగ మూఢబుద్ధి
రావణుఁడు వానిపురికిఁ గొంపోవనెంచి. 252

గీ. వచ్చి వింశతిబాహుల బలముచూపి
ఎత్తగాబోయి ఆతని నెత్తలేక
రజతశైలంబుకంటె భారంబిదేమి!
అనుచు ఆశ్చర్యమున దిక్కులరయుచుండ. 253

## హనుమంతుఁడు మూర్ఛితుఁడగు లక్ష్మణుఁని రాముని ఆజ్ఞను గొనితెచ్చుట

గీ. అంత నీయాజ్ఞ హనుమంతుఁడశని బోలు
ముష్టిఘాతాన రావణు మూర్ఛపుచ్చి
స్కంధశిఖరమ్మునందు లక్ష్మణుని జేర్చి
ఆశ్రమంబున దెచ్చె నీ అంకమునకు. 254

గీ. సర్వశక్తులనిలయమౌ ఉర్వినెల్ల
శీర్షమున దాల్చు నా ఆదిశేషుఁడైన
లక్ష్మణునిదాల్ప శక్యమే రావణునకు
భక్తుఁడగుటను దాల్చె నవ్వాయుసుతుఁడు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 255

## శ్రీరాముడు మహోగ్రకోపమున రావణు నెదిరించి విరథుని గావించుట

చ. అనుజుని రక్షణార్థము మహాబలవంతుని జాంబవంతునిన్
ఇనజుని యూథనాయకుల నెల్లర నిల్పి మహోగ్రమూర్తివై
ఘనతరబాహుదండమున కార్ముకరాజము దాల్చి యేగగా
అనిలసుతుండు నిన్గని మహాభుజ! ఈగతి పాదచారివై
చనదగునే మదీయమగు స్కంధమునందునఁ గూరుచుండి ఈ
రణభువి స్యందనస్థుఁడగు రావణుతోడుత పోరునల్పగా
జనుమని భక్తితో నిజభుజమ్ములదాలిచి ఘోరమూర్తియై
అనిలజవంబునన్ జని దశాననుముందఱ నిల్చె అర్చనన్. 256

ఉ. రావణుఁడుగ్రమూర్తియయి రామ ! నినున్ భుజపీఠిదాల్చు ఆ
పావనిగాంచి కోపమున వాడిశరమ్ముల నొవ్వనేసి, తా
చేవదలిర్ప నీవయి అశీతినిశాతశరంబు లేసినన్
నీవు మహోగ్రరోషమున నిష్ఠురశాతశరావళిన్ వడిన్
రావణుబాణముల్ దునిమి రాక్షసనాథురథమ్ము సారథిన్
మావులగూల్చి ఛత్రమును మాయగఁ జేసి సిడంబువాల్చి, ఆ
లావగు చాపమున్ దునిమి రత్నకిరీటముడుల్చి వ్రేల్మిడిన్
పావకతుల్యకాండమున వానియురంబును వ్రయ్యనేసి మూ
ర్ఛావశుఁజేసి అద్భుతపరాక్రమహేలను జూపి నేటికిన్

చాపునుదప్పి పొమ్ము-కదు క్రాంతుఁడవై తిపి రేపురమ్ము- లా
లాపుపరాక్రమమ్ము-కరలాఘవ మెల్లను జూపువాఁడ నాన్
రావణుఁడెంతొ లజ్జయు పరాభవమందుచు పోయె లంకకున్.

## మూర్ఛితుఁడైన లక్ష్మణుంగాంచి రామచంద్రుఁడు దుఃఖాక్రాంతుఁడగుట

ఉ. రావణుఁడట్టులన్- కడుపరాభవమంది పురంబుకేగ, మూ
ర్ఛావశుడై విసంజ్ఞను ధరాస్థలిసోలిన తమ్ము లక్ష్మణున్
నీవట గాంచి బాష్పములు నిండి కనుంగవనుండి రాల, సు
గ్రీవవిభీషణాదులను-ఖిన్నముఖమ్మున గాంచి పొక్కుచున్.

ఉ. ఏగతి నే నయోధ్యకిఁక నేగెద తమ్ముఁడు వెంటలేక నే
నేగతి ఊర్మిళన్ గనుదు, నేగతి మాత సుమిత్రగాంతు నే
నేగతి జూతు తమ్ములను, ఏగతి గాంచెద నాదుతల్లి, నే
నేగతి గాంతు పౌరులను, ఏమని నే వచియింతు వారికిన్. 259

ఉ. కానలకంపె మమ్ము నటు కైక నిజాత్మజరాజ్యకాంక్షమై
కాని సుమిత్రమాత తనకన్నసుతున్ సుకుమారగాత్రునిన్
మానితరూపశీలగుణమండితు లక్ష్మణు మమ్ముఁ గొల్వగా
కానలకంపె ఆ జననిగాంచగ నేనిఁక నెట్లు పోయెదన్. 260

గీ. జనకరాజేంద్రమణితనూజాత పూత
లలితగుణరూపశీలోర్మిళాకుమారి
వరమసాధ్వీమతల్లి నిస్స్వార్థబుద్ధి
మమ్ము సేవింప నాథు లక్ష్మణుని బంపె. 261

గీ. ఆమెకీడైన తరుణిలెందైన గలరె
సహనమున కామె భూదేవి సాటిగాదె!
ధరణిజాతకు తగిన సోదరియు గాదె!
అట్టి ఊర్మిళ మోము నే నెట్టుగాంతు ? 262

గీ. తల్లిదండ్రుల తనప్రియదయిత విడిచి
మమ్ము సేవింపవచ్చిన మహితగుణుఁడు
అట్టి తమ్ముఁడు లేకుండ అరుగుదెట్లు
అనుచు దుఃఖించు నినుగాంచి ఇనసుతుండు. 263

గీ. వైరుధీరుండవౌ నీ వమేయచరిత !
ధైర్యమును వీడి దుఃఖింపఁ దగునటయ్య !
అనిలతనయుండు గలఁడు నీ అనుగుతమ్ము
జీవితునిజేయు వేగ సంజీవితెచ్చి. 264

గీ. అనుచు ఓదార్చి మిగుల ధైర్యంబుగూర్చి
అమలబుద్ధిని నీవు మోహమ్ముతొలఁగి
అనిలతనయుని గాంచి అత్యంతభక్తు
అతిజవమ్మున నీవు క్షీరాబ్ధికేగి
జీవనౌషధమైన సంజీవితెచ్చి
వేగ లక్ష్మణుబ్రతికింపవే ! అటన్న. 265

## హనుమంతుఁడు సంజీవినితెచ్చుటకై బయలుదేఱుట

ఉ. మారుతి నీదు నాజ్ఞ విను మార్గముఁబట్టి మనోజవంబునన్
క్షీరపయోధికేగుట వచింపఁగ చారులుఁ భీతినందుచున్
క్రూరుఁడు రావణుండధికకోపభుజంగమదష్టచిత్తుడై
మారుతిమార్గమధ్యమున మాయలచే మడియింప నెంచుచున్. 266

## రావణుని ప్రేరణమున కాలనేమి మాయలుపూని హనుమంతుని మార్గమధ్యమున ఆపుటకు యత్నించుట

ఆ. మాయలందు అల్ల మారీచు మరపింప
జాలునట్టివాఁడు కాలనేమి
అనుచు మదినినెంచి ఆతని గనఁబోవ
అతడు గౌరవమున ఆదరించి. 264

ఆ. రాక్షసేంద్ర ! నీదు రాకకుం గతమేమొ !
రాజకార్యమెదియొ రాజ ! కలదె ?
అనిన రావణుండు అంతయు వినిపించి
మారుతాత్మజన్ము మార్గమందు
నిలువరింపఁజేసి నీమాయచే వాని
మట్టుపెట్టవలయు మాదు నాజ్ఞ 265

ఆ అనిన కాలనేమి అసురేశ్వరా ! నీకు
ఎవరు గఱపిరయ్య ! ఇట్టి బుద్ధి ?
రాము నెఱుఁగవే పరాత్పరుఁ డాతండు
అతనితోడ వైర మనఘ! తగునె ? 266

ఆ. అవనిజాత భక్తినాతని కర్పించి
శత్రుభావముడిగి మైత్రిగొనుము
శరణువేడ నతఁడు కరుణతో నిను బ్రోచు
నిలుపుకొనుము దనుజకులము నెల్ల. 267

ఆ. అనిన వాని గాంచి అట్టహాసముచేసి
ఆజ్యధారమందునగ్ని వోలె
మండిపడుచు బొమ్ము మాయాజ్ఞ తలదాల్చి
అరుగవేని చంద్రహాసధార 268

కాలనేమి ! నీదుకంఠమ్ము ఖండింతు
అనిన భీతిచెంది అతఁడు నిలిచి
మాకు మృత్యు వింక మారీచునకుబోలె
తప్పదనుచు నేగె తలను వాల్చి.

గీ. మాయచే క్షీరవారాశిమార్గమందు
ఆశ్రమంబును గల్పించి అందు తాను
ఇంద్రయోగమ్ము నూని మాహేశుపూజ
చేయదొడగెను శిష్యులు చేరిగొలువ. 269

మ. హనుమంతుండును వేగబోవు చోకచో ఆ యాశ్రమస్థానమున్
గని నే మార్గముతప్పిపోయితినొకో కాదేని ఇద్దాని నే
మును క్షీరాబ్ధికిఁ బోవునప్డు గననే మోసమ్ము ! మోహంబొకో!
చని మౌనీంద్రుని గాంచి వానివలనన్ సత్యంబు గుర్తించెదన్.

క. అని చని యట మౌనీంద్రుని
గని యతనికి వినతిచేయఁగా మునివరుఁడున్
అనిలజ సర్వము నెఱుగుదుఁ
జనుదే సౌమిత్రిలేప సంజీవికినై ? 271

ఆ. లక్ష్మణుండు లేచె రామునిమహిమచే
తెలిసికొంటినెల్ల దివ్యదృష్టి
వలననన్ని మధురఫలములు భుజియించి
జలము ద్రావి యిచట శ్రాంతిగొనుమ ! 272

ఆ. తాపసేంద్ర ! నాదు దాహమ్ము తీరగ
జలము ద్రావి వత్తు కొలనుగలదె ?
అనిన మాయతపసి అదియె కాసారమ్ము
జలముగొనుము దాహశాంతిగాగ. 273

గీ. జలము ద్రావంగ హనుమ కాసారమందు
జొచ్చినంతనె ఎటనుండొ వచ్చి మొసలి
వాని పాదమ్ముఁబట్ట దుర్వారగతిని
ఘనభుజమ్ముల దాని వక్త్రమ్ము చీల్చి
మడమలన్ ద్రొక్కి మడియింప మకరి యంత
దివ్యసుందరిగా మారి దివిని నిలిచి. 274

గీ. అనిలసుత! మున్ను నే నొక అప్సరసను
"ధాన్యమాలిని" నాపేరు మాన్యచరిత!
మౌనిశాపమ్ముచే నిట్లు మకరినైతి
శాపముక్తిని నీభుజశక్తిఁగంటి. 275

గీ. నిన్ను ఏ మౌని ఎంతొ మన్నించి పంపె
అతఁడు మునికాడు కాలనేమ్యాహ్వయుండు
రావణుండంప వచ్చిన రాక్షసుండు
కాలహరణమ్ముచేసి మార్గమున నిన్ను
మటుపెట్టగవచ్చిన మాయలాడు. 276

## హనుమంతుడు కాలనేమిని వధించి ద్రోణాద్రిని గొనివచ్చుట

గీ. అతని వధియించి వేగ క్షీరాబ్ధికేగి
జీవనౌషధియైన సంజీవితెచ్చి
లక్ష్మణస్వామిప్రాణముల్ రక్షచేయు
మనుచు వచియించి అచ్చర అరిగె దివికి. 277

మ. హనుమంతుండును వచ్చి కోపమతియై ఆ కాలనేమిన్ వడిన్
ఘనముష్టిన్ వధియించి కాలహరమున్ గాకుండ క్షీరాబ్ధికిన్
జని సంజీవిమహౌషధిన్ గనక దోస్సారంబు దీపింపగా
తనబాహుద్వయి ద్రోణభూధరమునుత్పాటించి వేవేగ ల
క్ష్మణుప్రాణమ్ముల నిల్ప దెచ్చెను మహాసంజీవి దివ్యౌషధిన్.

## లక్ష్మణుఁడు మూర్ఛనుండి లేచుట రాముఁడుల ఆనందము

గీ. శీఘ్రగతిమీర వచ్చి సుషేణుఁడంత
పూవుతావులజేసి సంజీవి నరసి
తత్ప్రసన్నమ్ముల దివ్యౌషధమ్ము వోయ
మహిత తచ్ఛక్తి లక్ష్మణుఁడు లేచి. 279

గీ. రావణా ! ఇంక నిలువు సంగ్రామభూమి
అనుచు ఆవేశమున కేల ధనువుదాల్ప
నీవు వానరరాజు సుగ్రీవుఁ డెలమి
కన్నులానందబాష్పముల్ క్రమ్మికురియ
అమితమైనట్టి ఆనందమందినారు
గాఢముగ నీవు తమ్ముని కౌఁగలించి
మూర్ధమాఘ్రాణమును జేసి మోదమంద
అరసి తడియెల్ల నేను ఖేచరుఁడ నగుచు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 280

క. సంజీవితెచ్చి లక్ష్మణు
సంజీవితుఁజేసినట్టి సాహసవీరా !
రంజితవానరరాజ ! ప్ర
భంజనసుత ! దనుజవీరభంజన హనుమా ! 281

గీ. భ్రాతలక్ష్మణునకు నీవు ప్రాణదాత
వైతి వేమిచ్చెదను నీకు ననుచు నతని
కౌగిటను జేర్చి తానందకలితమతిని
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 282

## రావణుండు విరథుండై యోడి పాఱి పురంబుచేరి నిజపరాభవంబునకు పరితపించుట

గీ. రావణుం డట్టులోడి పురంబు చేరి
దీనవదనుండునయి ముఖదీప్తిఁబాసి
లజ్జఁబెంపున నంతఃపురమ్ము సొచ్చి
దీర్ఘనిశ్వాసమూర్చి చింతించె నిట్లు 283

క. ఆ రాముని కరలాఘవ
మా రాముని అశనితుల్యమౌ శరఘాతం
బా రాముని శరవేగము
ఘోరమ్మని తలచి మిగులఁ గుములుచు మదిలో. 284

గీ. రాము నెదిరించి ఆహవరంగమందు
నిలువ శక్యంబుగాదు త్రిణేత్రునకును
దివిజులెల్లరు నాడు ప్రార్థింప భువిని
రాముఁడై పుట్టె నిజము నారాయణుండె. 285

ఆ రూపమ్మా తేజ
మ్మా రణపాండిత్యమరయ నబ్బురమౌగా
ఆ రుద్రుడు కాలాంతకుఁ
డీ రాఘవుఁడగుచు వచ్చెనేమో భువికిన్ ! 286

గీ. ఇంక నే రీతి ఆ రామునెదుట నిలిచి
పోరునల్పుడు ! ఏగతి పోవువాఁడ
అనుచు తలపోయుచుండగ నంతలోన
రామ ! నీ సేనఁ బుట్టె కోలాహలంబు. 287

## సంజీవిదివ్యగంధముచే లేచి వానరయోధులెల్ల సింహగర్జనము చేసి విజృంభించుట

గీ. తన్మహౌషధిదివ్యగంధమ్మువలన
పడిన వానరయూథాధిపతులు లేచి
రాక్షసేశుఁడు మిగుల విభ్రాంతి చెంద
సింహములబోలి నిలిచి గర్జించి మించె. 288

గీ. జీవనౌషధియైన సంజీవివలన
దివ్యతేజోవిశేషసందీప్తినంది
లక్ష్మణుఁడు లేచి దాల్చె శరాసనంబు
వానరానీక మానందవార్ధి తేలె. 289

శా. యుద్ధోత్సాహమెసంగ వానరమహాయోధానుయోధుల్ కడున్
క్రుద్ధుల్ వృక్షనగాగ్రధారులగుచున్ రోధింప లంకాపురిన్
క్రుద్ధుండౌచు దశాననుండును వడిన్ రూక్షాక్షుఁడై యుద్ధస
న్నద్ధుం జేయుదు కుంభకర్ణు నని చింతామగ్నచిత్తుండునై. 290

## కుంభకర్ణుని నిద్రనుండి మేల్కొల్పుట

గీ. ఇంత అయ్యును దానేమి యెఱుకలేక
గాఢనిద్రావశుఁడు కుంభకర్ణుఁడయ్యె
వాని మేల్కొల్పి దుర్దాంతబలసమేతు
పంపి శత్రులనెల్ల నశింపఁజేతు. 291

చ. అని మదినెంచి యూథపతులందఱితో నభదీర్చి మీరు నా
అనుజుని కుంభకర్ణుని మహాభుజశాలిని మేలుకొల్పగాఁ
జనుఁడని పంప వారలు నిశాచరనాథుని ఆజ్ఞమేర ఆ
ఘనతరవింధ్యభూమిధరకందరతుల్యగృహాంతరమ్మునన్. 292

గీ. యోజనాయామశయ్యపై ఒడలుమరచి
పడుము లురిమిన యట్టులు గుఱకలిడుచు
నాసికారంధ్రఘోరనిశ్వాసములకు
యోధులెల్లను నిట్టట్టులూఁగిపడగ
ఘోరనిద్రాప్రమత్తుఁడౌ కుంభకర్ణు
గాంచి ధైర్యమ్ముగొని సమీపించి వారు. 293

సీ. పటహభేరీఘోరవాద్యముల్ మ్రోగించి
పదివేలయోధులు పట్టియూపి
శ్రవణరంధ్రమ్ముల శంఖాలుపూరించి
ముసలముముద్గరముల మోది బాది
మదగజంబులచేత మట్టించి యూపించి
సీసమ్ముకరఁగించి చెవులఁబోసి
పట్టుకారుల నొడల్పట్టించి పీడించి
లావైనమీసముల్ లాగి యూగి

గీ. ఎట్టకేలకు మేల్కొల్ప ఇట్టెకదలి
ఆవులింతలయోధులు అదిరిపడగ
అగ్నిగోళమ్ములన్ బోలు అక్షియుగము
అల్లనన్విప్పి లేచె వింధ్యాద్రిబోలె. 294

గీ. నిదురమత్తున తూగుచు నిష్ఠురముగ
దంతఘట్టనసేయుచుద్దండలీల
ఒడలు విఱుచుచు తేఱి నల్గడలు నరసి
నతులునల్పెడు సేనాధిపతులఁగాంచి. 295

గీ. ఆనమయమ్మున ననులేపునంతకార్య
మేమివచ్చెను కుశలమే ఎల్లరకును
అన్న కేదైన శత్రుభయమ్ము గలదె ?
అనుచు నడిగిన జరిగినదంత వారు
వినయవినమితగాత్రులై విన్నవింప
క్రూరతామ్రముడై మహాక్రుద్ధుడగుచు
కసిమసంగెద శత్రువర్గంబునెల్ల
అనుచు గర్జించి శయ్యాగృహంబువీడి 296

## కుంభకర్ణుఁడు రావణుం జూడవచ్చుట

గీ. స్నానమునుజేసి రక్తవస్త్రములు దాల్చి
తనకునై దెచ్చి స్వర్ణభాజనములందు
రాశిపోసిన సర్వాన్నరాశు లరసి
షడ్రసోపేతఖాద్యమాంసములగాంచి
దిమ్ముగొల్పెడు మద్యభాండమ్ములరసి
తృప్తితీరగ భుజియించి దీప్తినంది
తనివితీరగ ఎల్లమద్యములఁ ద్రావి
అనుసరింపగ సర్వసేనాధిపతులు
పాదఘట్టన నాగేంద్రుఫణములడఁగ
రాగరంజితరక్తనేత్రములతోడ
ఘూర్ణమానాక్షిగోళుఁడై కుంభకర్ణుఁ
డగ్రజుని జూడవచ్చె మహోగ్రమూర్తి
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 297

### రావణుండు కుంభకర్ణునితో నాడినమాటలు

ఉ. వచ్చినసోదరుం గని అవారితవిక్రమశాలి! రామతో
వచ్చెను యుద్ధమిప్డు మనవారలు యోధులు యూధనాథులున్
చచ్చిరి శత్రుపక్షమున చావదెరక్క్వరు చూడ చిత్రమ్గా
హెచ్చినవీర్యదర్పమున వేగి వధింపుమ శత్రువర్గమున్. 798

చ. రణమున ఏ నెఱుంగను పరాభవమన్నది– గాని నేడహో
ఘనభుజశాలి రాఘవుని గాఢశరాహతి మూర్ఛితుండనై
రణభువి వీడివచ్చితి పరాభవమందితి కుంభకర్ణ ఆ
అనుజుల రామలక్ష్మణుల ఆహవభూమి వధించుమా వెనన్.

### కుంభకర్ణుడు అగ్రజానుద్దేశించి ఆడినమాటలు

ఆ. అనిన కుంభకర్ణుడామాటలాలించి
అగ్రజునకునైన అపజయంబు
బంధువర్గమృతియు భావించి మదిలోన
తలంచె సీతందెచ్చు ఫలమటంచు. 800

ఉ. అగ్రజ ! నీవు నాడటుల ఆసతిసీతను దెచ్చుటంజుమీ
విగ్రహమిట్లువచ్చె రఘువీరునితోడుత నాడు దెల్పగా
ఉగ్రుండవౌచు మానుడులహో వినవైతివి తత్ఫలమ్మ ఈ
విగ్రహమింక నీవనుభవింపకతప్పదు తత్ఫలంబునున్. 801

గీ. రాముడాతండు నరుండె నారాయణుండు
"సీత" యన్ననొ ఆజగన్మాతగాదె !
ఇప్పుడైనను ఆసాధ్వినప్పగించి
శరణువేడుము శ్రీరామచంద్రవిభుని
"అతండు మీపాల మృత్యువై అవతరించి"
అనుచు వచియించె మున్ను నాకమరమౌని. 802

గీ. అనుచు హితమును దెల్పు నా అనుజుగాంచి
కోపసంరక్తనేత్రుడై తాపమంది
గతమునకు చింతసేత సంగముగాదు
కృతముస్మరియించుటదియె ప్రస్తుతముగాదె. 303

ఉ. ఏమిది ! మాకె నీతులను ఈగతిదెల్పగ లేచివచ్చితే
రాముడు విష్ణువే? అలపరాత్పరుడందువె? అట్ల జానకీ
రామయు లక్ష్మియే? అయిన రాముడు యుద్ధమునేయనేల? స్వే
చ్ఛామతిదా దలంచునెడ సాధ్యము గావా కార్యముల్ ?

గీ. చాలు చాలింపు నీదువాచాలతయును
చేవగలదేని యుద్ధమ్ముచేయ బొమ్ము
తెగువలేకున్న పోయి నిద్రించుమింక
అనుచు కోపమ్మునన్ బల్కె సంతసతడు. 305

గీ. అగ్రజన్ముడు తా రుష్టుడౌటయెల్ల
స్పష్టముగదోచు నతనిసంభాధణమున
కాలమాసన్నమైన ఆ కాలమందు
హితముచెప్పిన అది రుచియించునెట్లు ? 306

గీ. అనుచు మదినెంచి తాను ఆసనమునుండి
డిగ్గునన్ లేచి అగ్రజుదిక్కుచూచి
మ్రొక్కి రోషంబునన్ జేసి దిక్కులదర
గర్జనముచేసి ఆకుంభకర్ణుడేచి. 307

## కుంభకరుఁడు యుద్ధముసేయ వచ్చుట

ఉ. కాలునిమించి ఆప్రళయకాలకరాళలలాటలోచనున్
బోలి మహోగ్రఫాలమున భ్రూకుటిరేఖల క్రోధమూర్తియై
కాలనురాచి వానరుల కాలునిప్రోలికిఁ బంపువాఁడ ఈ
శూలమహాగ్నికీలముల చూడెద దాషపులన్ క్షణమ్మునన్, 308

గీ. ఇనజువధియించి ఆ వాలితనయుగూల్చి
అనిలనందను అఅక్షహంతఁ జంపి
యూథనాథులనెల్లర ఉర్విఁవాల్చి
వసుధగాపింతునింక అవానరమ్ము. 309

గీ. చండకాలాగ్నికీలాప్రచండమైన
శూలముసుధాల్చి కేల నాభీలగతిని
కుంభకర్ణుండు క్రోధసంరంభుఁడగుచు
సాలమునుదాటి ఆవింధ్యశైలమట్లు 310

గీ. పాదఘట్టన శేషుని పడగలనగ
సింహగర్జన గగనంబు చిల్లువడగ
బాహువిక్షిప్తదిగ్భిత్తివగిలిపడగ
అంబరంబంటు వృషుల దేహంబుతోడ. 311

క. భుగభుగ కన్నుల పొగలున్
ధగధగమంటలునురేగ దర్పోద్ధతిమై
జగముల్లెల్లను ఒకపరి
దిగమ్రింగునో యనఁగ ఎల్లదివిజులు చెదరన్. 312

ఉ. వచ్చినవానిగాంచి వడివానరులెల్లరు భీతిపాఱి పె
పిచ్చినవ్యూహముం గని విభీషణ ! భీకరమూర్తియౌచు ఈ
వచ్చెడువాఁడెవఁడో ! ఘనబాహుఁడు పర్వతతుల్యదేహుఁడున్
చెచ్చెర ఎల్లసేనల గ్రసింపనొ యేమొ గుహాముఖమ్మునన్. 313

గీ. అనిన రాఘవ ! ఇతఁడు నా అగ్రజుండు
కుంభకర్ణుండు సకలదిక్కుంభిజేత
బాహుబలమున నిఖిలదిక్పాలవరుల
మూఁడులోకాలు గెలిచిన భూరిబలుఁడు. 314

గీ. పద్మభవదత్తఘోరశాపమ్ము వలన
రామ ! ఈతండు సతతనిద్రావశుండు
ఆఱుమాసాలకొకతూరి అతఁడు లేచు
అప్పుడాతనిగెల్వ సాధ్యంబుగాదు. 315

గీ. నేడు బలవంతముగ వీని నిద్రనుండి
లేపిపంపిరి నిద్రావిలీనునితని
కాన వీనికి చావునిక్కమ్ము నేడు
అనుచు వచియించి మెల్లన అన్నజేరి. 316

గీ. వినయమున మ్రొక్కి నేవిభీషణుఁడ నన్న
నాడుసభలోన నేనట్లు నయము దెల్ప
అన్న కోపించి నన్ను పొమ్మనెను నాడు
వచ్చి శ్రీరాముశరణమ్ము సొచ్చినాఁడ. 317

క. అనిపల్కిన ఆతమ్ముని
కనుగొని మదిమెచ్చి బిగ్గకౌఁగిటగొనుచున్
మనవంశమునిల్పుము నీ
వని దీవెననిచ్చి పనిచి ఆగ్రహవశుఁడై. 318

గీ. పానని(ద్రా(ప్రమత్తుండ భవ్యశీల !
ఎవరుమనవారొ శాత్రవులెవరొ యెఱుఁగ
గాన శీఘ్రమ్ము పొమ్ము ! అగ్రజునియాజ్ఞ
యుద్ధమొనరింతు నింక మహోగ్రవృత్తి. 319

గీ. క్షీరవారాశి మంథరగిరిని బోలె
కమలకాసారమును గంధగజమువోలె
వానరాధిపవాహినీవార్ధిఁజొచ్చి
కలచిపైచెను అకుంభకర్ణుడంత. 320

## కుంభకర్ణుని యుద్ధము-వానరులోడి పాఱుట

చ. జలధిగభీరవారితలసంచరదుగ్రమహాతనూతిమిం
గిలమన కుంభకర్ణుఁడటుకీశగణాంచితభీమవాహినీ
జలనిధిసొచ్చి ఆప్లవగసైన్యము పట్టి గ్రసించునంతటన్
కలగుడుసెంది వాహిని కకావికలై పఱతెంచె దిక్కులన్. 321

ఆ. అంబరంబునంటు ఆతనిదృష్టికి
అంతలేని ప్లవగులింతలేసి
మశకమక్షికముల మాదిరి గాన్పింప
కాలకేల వారి నేలరాచి. 322

క. ఇనజుని ప్లవగాధీశుని
గని వానిని బలిమిబట్టిగొనుసు నంతన్
హనుమంతుఁడు అంగదుఁడున్
ఘనతరులన్ మోది వాని గర్వమడంపన్. 323

చ. ఇనజుఁడు పర్వతమ్ముఁగొని ఏసిన దానిని కుంభకర్ణుఁడున్
ఘనభుజశక్తిఁద్రోయుచు మృగమ్మును జట్టినయట్లు పట్టి ఆ
యినజునిస్కంధమందునిడి ఏగుచునుండగ భానుజుండు నా
తనిగురుకర్ణముస్ కఱచి దాటివెసన్ బఱతెంచె నంతలో. 324

చ. అనిలజజాంబవంతులు మహాబలశాలులు యూథనాథులున్
ఘనతరభిందిపాలపరిఘమ్ముల మోదుచు నొవ్వఁజేసినన్
మనమున లెక్కసేయ కసమానబలుండు మహాజవమ్మునన్
ఘనభుజముష్టిఘాతపదఘాతములన్ భువిగూర్చె వారలన్. 325

ఉ. శూలముఁగ్రుచ్చికొందఱను శూర్పనఖంబులఁ జీల్చి కొందఱన్
కాలనురాచి కొందఱ ముఖమ్మున మ్రింగుచు నింకఁ గొందఱన్
సాలవిశాలఘోరభుజశాఖలతో మఱికొందఱన్ వడిన్
కాలునిప్రోలికిన్ బనిచె కాలవిజృంభితకాలుఁడో యనన్. 326

గీ. ప్లవగనాథుండు యూథాధిపతులునెల్ల
హనుమదంగదజాంబవదాదులెల్ల
ఘనబలుండగు నాకుంభకర్ణుతోడ
ఘోరముగఁ బోరి అలసిన వారి గాంచి. 327

ఉ. అంతట లక్ష్మణుండును మహాధనువున్ ధరియించి తాను వి
క్రాంతిని జూపఁబోవ గని రాఘవ ! తమ్మునినాపి మీరు నా
చెంతను నిల్చిచూడుడి అజిహ్మగమామకశాతబాణవి
క్రాంతిని క్రూరకర్ముని కరాళునిగూల్చెద కుంభకర్ణునన్. 328

## శ్రీరాముడు కుంభకర్ణునితో యుద్ధము చేయుట

చ. అని-వని నాడగస్త్యుడు మహాముని యిచ్చిన యింద్రచాపమున్
గొని ఘనవారిదంబుగతి క్రూరనిశాతశరప్రవర్షమున్
దనుజనగంబుపైఁగురిసి దారుణగైరికధాతుధారలో
యనరుధిరప్రవాహమున నతనిముంచిన ఘోరమూర్తియై 329

ఉ. కాలునిబోలియంత-ఘటకర్ణుఁడు కన్నులగ్రమ్మ మంటలున్
శూలము కేలఁబూని కడుశూరత నిన్నెదిరింప నీవు నా
ఫాలవిలోచనుండనగవజ్రనిశాతమహాశరమ్ముగన్
వ్రాలఁగఁజేసివావుగదె వాని సశూల కరాశహస్తమున్. 330

## శ్రీరాముడు కుంభకర్ణుని వధించుట

ఉ. సాలమహానగప్రచురశాఖనుబోలు తదీయబాహువున్
నేలనుగూల్చ వానరులనేకులు వ్రాలిరి తద్భరమ్మునన్
వాలిన కోపవేగమున వాఁడును వామభుజార్గళమ్మునన్
గూలిచి పెక్కు-వానరుల ఘోరముగా నినుబట్టవచ్చినన్. 331

క. పిడుగున్ బోలిన శరమును
వడిధనువున దొడిగె వానివామకరమ్మున్
బడనేసిన కొమ్మలుదెగి
పిడుగడచిన వృక్షమట్లు పీతభుజుండై. 332

గీ. హ్రాదినీఘోరధారాప్రహారమునను
పక్షములుత్రెవ్వికూలిన పర్వతమ్ము
పోలిరక్తప్రవాహమ్ము భోరుకొనగ
ఘోరనాదమ్ముచేసి దుర్వారగతిని. 333

ఆ. ఆకసమ్మునెగుర ఆక్రందనముచేసి
పాదఘట్టనమున వసుధయదగ
అక్షియుగమునుండి అగ్నులు వర్షింప
పరుగుతోడ వచ్చిపట్టఁబోవ. 334

గీ. అర్ధచంద్రాకృతిన్ మించు ఆశుగముల
వానిపాదద్వయిన్ ద్రుంప వాయుగతిని
చదలకవియేగి రక్తవర్షంబుగురిసి
లంకలోఁబడెఁ భూతభయంకరముగ. 335

చ. కరచరణంబులున్ దెగిన కాలభుజంగమువోలి వక్త్రకం
దరమును జాచి రాసతఁడు తన్ముఖగహ్వరమంతవ్రేల్మిడిన్
శరములనింపి ఇంద్రవరశస్త్రమహాస్త్రవిశిష్టశక్తిత
చ్ఛిరమును గూల్చినాపు గిరిశృంగము ఇంద్రుడుగూల్చుక్రైవడిన్

గీ. ఇంద్రదదివ్యాస్త్రశక్తిదేహంబువెగసి
అంబునిధిగూలె - తిమితిమింగంబులడఁగ
శిరములంకాపురంబు గోపురమునందు
పడియె తద్గోపురము కూలిపడగ క్షితిని. 337

## బ్రహ్మేంద్రాదులు నారదుడు శ్రీరాముని స్తుతించుట

గీ. కుంభకర్ణుండు నీచేత గూలినంత
దేవదుందుభినాదముల్ దివిని మ్రోగె
స్వర్గమునుండి పుష్పవర్షంబుగురిసె
అప్సరస్త్రీలమధురాస్యంబులెసఁగె. 338

గీ. పద్మజాభవ ముఖ్యదిక్పాలవరులు
అంబరంబున నిల్చి పుష్పాంజలిచ్చి
దివ్యసూక్తుల నిన్ను స్తుతించినారు
గాంచితదియెల్ల దివిజసంఘమునసుండి
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 339

ఉ. అంతట నారదుండును విహాయసవీధిని వచ్చి ఓ ప్రభూ !
అంతటిక్రూరకర్ముని మహాబలశాలిని కుంభకర్ణు వి
క్రాంతిని గూల్చి లోకముల కష్టములన్ దొలగించినావు వి
భ్రాంతిని గొల్పు నీ బలపరాక్రమముల్ వినుతింప శక్యమే. 340

గీ. మానవాకృతిగొన్న రమావిభుండ
వఖిలలోకేశ ! నీవు నారాయణుఁడవు
క్రూరరాక్షసకోటిని గూల్చి జగతి
బ్రోవవచ్చిన భవ్యరామావతార ! 341

ఆ. కుంభకర్ణుఁడిట్లు కూలుట దివిజుల
బాధలుడిగె భూమిభారముడిగె
రావణియును ఇంక రాక్షసరాజుండె
వారి గూల్చి ధరణిభారముడుపు. 342

క. అని బహుధా వినుతించుచు
కనులన్ ఆనందబాష్పకణములు గురియన్
ఘనసుందరు ఇంద్రశరా
సనధాముని నిన్నుగనుచు చనియెన్ దివికిన్. 343

చ. ఇనతనయుండు లక్ష్మణుఁడహీనబలుల్ హరియూథనాథులున్
అనిలసుతుండు ఋక్షవిభుఁడంగదుఁడాదిగ ఎల్లవారలున్
నిను వినుతించి మోదమున నీరధిపోలికపొంగియుఃబ్బుచున్
ఘనతరశంఖనాదముల గర్జనచేసిరి ఎల్లరుద్ధతిన్. 344

## కుంభకర్ణుఁడు కూలుట విని రావణుఁడు పరితపించుట

గీ. కుంభకర్ణుండు గూలెనన్ ఘోరవార్త
చెవినపడినంత ఆపంక్తిశిరుడు సోలి
వ్రాలిమూర్ఛిల్లి ఒక కొంతవడికి లేచి
ఖిన్నమానసుఁడగుచు దుఃఖించెమిగుల. 345

గీ. మూఁడులోకాలు గెలిచినవాఁడతండు
వానికీడైన వీరు లెవ్వారులేరు
అట్టితమ్ముండు లేని రాజ్యంబిదేల
అనుచుఁ జింతించె మదిలోన నతనిదలచి. 346

క. అతిబలవంతు మహోదరు
అతికాయునరాంతకున్ మహాపార్శ్వాఖ్యున్
సుతబలు ఆత్రిశిరస్కుని
తతభుజుదేవాంతకుని సుదంచితబలులన్. 347

## రావణుఁడు దేవాంతక నరాంతకాదుల యుద్ధమునకు బంపుట

క. కని ఘనయోధులు మీరలు
చనుడీ రథవాజి సుభట సంఘముతోడన్
అనిమొన శత్రులఁగూలిచి
ఘనవిజయము గాంచిరండు గర్వమెసంగన్. 348

ఉ. వారలు రాజునాజ్ఞ అనివార్యపరాక్రమశాలురుద్ధతిన్
దారుణఖడ్గతోమరగదాపరిఘాదుల దాల్చి ఆర్చుచున్
ఘోరున పోరుసల్ప రణభూమినభోంతరసీమగప్పి, అ
వ్వారలఁగాంచి అంగదుఁడు వాయుసుతుండును యూథనాథులున్

## దేవాంతక నరాంతకాదులను హనుమదంగదాదులు గూల్చుట

చ. పదభుజవాలఘాతముల వారలసైన్యములెల్లగూల్చి అం
గదుఁడు మహాభుజుండు పరిఘమ్మున గూల్చె నరాంతకున్ వడిన్
గదగొని వాయునందనుఁడు ఖడ్గితు నాత్రిశిరస్కు గ్రూరునిన్
మదమడగంగసేయుచు అమానుషశక్తిని గూల్చెనాతనిన్. 350

క. అంతట హనుమంతుని దే
వాంతకుఁడెదిరించి పోర వానిన్ గదచే
అంతంబొందించెను కా
లాంతకుఁడో యనగ హనుమ అద్భుతశక్తిన్. 351

## మహోదరుని నీలుఁడు, మహాపార్శ్వుని ఋషభుఁడు వధించుట

ఉ. ఆరనికారుచిచ్చోయన ఆర్చుచు పేర్చుచు శూలధారియై
ఘోరున బోరవచ్చెడు మహోదరు నీలుఁడెదిర్చి నిల్పి అ
వ్వీరుని శూలమున్ విఱచి విక్రమమున్ భుజశక్తి మీరగా
దారుణమౌ గదాహతిని తచ్ఛిరమున్ విదళించె గ్రక్కునన్. 352

క. అంత మహాపార్శ్వుఁడు దు
ర్దాంతుఁడు వెన్గదనుబూని దర్పమెసంగన్
దంతురవానరసైన్యము
అంతము గావింపఁదొడఁగె అగ్రహవశుడై. 353

గీ. ఋషభుడంతట ఉన్మత్తవృషభమట్లు
మత్తవేదండమట్టులున్మత్తుఁడగుచు
వాలమునఁజుట్టి అమ్మహాపార్శ్వుఁగట్టి
తద్గదాహతి ఆతని మూర్ధమ్ముఁద్రీల్చె. 354

## అతికాయుని లక్ష్మణుఁడు బ్రహ్మాస్త్రముచే వధించుట

ఉ. చతురశ్వాన్వితమౌరథమ్మున మహాచాపమ్ము చేబూని ఆ
అతికాయుండతికాయుఁడుద్ధతిని శంఖారావమున్ జేయుచున్
శతసాహస్రనిశాతసాయకమహాసారమ్మునన్ వానరుల్
క్షితిపైఁగూలగజేసి యార్చె విజయశ్రీవిక్రమస్ఫూర్తిమై 355

ఉ. వానిపరాక్రమమ్ముఁగని వానరవీరులు విచ్చిపాఱ, రా
మానుజుఁడాగ్రహంబున మహాధనువున్ ధరియించి వీఁకమై
సానలుగొన్నవజ్రసమశాతశరంబులఁగూర్చి సారధిన్
వానిరథాశ్వముల్ గెడపి వాడి శరంబునజేసె మూర్ఛలన్. 356

ఆ. మూర్ఛనుండి లేచి ముక్కంటియున్ బోలె
అన్యరథమునెక్కి అతఁడు వచ్చి
ఘోరచాపమంది క్రూరాశుగమ్ముల
పరప వానినెల్ల భంగపఱచి. 357

గీ. అస్త్రముల వానిగూల్ప నాయత్తమైన
"ధాన్యమాలిని పుత్రుఁడీతండు వీని
అస్త్రశస్త్రాళిగూల్ప శక్యంబుగాదు
అతఁడు బ్రహ్మాస్త్రమునగాని హతుఁడుగాడు"
అనుచు వినిపించె దివినుండి అమరవాణి 358

శా. అంతన్ లక్ష్మణుఁడట్లువిన్పడిన ఆ ఆకాశవాణిన్ నిజ
స్వాంతంబందున నెంచి తా నియతిమై బ్రహ్మాస్త్రమున్ వింట వి
క్రాంతిం గూర్చి ధనుర్గుణంబువడి నాకర్ణాంతమున్‌లాగి దు
ర్దాంతుండౌ అతికాయునేయ అతడున్ తచ్ఛక్తిఁగూలెన్‌ధరన్.

అతికాయాదులు— కూలిన వార్తవిని రావణుఁడు
మిఁగులదుఃఖించి కుంభనికుంభాదుల బంపుట

క. అతికాయాదులుగూలుట
కతిగా దుఃఖించి రాక్షసాధిపుడంతన్
మతిచలియింపఁగ మూర్ఛా
గతుఁడై తెలివొంది కోపకలితుండగుచున్. 360

ఆ. కుంభకర్ణసుతుల కుంభనికుంభుల
శోణితాక్షుఁడైన శోణితాక్షు
ఉగ్రమూర్తి శూరు యూపాక్షు- కంపను
సమరధీరు-ఆప్రజంఘు ననిచె. 361

చ. ఘనకవచాదులందొడిగి కార్ముకఖడ్గగదాదిధారులై
రణభువి కుగ్రమూర్తి చతురంగబలంబులతోడవచ్చి, భో
రున బహుశస్త్రముల్ గురిసి రోదసి భూమియునిండగప్పి, ఆ
వనచరకోటిగూల్చివెస వారు మహోద్ధతి పేర్చియార్చినన్. 362

క. కుంభనికుంభులు బలసం
రంభము చూపించియార్వ రణభువిగడతో
కుంభుని రవిజుఁడు గూల్చె, ని
కుంభుని పరిమార్చె హనుమ కోపోద్ధతిమై. 363

## అంగదుఁడు కంపన ప్రజంఘులను వధించుట

క. కంపను ఘనభుజు త్రిజగత్
కంపను దుర్దాంతుగాంచి ఘనపరిఘమునన్
జంపి ప్రజంఘుని దాసన
అంపెన్ యమసదనమునకు అంగదుఁడలుకన్. 364

## శోణితాక్ష-యూపాక్షులను ద్వివిదమైందులు వధించుట

ఆ. శోణితాక్షుఁడైన శోణితాక్షుండును
ద్వివిదుమీదికురుక ద్వివిదుఁడలుక
గదనుదాల్చి అతని గదిసి తచ్చిరమును
గదనుమోది గూల్చె గదనభూమి. 365

క. యూపాక్షుండది గన్గొని
కోపము దీపింప తానకుంఠితశక్తిన్
చాపము దాల్చి శరంబుల
ఏపునఁగురిపింప మైందుఁడేచినకినుకన్. 366

చ. పరిఘముపూని వానిరథవాహములన్ బరిమార్చి ఆర్చి, ఆ
అరదముగూల్చినేలకు మహాభుజశక్తినిజూవి త్రిప్పి ఆ
పరిఘముతోడ వానితల వ్రయ్యలుసేసి మహాజవంబునన్
కరిరథవాజిసద్భటుల- కాలునిపోలిక గూల్చెనుగ్రుఁడై. 367

## రావణుఁడు ఖరపుత్రుని మకరాక్షుని యుద్ధమునకు బంపుట

ఆ. కుంభకర్ణసుతులు కుంభనికుంభులు
కంపనాదులెల్ల - కదనభూమి
పడినవార్త చెవిని పడినంత దశకంఠుఁ
డదరిపడుచు - కోపమతిశయింప. 368

క. ఖరపుత్రుని మకరాక్షుని
వరగర్వితు గాంచి పంక్తివదనుఁడు కినుకన్
ఖరశత్రుని రాముని భీ
కరశత్రుని గూల్చిరమ్మ ! గర్వమెలర్పన్. 369

గీ. అనుచుఁబనిచిన అతండు వినతి చేసి
జనకు శత్రుని గూల్చినే జనకు ఋణము
తీర్చుకొందును ననుచు మదిన్ దలంచి
బయలువెడలెను చతురంగబలముతోడ. 370

ఉ. రాక్షసరాజునాజ్ఞ మకరాక్షుఁడు దివ్యరథాధిరూఢుఁడై
రాక్షసవీరకోటి చతురంగబలంబులతోడవచ్చి, రూ
క్షాక్షుఁడు శత్రుభీకరశరాసనముంగొని కాండవృష్టి ఆ
ఋక్షబలంబుగూలిచి అరిందముఁడై కడు పేర్చియార్చినన్. 371

ఉ. వానరయూథనాథు లనివార్యపరాక్రమదేఖవచ్చి, ఆ
దానవనాథుసైన్యము గదాపరిఘాదుల మోది గూల్చి, అ
వ్వాని మదమ్మడంపగ జవమ్మున నాతఁడు క్రూరభల్లముల్
బాణములన్ వెసన్ బరపి వారల నేలకువ్రాల్చి అయ్యెదన్. 372

## శ్రీరాముఁడు మకరాక్షుని గూల్చుట

గీ. నిన్ను గన్గొని కోపమ్ము మిన్నుముట్ట
రథమునడిపించి యుద్ధసంరంభమెసఁగ
పరుషముగ నిన్ను దూరుచు ఖరసుతుండు
అగ్నిపైదూకు శలభంబుసట్లుదూకె. 373

క. ఖరపుత్రుఁడ మకరాక్షుఁడ
ఖరశత్రుఁడవైననిన్ను కదనమునందున్
శరముల గూల్చెద ననుచున్
పరుషోక్తులతోడ బాణవర్షము కురియన్. 374

మ. దరహాసాంచితమైన మోమువయి క్రోధంబింత గాన్పింప భీ
కరచాపంబును దాల్చి వాని శరముల్ ఖండించి మార్గమ్మునన్
పరుషోక్తుల్ పచరించు నాతనిధనుర్భంగమ్ము గావించి ఆ
అరదంబున్ వడిగూల్చి శత్రుభయదంబౌ పావకాస్త్రంబునన్
ఖరపుత్రున్ ధరగూల్చినావుగదె! ఉగ్రంబైనరూపమ్మునన్.

క. మొరసెన్ దివి దుందుభులున్
కురిసెన్ నీపైని కల్పకుజముల్ సుమముల్
విరిసెన్ దివిజుల మోములు
హరిసైన్యము హర్షమెసఁగ ఆర్చెన్ బెలుచన్. 376

## రావణుఁడు చింతాక్రాంతుఁడగుట

క. ఖరపుత్రుఁడు మకరాక్షుఁడు
దురమున నీచేతఁగూల దొలఁగెన్ బలముల్
అరుదెందుచు దశకంఠుఁడు
కరమున్ మది దుఃఖభారకలితుండగుచున్. 377

ఉ. ఆయతపీనవక్షులు మహాభుజవిక్రమశాలులౌ మహా
కాయుఁడు పుత్రరత్నమతికాయుఁడు కుంభ-నికుంభసోదరుల్
ఆయసమానశూరులు ప్రహస్తమహోదరకంపనాదులున్
పోయి, రణమ్ము సేయ రణభూమిని గూలిరి యెల్లవీరులున్. 378

## ఇంద్రజిత్తు-తండ్రి దుఃఖమును వారించుట

క. అని బహువిధముల కుందెడు
జనకున్ గని ఇంద్రజిత్తు చాపధరుండై
జనకా! ఏమండగ నిటు
జనునే దుఃఖింప అభిచారికవిధిమై. 379

ఉ. హోమముచేసి నేనిదె మహోగ్రశరాస్త్రరథాదులంది, ఆ
రాముని లక్ష్మణున్ ప్లవగరాజును నంగదు యూథనాథులన్
భీమపరాక్రమోద్ధతిని బింకమడంచి వధించి వత్తు సం
గ్రామమునందునన్ జయము గాంచెద దీవెనలిచ్చి పంపుమా! 380

## ఇంద్రజిత్తు అభిచారిక హోమంబుగావింప బూనుట

క. అని తనమందిరమునకును
జని హోమంబునకువలయు సంభారమ్ముల్
గొనిచని నికుంభిలాస్థల
మున హోమార్థంబుకుండమును నిర్మించెన్. 381

గీ. రక్తమాలాంబరాదులు రక్తగంధ
మును ధరించియు మౌనంబు పూని యందు
హోమకార్యంబు సలుప నుద్యుక్తుఁడౌట
చారముఖమున ఆ విభీషణుఁడెఱింగి. 382

## ఇంద్రజిత్తు అభిచారిక హోమమును జేయబూనుట విభీషణుఁడు రామునకు దెల్పి లక్ష్మణుని యుద్ధమునకు బంపుమనుట

గీ. రామ ! అదె అభిచారిక హోమమొండు
మేఘనాథుఁడు చేసి యమేయశక్తి
అస్త్రశస్త్రాదిదివ్యరథాదులంది
సమరభూమికివచ్చు నజయ్యుఁడగుచు. 383

ఉ. కావున పంపు లక్ష్మణు నఖండపరాక్రమశాలి వానితో
పావని నేను ఋక్షపతి వానరరాజును బోయి మేము మా
చేవదలిర్పగా దనుజసేనను నాశముచేయువార మా
రావణి గూల్చు లక్ష్మణుఁడు రాఘవ ! నేడు పరాక్రమమ్మునన్.

గీ. అనవిభీషణ ! నేన ఆతనిని గూల్తు
లక్ష్మణుండేల ? అనిన ఓ రాఘవేంద్ర !
"ఎవ్వఁడాహార నిద్రాదు లవియు లేక
ద్వాదశాబ్దంబులుండు నాతండు వాని
సంహరించును లక్ష్మణస్వామి తాను
ద్వాదశాబ్దంబులట్లు త్వత్పాదసేవ
నుండె గావున వానినాతండె గూల్చు
పంపుమాతని శీఘ్రంబు పరమపురుష !
ఎఱుగనట్టులె యుందు వీవెఱుగవొక్కొ !
రాఘవా ! నీవ ఆదినారాయణుఁడవు
లక్ష్మణుండాదిశేషుం డిలాతలాన
అవతరించిరి భూభారమడపఁగాదె !"

అనిన మతినెంచి తమ్ము లక్ష్మణుని గాంచి
ఇంద్రజిత్తును నేడు జయించిరమ్ము
అనుచు దీవించిపంపుటే నరసినాను
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 385

## ఇంద్రజిత్తుతో యుద్ధము సేయ లక్ష్మణుఁడు బయలుదేఱుట

గీ. భక్తిసౌమిత్రి త్వత్పాదపద్మములకు
శీర్షమునమ్రొక్కి తావకాశీస్సులంది
రత్నభాసురదివ్యశరాసనమ్ము
దాల్చి యిటువల్కె విక్రమౌద్ధత్యమెసఁగ. 386

గీ. తావకాశీర్బలమ్మున ధర్మమూర్తి !
దివ్యతేజోవిశేషనందీప్తినంది
మచ్ఛరాననముక్తోగ్రమార్గణముల
మేఘనాదుని గూల్తు నమోఘశక్తి. 387

చ. అని వచియించి భీషణమహాశుగపూర్ణనిషంగధారియై
ఘనకవచాదులందొడిగి కార్ముకమున్ ధరియించి ధీరుఁడై
అనిలజఋక్షరాజ ప్లవగాధిపవాలిజయూథనాథులున్
ఘనభుజుఁడావిభీషణుఁడు గాదిలిమిత్రుఁడు వెంటనంటిరాన్. 388

## ఆభిచారిక హోమస్థలమును విభీషణుఁడు చూపించుట

క. చని ఎదుటను ప్రాకారం
బును బోలెడు సాంద్రసైన్యమును గని ఇదియే
మనఁగ విభీషణుఁడాల
క్ష్మణుతో నిట్లనియె మేఘ గంభీరరుతిన్. 389

మ. అదిగో — చూడు నికుంభిలాస్థలమదే ఆ రాక్షసవ్యూహమ
ల్లదె — న్యగ్రోధమహాకుజంబు నదిగో ఆ హోమధూమమ్మదే
అదిగో — అచ్చటె మేఘనాథుఁడును దా నాయాభిచారక్రియా
విదుఁడై తత్సవమాచరించెడిని నిర్విఘ్నమ్ముగా నియ్యెడన్. 390

## యజ్ఞవిఘ్నంబు గావింపుమని — విభీషణుఁడు లక్ష్మణుఁని హెచ్చరించుట

గీ. యజ్ఞవిఘ్నంబు ముందు చేయంగవలయు
యజ్ఞమయ్యది సంపూర్తి అయ్యెనేని
అతని గెల్వంగ మనకు శక్యంబుగాదు
అసహాశరవృష్టి దనుజసైన్యమ్మునెల్ల
అడఁచుమాతండె హోమమ్ము విడిచివచ్చు. 391

మ. అనినన్ లక్ష్మణుఁడాహవోత్సుకుఁడునై జ్యానాదమున్ జేయుచున్
ఘనకోదండవినిస్రుతోద్ధురమహాకాండాగ్నికీలావళిన్
దనుజవ్యూహము గాల్చ దారుణగతిన్ తద్వానరానీకమున్
ఘనవృక్షౌఘగదాప్రహారముల రక్షస్సంఘమున్ గూల్చగన్.

ఉ. దానవవీరులొక్కమొగి దారుణఖడ్గగదాదిధారులై
వానరసేన మీఁదకనివార్య పరాక్రమమొప్ప వచ్చినన్
వానరయూథనాథులును వాలిసుతుండును ఋక్షరాజు దా
వానల మట్టుపెట్టుచు మహాబలసంపద గూల్చినన్ వడిన్ 393

చ. రథగజవాజిఘట్టన ధరాస్థలిక్రుంగ మహోద్ధతిన్ మహా
రథులగు యూథనాథులు శరాసనశూలగదాసిధారులై
ప్రధనవిహారమున్ సలిపి వానరయోధులగూల్చి యార్చినన్
ప్రథితపరాక్రమోజ్జ్వలులు వాయుజవాలితనూజులుద్ధతిన్. 394

చ. గదగొని అంగదుండు పరిఘమ్మునుదాల్చి మరుత్సుతుండునున్
మదగజవాజిరాజి మదమత్తమహాసురవీరకోటి, ఉ
న్మదమునఁగూల్చివాల్చి అలమందరమబ్ధిగలఁచునట్లుగా
కదనవిహారమున్ సలిపి గర్జనచేసిరి భీకరమ్ముగా. 395

క. అది విని మేఘనినాదుఁడు
మదిలో నివ్వెఱగుసెంది మామకబలముల్
కదనస్థలిపడె నరిగణ
మదమడఁచెద ననుచు మదిని మత్సరమెసఁగన్. 396

## ఇంద్రజిత్తు హోమకార్యము విడిచివచ్చుట

ఉ. హోమము విఘ్నమౌటకు మహోగ్రరుషాపరితప్తచిత్తుఁడై
హోమమువీడి లేచి వడి ఉగ్రశరాసనధారియై మహో
ద్దామమృగేంద్రవాహితరథంబున వచ్చి శరాగ్నికీలలన్
హోమముచేసె వానరమహోగ్రతనూరుధిరాజ్యధారలన్. 397

ఉ. అంతట లంకనుండియు మహారథులెందఱొ దైత్యయోధుల
త్యంతపరాక్రమమ్మెసఁగ దారుణశూలగదాసిదారులై
దంతితురంగసద్భటకదంబరథంబుల తోడవచ్చి, వి
క్రాంతిని జూపి ఆ ప్లవగరాజు బలంబులఁగూల్చియార్చినన్. 398

ఉ. వానరయూథనాథు లనివార్యబలంబున వృక్షముల్ గిరుల్
దానవకోటిపైఁబరపి దంతి తురంగరథాదులవెసన్
క్షోణినిగూల్పగా మిగుల క్షోభము చెంది సురేంద్రజిత్తు అ
క్షీణపరాక్రమోద్ధతిని కీశబలంబుల గూల్చియుద్ధతిన్. 399

## ఇంద్రజిత్ లక్ష్మణుల ద్వంద్వయుద్ధము

గీ. లక్ష్మణుని గాంచి క్రోధసంరంభ మెసఁగ
నేడు లక్ష్మణ ! నాముందు నిలచినీవు
ప్రాణములతోడ బ్రతికి పోవంగలేవు
కాచుకొమ్మని శతశాతకాండచయము. 400

గీ. ఏయ సౌమిత్రి అవ్వానినెల్ల దునిమి
మాటలేటికి చూడు నాయేటి శక్తి
అనుచు నిష్ఠురవజ్రసమాశుగముల
తనువుగాడంగనేయ ఆతండు మెచ్చి. 401

ఉ. మెచ్చితి నీ బలంబునకు మేటి మగండవు గాదు గాని ఈ
వచ్చిన మేఘనాథుని అమేయపరాక్రమశాలి గెల్వగా
వచ్చునె? పూర్వమింద్రుఁడ నివార్య పరాక్రమశాలి అప్పుడిన్
వచ్చి పరాజితుండగుగు పాటె ఎఱుంగవె ఇంద్రజిత్తు నన్.402

## లక్ష్మణుని చెంతనున్న విభీషణుని ఇంద్రజిత్తు నిందించుట

క. అని లక్ష్మణుచెంత పితృ
వ్యుని గని కోపంబుగదుర యుద్ధమునందున్
నను జంపింపఁగ వచ్చితె ?
గుణహీనా ! కులకలంక ! గూల్చెదనిన్నున్. 403

## విభీషణుఁడు మేఘనాథుని కిచ్చిన సమాధానము

గీ. అనిన కోపించి ఆ విభీషణుఁడు మిగుల
మూర్ఖుఁడవు నీవు నీకంటె మూర్ఖుఁడరయ
నీదు జనకుండు-వినరైరి నాదు మాట
సాధ్వి చెఱగొన్న వంశనాశమ్ము వచ్చు

ఆసుప నేనెంతచెప్పిన వినదుగాదె !
దాని ఫలితమ్మగాదె యుద్ధమ్ముపుత్ర !
చేటు కొనితెచ్చుకొంటిరీ మాటలుడుగు
భావి తప్పింప ఆ పద్మభవుని తరమె ? 404

గీ. అన — విభీషణు వినతండ్రి యనక మిగుల
నిష్ఠురోక్తుల నిందించి నిష్ఠురంపు
శక్తినేయంగ దాని లక్ష్మణుఁడు గూల్చి
ఇంద్రజిత్తును గాంచి తానిట్టులనియె. 405

ఉ. "చాలును మాటలింక గలశక్తి నిచూపుమ" టంచు ఉగ్రతన్
కాలునికాలదండ మనగాదగు తీవ్రమహాశుగమ్ములన్
గూలిచి సింహవాహముల గూలిచి సారథి స్యందనమ్మునున్
గూలిచి మేఘనాదు నని గొబ్బున మూర్ఛమునుంగ జేసినన్. 406

## మేఘనాద లక్ష్మణులు గావించిన ఘోరసంగ్రామము

క. సురసిద్ధసాధ్యకిన్నర
గరుడుల్ దివినుండి తాము గన్గొని మది న
చ్చెరువున్ గొని లక్ష్మణునిన్
కరమున్ నుతియించినారుగదె ! నీ తమ్మున్. 407

గీ. మేఘనాదుండు లేచి అమోఘశక్తి
దివ్య శస్త్రాస్త్రరాజి దేదీప్యమాన
సవ్యవాహాంచితంబైన దివ్యరథము
రోహణముసేసి ఆహవోత్సాహ మెసఁగ. 408

గీ. క్రోధసంరక్తనేత్రుఁడై క్రూరదృష్టి
లక్ష్మణునిగాంచి శౌర్యసంరంభమెసఁగ
భీమచాపమ్ముగొని శత్రుభీషణముగ,
పావకాస్త్రంబు దొడిగి చాపమ్మునందు. 409

శా. జ్వాలాభీలమహోగ్రపావకమహాస్త్రంబేయు సౌమిత్రి తత్
జ్వాలామాలలడంపదక్షమగు పర్జన్యాస్త్రమేయన్ వడిన్
కాలాభీలకరాళనాదములతో – కాలాబ్దముల్ లేచి ఆ
భీలస్ఫూర్తిని వర్షధారలను ఆర్పెన్ పావకజ్వాలలన్. 410

శా. అన్యోన్యమ్ము మహాస్త్రజాలముల తామారీతి సంగ్రామమున్
అన్యోన్యమ్ము జిగీషమించుచును వారన్యోన్య ధిక్కారముల్
అన్యోన్యాహవ పాండితీగరిమ తామన్యోన్యమున్ జూపుచున్
అన్యోన్యమ్ము మహామృగేంద్రములు నా అత్యుగ్రతన్ బోరుచున్

క. హరి – హరియుం బోరిన గతి
కరి – కరియుం గదిసినట్లుగా వారిరువుర్
స్థిరముగనిల్చి దినత్రయ
మరుదందగనెల్లవారలతిదర్పమునన్. 412

గీ. అస్త్రజాలమ్ములెల్ల ప్రత్యస్త్రములను
ఒకరియస్త్రమ్ములెల్ల ఇంకొకరు గూల్చి
అస్త్రవిద్యాప్రదర్శన మనఁగ నిలిచి
పోరుసల్పిరి వారొక్కతీరుగాగ. 413

శా. నానాదివ్యమహాస్త్రశస్త్రతతిసంధాన ప్రయోగమ్మునన్
మానాతీతధనుర్విముక్తశరసంపాతప్రవేగమ్మునన్
జ్యానాదమ్ము దిగంతరమ్మునఁ బరిభ్రాంతంబుగాసాగ — అ
న్యూనమ్మప్రతిమాన వీర్యమున దివ్యుల్ మెచ్చ సౌమిత్రియున్

మ. సమరక్రీడను సర్పియెల్లరును ఆశ్చర్యంబునన్ జూడ వి
క్రమవిస్ఫూర్తిని మేఘనాదుని తను త్రాణమ్ము ఛేదింప ఆ
అమరారాతి సురేంద్రజిత్తు కుపితుండై లక్ష్మణస్వామి వి
క్రమమున్ జూచి సహింపకాతని తనుత్రాణమ్ము ఖండించినన్

చ. ఇరువురు రోషమంది మది ఏచి సుదారుణ చాపముల్ వడిన్
కరములఁదాల్చి కాండచయమఖండగతిన్ గురిపించి ఇర్వురా
విరుదుమగల్ ప్రచండతరభీషణవిక్రమశౌర్యసంపదన్
కరమరుదంద దివ్యులును కార్ముకవిద్యను జూపిరుగ్రతన్. 416

క. కరలాఘవమునుంజూపుచు
శరముల్ గురిపించి కినుక సౌమిత్రి వడిన్
ఖరతరబాణాగ్రంబున
విఱిచెన్ సురరాడ్విజేత విల్లున్ కడకన్. 417

క. మఱియొక విల్లతఁడందిన
విఱిచియు నద్దాని తీక్ష్ణవిశిఖత్రయి — నా
అరదము రథ్యంబుల ని
ష్ఠురతరశరపాళిగూల్చి సూతున్ గడపెన్. 418

గీ. మేఘనాదుండు నంత నమేయవీర్యుఁ
డన్యరథమున వచ్చి అనన్యశక్తి
నిశితశరవృష్టి వానరానీకపతుల
అడచినేలకు క్రోధతామ్రాక్షుఁడగుచు. 419

గీ. రథము పఱపించి సింహగర్జనము చేసి
జ్యాతలంబుమ్రోగంగ లక్ష్మణునిడాసి
క్రూరనారాచమును వింట కూర్చి పేర్చి
గాడనేసిన సౌమిత్రికనులు తిరిగి
క్షణము మూర్ఛిల్లితేరి తక్షణమలేచి 420

## లక్ష్మణుఁడు ఇంద్రజిత్తును గూల్చుట

చ. మనమున నిన్ స్మరించి అనమాన బలంబును వీర్యమంది, రా
వణివెనుగుఁడె చొచ్చిచన వాడిశరంబున నేసి వాల్చి, ఆ
తని బహువాహినీపతుల దంతితురంగరథాదులన్ వడిన్
రణభువిగూల్చి లక్ష్మణుఁడు రాక్షసకోటికలంగిపాఱగన్. 421

గీ. రాముఁడాతండు నిరత ధర్మాత్ముఁడేని
సతతసజ్జన నుత సత్యసంధుఁడేని
ద్వంద్వరహితుండు అప్రతిద్వంద్వుఁడేని
ఇంద్రదైవతమై మించు ఈ శరమ్ము
మేఘనాధుని గూల్చు నమోఘశక్తి
అనుచు మనమున త్వన్మంత్రమును స్మరించి. 422

శ్లో. ధర్మాత్మా సత్యసంధశ్చ
రామో దాశరధిర్యది
పౌరుషేణా ప్రతిద్వంద్వ
స్తదైనం జహి రావణిమ్.

(శ్రీమద్రామాయణము)

శా. ఇంద్రుండిచ్చిన కార్ముకమ్ముగొని మాహేంద్రప్రభన్ మించి ని
స్తంద్రప్రక్రియ త్వత్పదాబ్జముల డెందంబందు భావించుచున్
సాంద్రప్రస్ఫుటబాహువీర్యమున తత్ జ్యావల్లి సంధించి మా
హేంద్రాస్త్రంబును మేఘనాదు సురమందేసెన్ సురల్ మెచ్చగా

ఆ. అంత ఘోరమైన అమ్మహేంద్రాస్త్రంబు
మేఘనాదు నురమమేయ శక్తి
చీల్చి చొచ్చి యతని కూల్చెను ధరపైని
హరులు సురలు మిగుల హర్షమంద. 424

ఆ. సురలు విరులవాన కురిసిరి దివినుండి
దేవదుందుభులును దివిని మ్రోగె
అమరవిభుఁడు మిగుల ఆనందమును జెందె
అప్సరసలు నాట్యమాడిరెలమి
దివిజగణముతోడ తిలకించితిని నేను
రమ్యసుగుణసాంద్ర! రామచంద్ర! 425

## శ్రీరాముడు లక్ష్మణుని అభినందించుట

ఉ. వానరరాజు వాయుజుఁడు వాలిసుతుఁడు విభీషణుఁడు, అ
వ్వానరయూథనాథు లనివార్యపరాక్రమశాలి లక్ష్మణున్
మానితశౌర్యధైర్యగుణమండితు స్కంధమునన్ ధరించి, జే
జేనినదాల రావణివిజేతను దెచ్చిరి బొబ్బరించుచున్. 426

గీ. విజయశంఖంబు పూరించి వీరమూర్తి
విజయలక్ష్మిని చేకొని వినయమెసఁగ
నీదుపాదాబ్జముల వ్రాలి "నీదు శక్తి
మేఘనాదుని శత్రు నమోఘవిద్య
ధరను గూల్చితి" నని భక్తి పలికినంత. 427

గీ. గాఢముగ తమ్ము లక్ష్మణుఁ గౌఁగలించి
మూర్ధమాఘ్రాణమునుజేసి మురియునిన్ను
కంటినానాఁడు సమ్మోదకలితదృష్టి
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 428

## శ్రీరాముఁడు లక్ష్మణాదులన్ గాంచి ఆడినమాటలు

గీ. ఇంద్రుగెల్చిన వీరు ఆ ఇంద్రజిత్తు
నీవు గూల్చుటచే నింక రావణుఁడు
పుత్రశోకాభిత ప్తుఁడై పొక్కి మిగుల
రాక్షసేంద్రుండు క్రోధసంరంభ మెసఁగ
తనకుఁగల సైన్యబలమెల్ల గొనుచువచ్చు. 429

గీ. "రామ – రావణ ఘోర సంగ్రామకేళి
ఇంక జరుగును లోకభయంకరముగ
అతని గూల్చెద రణభువి అశ్రమమున"
అనుచు నంటివి గాదె వీరత్వమ్మెసంగ
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 430

## ఇంద్రజిత్తు గూలినవార్తవిని రావణుడు పరితపించుట

గీ. మేఘనాదుండు పుత్రుఁడమేయబలుఁడు
జ్యేష్ఠపుత్రుండు ఇంద్రుఁజేతయట్లు
వీరమరణంబు గాంచెనన్ ఘోరవార్త
చెవిన పడినంత చిరము మూర్ఛిల్లిలేచి
రావణుండెంతో శోకవారాశిఁగ్రుంగి
బహువిధంబుల ప్రలపించి పరితపించె. 431

సీ. ఎవ్వాఁడు తానెన్నొయేండ్లు ఘోరమ్ముగా
తపియించి అస్త్రశస్త్రములువడసె
ఎవ్వాఁడు భుజశక్తి ఎల్లదిక్కులగెల్చి
బహురత్నరాజి సంపదలు దెచ్చె
ఎవ్వాఁడు రణభువి ఎల్లదిక్పాలుర
ఎనలేని బలిమి జయించి మించె
ఎవ్వాఁడు దివిజేశు ఇంద్రుని బంధించి
ఇంద్రజిద్విఖ్యాతి ఎలమిఁగాంచె

గీ. గరుడ గంధర్వయక్షకిన్నర గణమ్ము
భూరిబలమున పాతాళ భుజగకులము
మూఁడు లోకాలు గెలిచె నెవ్వాఁడతండు
నన్ను మించిన పుత్రరత్నమ్ము నేడు
కూలె రణభువి అనుచును సోలివాలి
పరమ దుఃఖాభితప్తుఁడై పరితపించి. 432

## రావణుఁడు కోపమున సీతను జంపఁబోవుట

గీ. పట్టుతప్పిన కోపమ్ము పట్టలేక
ఇంత కష్టమ్ము తెచ్చిన దీమె యనుచు
సాధ్వి సీతను చంపగా సాహసించి
ఖడ్గమును దాల్చి కరము భీకరముగాగ
వచ్చు క్రూరాత్మ ఘోరరావణునిగాంచి
గాలివానకు నూగెడు కదళివోలె
పట్టుపీడిన కోమలవల్లి వోలె
తల్లిసీతమ్మ కరము భీతిల్లెవాలె. 433

## సీతను జంపఁబోవు రావణుని సుపార్శ్వుఁడను మంత్రి వారించుట

గీ. అంత మంత్రి సుపార్శ్వుండు అతని నాపి
వేదవేదాంగశాస్త్రప్రవీణుఁడవును
పద్మభవునకు సాక్షాత్ప్రపౌత్రుఁడవును
పరమమాహేశపూజాతపస్వివైన
ఓయి! రాజేంద్ర! స్త్రీవధ చేయఁదగునె
వీరరావణ! మముగూడి వీర్యమెసఁగ
రాము రణమందు గూల్చి ఈ రామఁగొనుము
అనుచు మరలించి కోపమ్మునవసయించె
కాంచి తదియెల్ల నే దివ్యకాంతనగుచు
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 434

## రావణుఁడు అంతఃపురకాంతల నోదార్చి యుద్ధమునకు వెడలుట

గీ. మరలి దశకంఠుఁడటు నిజమందిరమునకు
కరముఁ దుఃఖించుచును నంతిపురికినేగి
పుత్రశోకాభిత పుత్రై భూరి దుఃఖ
భారమున వొక్కునతుల కన్నీరుతుడిచి. 435

గీ. వారి నోదార్చి క్రోధ సంభరితుఁ డగుచు
రాఘవుల నేడు సంగ్రామరంగమందు
కూల్చి వచ్చెద నని పల్కి కోపమెసఁగ
రక్తనేత్రమ్ములగ్ని వర్షమ్ము గురియ. 436

గీ. మంత్రులన్ గూడి నిజసభామండపమున
మంత్రణము చేసి సంగ్రామ తంత్రమరసి
రథము నాయత్తపరుప సారథికి దెల్పి
ప్రథన విఖ్యాతులౌ మహారథుల నెల్ల
సమర భూమికిఁ జనగ నాజ్ఞల నొసంగె. 437

ఉ. వారలు రావణాజ్ఞ మదవారణవాజిరథాధిరూఢులై
దారుణచాపతోమరగదాపరిఘాదిక శస్త్రధారులై
ధారుణి దద్దిరన్ దిరుగ దైత్యమహారథు లుగ్రమూర్తులై
ఘోరున నెల్లవారు రణభూమికి వెల్వడి రొక్కపెట్టునన్. 438

క. హరిచయపదఖురఘట్టన
కరిఘటగురుభారమునను ఘనరథచక్ర
స్ఫురణమ్మున భటకోటి
భరణమ్మున ఉరగరాజు పడగ లడంగన్. 439

క. కరిఘటఘీంకృతి నాదము
హరిగణహేషారవంబు అరదంబుల ఘు
ర్ఘురఘోషలు భేరీ భీ
కరభాంకృతి దెసలనిండ కదలెన్ బలముల్. 440

ఆ. భూతగణములెల్ల భీతిల్లిపోవంగ
దివిజ గణము మదిని దిగులునొంద
కనులనుండి అగ్నికణములు రాలంగ
ఘన బలుండు పంక్తికంఠుఁ డలుక. 441

ఉ. సారశరాపచాదిబహుసామరికాస్త్రసమంచితమ్మునన్
క్రూరమృగేంద్రవాహితమకుంఠజవమ్ము మహారథమ్ము నా
సారథి తెచ్చి నిల్పగ విశాలభుజుండు దశాననుండు తా
వీరరసాతిరేకమున వెక్కెడె దివ్యరథాధిరూఢుఁడై. 442

ఉ. రాక్షసవీరు లట్లు రణరంగము సొచ్చి పరాక్రమించి, క్రూ
రాక్షుల నిప్పులొల్కఁగ శితాశుగశూలగదాదులన్ వడిన్
రూక్షతరప్రహారముల నొవ్వగఁ జేసిన నొచ్చివానరుల్
ఋక్షవిభుండు వాయుజుఁడు హెచ్చిన కోపముతోడ నార్చుచున్.

చ. హరులను నేలగూల్చి మదహస్తులు వాల్చి వధించి దైత్యులన్
అరదము లన్నియును విఱిచి ఆరజనీచరరాజు సైన్యమున్
తరువుల మోది వాల్చియు, గదాపరిఘాదుల మొత్తి గూల్చియున్
క్షరమరుదైన విక్రమము గన్పడ జేసిన దైత్యనాథుడున్. 444

ఉ. ఘోర శరాసనమ్ముగొని క్రూరదశాననుఁ డుగ్రమూర్తి అ
వ్వారిగ – సారశాత శరవర్షమునన్ హరిసేనముంచి, దు
ర్వారమహాస్త్రజాలముల వానరయోధుల నంగదాదులన్
ధారుణి గూల్చి అర్కజుని దర్పమునన్ బడగొట్టి అర్చినన్. 445

ఉ. వాయుసుతుండు మింటిదెస వాయుజవంబున వచ్చి ఉగ్రుఁడై
ఆయత బాహుముష్టిని దశానను వక్షము నేయ అతఁడున్
హాయని సోలి లేచి మది నాతని మెచ్చియు క్రోధమూర్తియై
వాయుజుపీన వక్షమును బాహుబలమ్మున నేసె సోలగన్. 446

ఉ. వాయుసుతుఁడు లేచి వచ్చునా అనుభీతి
రావణుండు వేగ రథముఁ బఱపి
రామ ! నిన్ను తమ్ములక్ష్మణు నటగాంచి
కాలుచిచ్చువోలె కదలివచ్చి. 447

చ. కణకణ మండు నిప్పుకలు కన్నుల రాలగ వేడి చూపులన్
కనుగొని నిన్ను లక్ష్మణుని కాలుని పోలిక ఘోరమూర్తియై
ఘనతర కార్ముకమ్ముగొని కాలభుజంగము వోలు కాఁడముల్
మునుకొని మీపయిన్ బఱుప ముట్టెను కాండచయమ్ము మిమ్ములన్

## రామ - రావణ సంగ్రామము

ఉ. వానిని మార్గమధ్యమున వాడి శరంబుల వాల్చికూల్చియున్
భానుసహస్రమూర్తివయి భాసుర దివ్యశరంబులన్ వడిన్
వానిరథంబు రథ్యములు వాని సిడంబును గూల్చి వ్రేల్మిడిన్
వాని యురంబు సొచ్చి చన దాడి శరంబున నేసినవడిన్. 459

ఆ. రావణుండు సోలి రథమునఁ బడిలేచి
అన్యరథము నెక్కి ఆగ్రహమున
కాల త్రొక్కువడిన కాలసర్పము వోలె
కస్సుబుస్సురనుచు కరము కనలి. 450

ఉ. భీషణసాయకమ్ముల విభీషణు లక్ష్మణు నిన్ను నేసి, తా
రోషముమించ భానుజుని తొమ్మను వ్రీలగజేసి కూల్చి ని
ష్పేషణచేసి ఆ ప్లవగ వీరులనెల్లను రౌద్రమూర్తియై
రోషముగొన్న కాలుఁడన రూక్షశరావళిగప్పి యార్చినన్. 451

ఆ. అక్కజమ్ము గొల్పు అతని విక్రమం
బరసి హరిగణమ్ము పఱచె దిశల
అసురగణము మోదమందుచు అర్చిన
దివిజగణము చూచి దిగులుచెందె. 452

ఉ. అంతట నుగ్రరూపమున ఇంద్రశరాసన మందినీవు దు
ర్దాంతమహోరగమ్ములను దైత్యబలమ్ములనెల్లగూల్చి, వి
క్రాంతిని జూపి ఉగ్రవిశిఖమ్ముల అతని విల్లుద్రుంచి క
ర్ణాంతము చాపమున్ తివిచి రావణువక్షము వ్రీలనేసినన్. 453

ఆ. మూర్ఛమునిగి లేచి ముక్కంటియున్ బోలి
నిడుదవిల్లు దాల్చి నిలిచియున్న
నిన్ను గాంచినొచ్చి నిర్వీర్యుడై లజ్జ
సమరభూమి విడిచి చనియె పురికి. 454

## రాముని జయింప శక్యము గాదని భావించి రావణుఁడు శుక్రాచార్యులవారిని జూడబోవుట

గీ. అట్లు చనుదెంచి క్రోధరక్తాక్షుఁడగుచు
చింతలోమున్గి మిగుల లజ్జితుఁడు నగుచు
రాము గెల్వంగనింక మార్గంబదేది
అనుచు చింతించి మదిని శుక్రుని దలంచి. 455

ఉ. రాముని గెల్వనేరికి తరంబుసుగాదు జగద్విజేత నే
రాముని గెల్వలేకిటు పరాభవమందితి యుద్ధభూమిలో
ఆ మహితాత్ము భార్గవు సహాయమునన్ నిజమందిరమ్మునన్
హోమము చేసి నిష్ఠమెయి యుద్ధమునన్ బరిమార్తురాఘవున్.

క. అని రాక్షస గురువర్యుని
మునిముఖ్యుండయిన శుక్ర మునిగనఁజని ఆ
మునికిన్ గడచిన సర్వ
మ్మును దా వినిపించి శోకమున నిట్లనియెన్. 457

ఉ. రామునితోడి యుద్ధమున రాక్షసవీరులు గూలిరెందఱో
భీమబలుండు ఆ సమర భీముఁడు తమ్ముఁడు కుంభకర్ణుడున్
భీమపరాక్రమోజ్వలుఁడు వీరుఁడు పుత్రుఁడు ఇంద్రజిత్తు సం
గ్రామమునందు గూలిరిఁక రాముని కోడితి నేను భార్గవా! 458

క. రాముని గెల్చు నుపాయం
బోముని! కలదేని దెల్పు హోమవిధానన్
కామిత మీడేరినచో
హోమవిధానంబు దెల్పు మో మునిరాజా ! 459

క. అన విని శుక్రమహాముని
మనమున చింతించి రాము మాధవు గెలువన్
తనకున్ శక్యమె! ఐనన్
ఘనమంత్రమ్ము లిత్తు రాజుఁగావగవలెగా. 460

ఉ. రాముఁడు మానవుండనుచు రావణ! ఎంచకు మాదివిష్ణువే
రాముడుగా జనించె రణరంగమునందు జయింపనెంతు వేన్
హోమము చేయు ముజ్వల మహోగ్ర శరాస్త్రము లుద్భవించు ఆ
హోమము విఘ్నమైచన అహో ! మరణంబును దప్పదెంచుమా

గీ. అనుచు వచియించి భార్గవమునివరుండు
మహిత మహిమాన్వితమ్ములౌ మంత్రములను
ఇచ్చి హోమవిధానమ్ము నెల్లఁ దెలిపి
వంప రావణుఁ డానందభరితుఁ డగుచు. 462

### రావణుఁడు పాతాళ హోమము గావించుట

గీ. అవసథమ్మున కేతెంచి అతఁడు నంత
ఆభిచారికహోమకార్యమ్ము సేయ
వలయు సమిధాదికములైన వస్తుచయము
గూర్చి పాతాళగుహకు నిగూఢవృత్తి. 463

క. చని పాతాళగుహాంతర
మున హోమము చేయ కుండమును గొల్పవెసన్
ఘన నిష్ఠన్ గొని పీఠా
సనమున హోమమ్ము సేయ సంకల్పించెన్. 463

క. తోచెను నుత్పాతమ్ములు
వీచెన్ బెనుగాలులున్ విభీషణుఁ డంతన్
ఏచిన భీతిని నిగ్గని
లేచిన ధూమమ్ము చూపి లీలాపురుషా ! 465

### హోమక్రియకు విఘ్నము గావింపవలెనని విభీషణుఁడు దెల్పుట

ఉ. రామ ! దశాననుండు సమరంబున నిన్ను జయింపనెంచి, తా
హోమము చేయబూనెను మహోగ్రతరంబుగ శుక్రునానతిన్
హోమము పూర్తియౌనెడ మహోజ్జ్వలదివ్యరథాస్త్రశస్త్రముల్
హోమమహాగ్నికుండమున నుద్భవమైన నజయ్యుఁ డయ్యెడిన్.

క. కావున హోమము విఘ్నము
గావింపఁగవలెను అట్లుగాదేని ప్రభూ!
రావణుఁ డజేయుఁడై యు
ద్ధావనికిన్ వచ్చునేని తరమె జయింపన్. 467

గీ. అను విభీషణు పల్కుల నాలకించి
రామ! సుగ్రీవు గననీవు రవిసుతుండు
అంగదుని నాయకుని జేసి హనుమదాది
కపులఁ బంపెను హోమవిఘ్నంబు సేయ. 468

అంగదాదులు పోయి హోమవిఘ్నంబు గావించుట

ఉ. అంగదు డాదిగాఁగల మహామహులైన కపిప్రకాండులు
పొంగుచు మింటి మార్గమున పోయి జవంబున లంకజొచ్చి ఉ
త్తుంగవిశాల సాలమును తూర్ణము దాటి తురంగమత్తమా
తంగరథాధిరూఢులగు దైత్యులనెల్లను గూల్చి వ్రేల్మిడిన్. 469

గీ. దుర్గమును జొచ్చి సైనికవర్గములను
బాహుబలమునగూల్చి నిబ్బరముగాగ
సవనభూమిని ఆ విభీషణుని తరుణి
సరమచే సంజ్ఞ చూప నా సరణినేగి. 470

గీ. ధూమరేఖల ఆ హోమభూమిచేరి
గూఢముగ నున్న పాతాళగుహను జొచ్చి
ద్వారదేశస్థ గురుశిలాఫలకమరసి
అంగదుఁడు పాదహతిజేసి భంగపరచి. 471

గీ. లోనఁజొచ్చిన వానితో వానరులును
హనుమదాదులు చని యట హవనభూమి
నిశ్చలమ్ముగ తద్ధోమనిష్ఠనున్న
రావణుని గాంచి భీమగర్జనముచేసి. 472

గీ. ఆజ్యపాత్రలు నట స్రుక్స్రువాదికములు
సమిధగవ్యాధి తద్వస్తు సంచయమ్ము
అందు పరజిమ్మి చిందరవందరులుగ
హోమవేదిక గూల్చి రుద్దామబలులు. 473

ఉ. అందఱు నావిధమ్ముగను ఆనవనార్థపదార్థ సంతతిన్
చిందరవందరల్ వడగ జేయుచు నార్చుచు నిర్భయమ్ముగా
క్రందుగ సందడుల్ సలుప రావణుఁడించుక యేన్జల్గింవకే
కొందలపాటు లేక మది కోపమునందక యుండె నిష్ఠమై. 474

ఉ. అంతట అంగదాదులును అంతిపురిన్ వడి జొచ్చియందుశు
ద్ధాంతజనంబులన్ గనుచు తత్సతులందఱ నీడ్చి తెచ్చి వి
భ్రాంతినిగొల్పి కొట్టినమ రావణుఁడట్టు సమాధిలోన ని
శ్చింతగనుండె నిష్ఠమెయి చేడ్పడకించుకయేని నెమ్మదిన్. 475

క. అదిగని అందఱు నెంతయు
మదిలో నచ్చెరువుచెంద మండోదరి నం
గదుఁడంతట ముందలగొని
మది సందియవడక తెచ్చెమగువన్ తెగువన్. 476

క. కటిసూత్రము తెగి వ్రాలఁగ
త్రుటితములై సరులమణులు త్రుళ్లుచు సటన్
పిటతాటములై పడగా
కటివస్త్రము జార మిగుల కలవరపడుచున్. 477

గీ. ఎట్టయెదుటను నీ సతి జుట్టుపట్టి
ఇట్టులీడ్వంగ చూడ విదేమినాథ!
మానమే పోవ ఆత్మాభిమానమేల!
సిగ్గు విడనాడి హోమమ్ము చేయనేల ? 478

గీ. మేఘనాథుండు పుత్రుఁడమేయబలుఁడు
పడుటచేగాదె నాకిట్టి పాటువచ్చె!
పుత్ర! నీవున్న నన్నొరుల్ ముట్టగలరె!
ఇంద్రజిత్తుని తల్లికా యిట్టిపాట్లు 479

గీ. అనుచు నాక్రందనముసేయు నామె గాంచి
హోమమును వీడి రావణుఁ డుగ్రమూర్తి
కంట మంటలురేగ అంగదుని గాంచి
సతిని విడుమంచు ఫెళ్లున చఱచినంత
పాఱివచ్చిరి హోమమ్ము భంగపఱచి
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 480

## మండోదరీ రావణ సంవాదము

గీ. రాణివాసమ్మునకుఁ బోయి రావణుండు
సతులనోదార్చి మిగుల విషణ్ణుఁడగుచు
రాణి మండోదరిన్ తేర్చి రమణి! జగతి
విధిని తప్పింప తరమె అవ్వేధకైన
రాఘవుల గూల్చివత్తు నే రణమునందు
అనుచు నోదార్ప మయపుత్రి అనియె నిట్లు. 481

గీ. రాముడాంతండు వినుమ! నారాయణుండు
అతని గెల్వంగ నీకు శక్యమ్ముగాదు
సాధ్వి సీతను దెచ్చి వంశమ్ము నెల్ల
నాశమును జేసితివిగాదె నాథ! కనుము. 482

గీ. శ్రీవిభుండైన రాము నర్చించి భక్తి
జానకిని నిచ్చి అతని శరణువేడి
అల విభీషణు పిలిచి రాజ్యమ్ము నిచ్చి
తపము కేగుట మనకు యుక్తమ్ముగాదె! 483

క. పోయిరి తమ్ములు పుత్రులు
పోయిరి బంధువులు నెల్ల పోయిరి మిత్రుల్
పోయిరి యోధులు అందఱు
పోయిన రాజ్యమ్ము దేల భోగము లేలా? 484

గీ. దేవి! రాముండు శ్రీవిష్ణుదేవుఁడేని
అతనిచేఁ బడి మోక్షమ్ము నందుకొందు
మానవుండైన ఆతని నేను గూల్చి
వత్తు నన్నింక వారింపవలదు రాజ్ఞి. 485

## రావణుఁడు కడసారి యుద్ధమునకు వెడలుట

మ. అని తా నంతిపురమ్ము వీడి వెనమై ఆ రావణుండుగ్రుఁడై
తన ఆ మూలబలమ్ము నెల్ల గొనుచున్ దర్పోద్ధతిన్ మత్తుఁడై
కనులన్ వహ్నిశిఖావళుల్ భయదమై క్రమ్మంగ రక్తద్యుతిన్
చనుదెంచెన్ బహుకోటి సైన్యములతో సంగ్రామసంరంభియై 486

సీ. మేడగిరిఁ బ్రోపమేయమ్ము ఘోరమ్ము
షోడశ దృఢచక్ర శోభితమ్ము
బహువిధశస్త్రాస్త్ర భవ్యశరాసన
బాణతూణాది సంభాసితమ్ము
మయశిల్పి శిల్పనిర్మాణాభిరామమ్ము
సంచలత్ మణికేతనాంచితమ్ము
త్రిభువన సంచార దివ్యప్రభావమ్ము
అక్షరదృఢకూబరాంచితమ్ము
ద్వాదశాత్యుగ్ర హరిగణ వాహితమ్ము
ఛత్రచామరరాజలాంఛనయుతమ్ము
రమ్యమణిగణఘృణిజాలరంజితమ్ము
స్వర్ణభాసురదృఢతరస్యందనమ్ము
ఎక్కి వెలువడె రావణుఁడుక్కుమిగుల. 487

సీ. పటహభేరీఘోరభాంకృతినాదమ్ము
దిగ్భిత్తులంటి ప్రతిధ్వనింప
రథనేమిచటులఘర్ఘరభీమరావమ్ము
జలదాళి భయదగర్జలను మించ
చతురంగ బలపాళి చరణఘట్టన ధూళి
గగనాంగణమున మేఘములఁ దెంప
భటపాళి కరధృత చటులాస్త్రతళతళత్
కాంతి విద్యుల్లతా కాంతినింప
సింహనాదాల గగనంబు సిల్లుపడగ
శంఖకాహళరవములు చదలనంట
కరుల బృంహిత ఘోషమ్ము హరులహేష
అలమ దిక్కుల ఆమూల బలము వెడలె. 488

## రాఘవుడు మూలబలమ్మును బరిమార్చుట

ఉ. మూలబలమ్ము లొక్కమొగి ముట్టి వనేచరరాజ సైన్యమున్
శూలగదా ప్రహారముల శూరతమీరగఁ గూల్చి వాల్చినన్
వేలను దాటిపొంగి పృథివీస్థలి ముంచు మహాబ్ధివీచికల్
పోజై రణాంగణమ్మువెస ముంచిరి ఘోరశరాస్త్రధారలన్. 489

క. అరదమ్ములఁ బరపించియు
తురగమ్ములతోడ నురికి తుములమ్ముగ నా
సురవీరులు ధీరత వా
నరవీరులఁ గూల్చి గర్జనమ్ములు సేయన్. 490

ఉ. వచ్చి తోడ రావణుఁ డపార్యపరాక్రమ శౌర్యధైర్యముల్
అచ్చపడంగ భీషణశరాసనముం ధరియించి వేనవేల్
చిచ్చర బాణముల్ గురిసి చిచ్చుమహాటవి గాల్చునట్లుగా
అచ్చెరువంద నందఱును ఆప్లవగాధిపుసేన గూల్చెనన్. 491

ఉ. మూలబలమ్ము లెల్లెడల ముట్టిన నీవును లక్ష్మణుండు ఉ
ద్వేలపరాక్రమం బెసఁగ భీషణ ఘోరశరానలోజ్జ్వలత్
జ్వాలలమాడ్చి వేల్చి రథజాలగజాశ్వపదాతివర్గమున్
నేలను గూల్చినారుగదె నిర్జరులున్ దివిమెచ్చి చూడగన్. 492

ఉ. నీలుఁడు విక్రమించి రజనీచరయోధుల నుక్కడంచి పెన్
వాలముతోడ కొందఱిని వాల్చి మహాపరిఘమ్మునన్ వడిన్
వాలిచి వాజులన్ కరుల వాలిచి దివ్యరథావళిన్ వడిన్
గూలిచెఁ బెక్కురాక్షసుల కోపమునన్ శివమెత్తినట్లుగన్. 493

చ. హనుమయు నంగదుండు ప్లవగాధిపుడున్ గడుక్రోధమూర్తులై
ఘనగదబిందివాల పరిఘమ్ములదాల్చి ప్రభంజనమ్ముచా
డ్పున రథపాళివాజుల చమూపతులన్ గజరాజి గూల్చి హె
చ్చిన భుజశక్తి ఆ దనుజసేనను వాల్చిరి కూల్చిరుగ్రతన్. 494

ఉ. రాక్షసరాజు మంత్రులు ధురంధరు లాహవధీరులా విరూ
పాక్షమహోదరుల్ చెలఁగి ఆ ప్లవగాధిపుఁ జుట్టుముట్ట రూ
క్షాక్షుఁడునై హరీంద్రుఁడు మహాభుజశక్తిని మోది ఆ విరూ
పాక్షు మహోదరున్ గెడపి ఆర్చెను రాక్షసకోటి భీతిలన్. 495

గీ. పార్శ్వమున నున్న ఆ మహాపార్శ్వుఁడంత
అమితకోపాన ఘూర్ణమాణాక్షుఁడగుచు
పరిఘమును దాల్చివచ్చి వానరులగూల్ప
గదనుగైకొని వాని నంగదుఁడు గెడపె. 496

గీ. ఖడ్గమును దాల్చి వచ్చు నా ఖడ్గరోము
నమరవీరాధివీరు నా నర్పరోము
రోషతామ్రాక్షు వృశ్చికరోము మువ్వుర
హనుమదాదులు గూల్చిరి పెనగిగ దల. 497

ఉ. రావణుఁడుగ్రుఁడై రథము రాఘవ! వే పరపించి నీ పయిన్
భూవలయంబు గ్రక్కదల భూతగణంబును భీతిచెంద భీ
తావహమూర్తి భీకరశరాసనమున్ ధరియించి శాతకాం
డావళి మిమ్ముగప్పుచు విహారము నల్పెరణాంగణమ్మునన్. 498

ఉ. ఆతని విక్రమంబుగని ఆయితభీమధనుర్ధరుండపై
శాతశరావళిన్ బరపి సత్వరమాతని బాణజాలమున్
భూతలిగూల్చి వాలిచి ప్రభూతనిశాత శరావళిన్ వడిన్
ఖ్యాతపరాక్రమమ్మెనఁగ ఆ దశకంఠుని గప్పె నుగ్రతన్. 499

క. ఝుణఝుణ జ్యానాదమ్మును
ధణధణ బాణాళిరవము దశమైచెలఁగన్
రణభువి నంతట రక్తపు
మణుగులు సృష్టించితీవు మార్గణవృష్టిన్. 500

క. కలభమ్ముల గతిరాక్షస
బలములు చెలరేగి నీదు బాణాగ్నివడిన్
బిలబిలఁబడి తెక్కలుసెడి
మలమలఁ మాడినవి నిమిషమాత్రములోనన్. 501

క. ఒక్కొక రాక్షస వీరున
కొక్కొక రూపంబుదాల్చి ఒక్కొకదనుజున్
ఒక్కొక క్షణకాలమునన్
జక్కడగించితివి దైత్యసైన్యములెల్లన్. 502

## రావణుఁడు మూర్ఛనందుట — సారథి రథమును గొనిపోవుట

గీ. విశ్వరూపంబు దాల్చిన విష్ణువితఁడు
ఇతని నెదిరింప శక్యమే ఏరికైన
అనుచు పాఱెను దనుజ సైన్యంబదెల్ల
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 503

క. వెక్కసమగు నీ విక్రమ
మక్కజముగఁ గాంచి రావణాసురుఁడెదలో
అక్కసువడి వెక్కసపడి
ఉక్కడచెద వీనినింక యుద్ధమునందున్. 504

క. అని కోపమ్మున తన రథ
మును నటుపరపించి బీరమున ఘనశూల
మ్మును నీ పై వెసనేసిన
ఘనకాండముతోడ దానిఁ ఖండించి వడిన్. 505

ఉ. ఓ రఘువీర! నీవును మహోగ్ర శరాసనమున్ ధరించి వి
స్తార శరప్రవర్షమున తద్రథమున్ వెనముంచి విస్ఫురత్
దారుణవజ్రతుల్య శరధారను మూర్ఛను ముంచరావణున్
సారథి దానిగాంచి రథసంబున తేఁమరల్చి కోటకున్. 506

గీ. రథము దూరమ్ముగానిపోయి రావణునకు
మూర్ఛతొలగంగ ఉపచారములను జేయ
రావణుఁడు తేరి ఎదుట సారథిని గాంచి
చోదకునిపైని కోపమ్ము చూపిలేచి. 507

గీ. వజ్రకవచంబు ధరియించి వజ్ర సార
శస్త్రశరజాల దృఢశరాసనములెల్ల
రథమునందున పదిలించి రగిలిమిగుల
రథము పరపింపుమనె రణరంగమునకు. 508

## అగస్త్యుఁడు రామునకు ఆదిత్యహృదయము ఉపదేశించుట

గీ. ఆచట నీవును విశ్రాంతి నందుచుండ
ఘనతపోధనుడైన అగస్త్యమౌని
దివ్యతేజో విశేషంబు దెసల వెలుగ
వచ్చి వినువీధి ఓ రఘువంశభూష!
దినకరాన్వయ మణిదీప! దివ్యరూప!
అవధరింపుము నానుడు లనఘచరిత! 509

గీ. ధర్మసత్య స్వరూపు వేదత్రయాత్మ
కర్మసాక్షియు త్వద్వంశకర్తయైన
భాస్కరుని గొల్చి తద్దివ్య భవ్యశక్తి
వడసి రాఘవ! నేడు రావణుని గూల్చు
సమయమిదె వచ్చె రావణు సంహరింప. 510

గీ. అనుచు వచియించి పూజ్యుఁడమ్ముని వరుండు
శత్రుసంహారకారియు జయకరమ్ము
దివ్యశక్త్యన్వితమ్ము ఆదిత్య హృదయ
మంత్రము పదేశమును జేసి మహితశక్తి
చనియె వినువీధి అకుంఠసంభవుండు. 511

గీ. అంత నీవును నియతిమై ఆచమించి
అమ్మహామంత్రరాజమేకాగ్రబుద్ధి
ప్రయతచిత్తుండ వౌచు జపమ్ముచేయ
దివ్యతేజోవిశేష దేదీప్యమాన
మూర్తి ప్రత్యక్షమై నిజమూర్తి రవియు

"రావణుఁడు నేడు పడు రణరంగమందు
రామ! విజయోస్తు! లోకకల్యాణమస్తు!
అనుచు దీవింప నీవు నత్యంతదీప్తి
నంది నతిచేసి కోదండ మందుకొంటి
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 512

ఉ. భోరున రావణుండు రణభూమికి వచ్చి మహోగ్రమూర్తియై
ఘోరతరాస్త్ర శస్త్రములు గుప్పుచు ఆ హరియూథనాథులన్
ధారుణి గూల్చుచున్ తన రథంబును వేఁ బరపించి నీపయిన్
దారుణ కాండముల్ పరపి దర్పముచూపి పరాక్రమించినన్ 513

ఉ. నీవు ప్రచండరూపమున నిష్ఠురశాతశరావళిన్ వడిన్
రావణుఁడేయు నా శరపరంపరలన్ వెనదూల్చి పేర్చి త
ద్రావణు సారధిన్ గెడపి రథ్యములన్ వెనగూల్చి చేవడిన్
క్రూరతరాశుగమ్మతని గుండెలు సొచ్చి చనంగ నేసినన్. 514

గీ. రావణుఁడు సొలిబ్రాలి యా రథముమీఁద
పడియు తేర్కొని ఒక కొంతవడికి లేచి
శ్రాంతుఁడగుటను కొంత విశ్రాంతినంది
అన్యరథమును గొనివచ్చు నంతలోన. 515

ఇంద్రుఁడు మాతలిసారథికమ్మగు తన రథమ్మును
బంపుట

గీ. రథము మీఁదను నిల్చి ఆ రావణుండు
ధరణి నిలుచుండి నీవు యుద్ధమ్ము సేయ
దివిజనాథుండు గాంచి చింతించి మదిని
దివ్యశస్త్రాస్త్రశోభి తద్దివ్యరథము
అంపె మాతలితో విజయప్రదమ్ము. 516

ఉ. మాతలి ఇంద్రునానతి సమస్తమహాస్త్రశరాంచితమ్ము, వి
ఖ్యాతము, ఘోరయుద్ధవిజయప్రదమున్ హరిదశ్వభాసిత
మ్మాతతవేగవంతము మహామహిమాన్వితమౌ రథమ్ము నీ
భూతలి నిల్పి నిన్గని ప్రభూ! దివిజేంద్రుఁడు పంపెడినినిన్. 517

చ. అని వినయమ్మునన్ బలుక ఆ యమరేంద్రు రథమ్ము గాంచి నీ
మనమున సంతసించి బహుమానపురస్కృతి నింద్రుడంపుటన్
విని వినుతించి యింద్రు మది వీరరసంబెసలారగాఁ బ్రద
క్షిణమును జేసి రోహణము చేసితివా దివిజేంద్రుకైవడిన్. 518

## రామ — రావణులకు జరిగిన ఘోరసంగ్రామము

ఉ. ఆ రథమందు నిన్నుగని ఆ దశకంఠుడు క్రోధమూర్తియై
సారథి మాతలిన్ మరియు స్యందనవాజుల నొవ్వనేయ వి
స్ఫారధనుర్విముక్తశితసాయకపంక్తిని నీవు నెవ్వడిన్
ఆ రథరథ్యసారథుల ఆ దశకంఠుని మ్రొగ్గనేసినన్. 519

ఉ. ఆ సురవైరి రేగి ఆసురాస్త్రము దాఁబరపింప నీ వయిన్
భాసురదైవతాస్త్రమున భంగము సేయగ నీవు దానినిన్
రోసము చెంది రావణుఁడు రూక్షతరంబగు రౌద్రమున్ వడిన్
ఏసిన వైష్ణవాస్త్రమును ఏసి అడంపవె దాని వ్రేల్మిడిన్. 520

గీ. ఆతడత్యంత ఘోరనాగాస్త్రమేయ
గారుడమ్మున దాని భగ్నమ్ముచేసి
పావకాస్త్రమ్ము నీవేయ రావణుఁడు
వారుణాస్త్రాన సద్దాని వమ్ముచేసె 521

క. దిక్కుల ధూమంబెగయగ
అక్కజముగ మంటలెగసి ఆకసమంటన్
దృక్కులు మిఱుమిట్లొందగ
వెక్కసముగసాగె ద్వంద్వ విగ్రహ మంతన్. 522

గీ. దారుణంబగు అస్త్రియుద్ధమ్మునిట్లు
చేసి యిద్దరు ఒండొరుల్ తీసిపోక
సారశస్త్రాస్త్ర విద్యాప్రశస్తినెల్ల
చూపినారలు భుజసారమేపు మీర. 523

క. ఇరుపక్షంబుల యోధులు
అరుదగు యుద్ధమ్ము చూచుచందఱు నిలువన్
సురసిద్ధ సాధ్యవరకి
న్నరులున్ దివినుండి చూచినారలు గాదే! 524

ఉ. రాతిరియో పవల్ దెలియరాని విధమ్మున వార్షుకాబ్దముల్
భూతలి రోదసిన్ గలిపి భోరున ధారలముంచినట్టు లా
రీతిని ఘోరకాండచయ వృష్టిని దిక్కులు ముంచి మించుచున్
భూత భయంకరమ్ముగ ప్రభూతరణోద్ధతి బోర ఇద్దఱున్. 525

ఉ. ధారుణి కంపమొందగ రథంబుల రొప్పుచు ముందుకున్ వడిన్
దారుణ బాణజాలమున తద్రథరథ్యములన్ మరల్చుచున్
సౌరశరాళి వజ్రక వచంబుల చూర్ణము చేయుచున్ వెసన్
పోరును సల్పినారుగదె భూతగణంబులు భీతినందగాన్. 526

ఉ. అంతట కోపమంది మది ఐంద్రశరాసన మందినీవు దు
ర్దాంతనిశాత దారుణశరంబును నారిని గూర్చివేర్చి క
ర్ణాంతములాగి రావణు శిరంబు ధరన్ బడఁజేసినంత అ
త్యంత విచిత్రభంగినది అయ్యెడ బుట్టును రాలియున్ వడిన్.

ఉ. ఘోరభుజా బలంబెసఁగ శాతశరావళి నేయుచున్ వడిన్
ఘోరశిరంబు లాగతిని గూల్చుచుఁ దాళఫలమ్ములట్లులన్
ఘోరశరాళినట్లు శతసంఖ్య శిరంబులు గూల్చుచున్ వెసన్
ధారుణి రాలజేసినను తక్షణమే అవి యుద్భవించగాన్. 528

క. ఖరమారీచ విరాధుల
శిరములఁ దెగటార్చునాడు శితశరపంక్తుల్
దురమున ఈ దశకంఠుని
శిరములఁ బడఁజేయ మరల చిగురించు నెటుల్. 529

క. అని చింతించుచు నుండగ
అనె నిట్లు విభీషణుండు ఆతని శిరముల్
ఘనభుజ జాలము గూల్చిన
వనజాసను వరమువలన వచ్చున్ మరలన్. 530

ఆ. అతని నాభిదేశమందున అమృతంబు
గలదు పావకాశుగమున దాని
శూరరామ! నీవు శుష్కింప జేసిన
మరల బుట్టబోవు మహిత చరిత! 531

చ. అన విని తద్రహస్యమును ఆతని నాభిగతామృతాంశమున్
సునిశిత పావకాస్త్రమున శోషిలఁ జేసిన రాక్షసేంద్రుఁ డ
య్యనుజు విభీషణున్ గనుచు అతనిపై ఘనఘోరశక్తి యే
సినగని శాతకాండమున భిన్నము చేసితి వీవు ద్రెళ్ళడిన్. 532

చ. ఝణఝణ నారి ఝుంకృతి అజాండమునిండి ప్రతిధ్వనింపగా
గణగణమంచు నింద్రురథ ఘంటల నాదము మింటినంటగా
ధణధణ వజ్రసారశితదారుణబాణచయంబు నేయుచున్
రణమున గూల్చినావుగదె రావణు ఘోరశిరోధిహస్తముల్. 533

గీ శిఖరముల్ గూలు ఆ మేరు శిఖరివోలె
కొమ్మలెల్లను దొరఁగు వృక్షమ్మువోలె
కరయుగమ్మున అముఖ్య శిరముతోడ
రక్తసిక్తాంగుడై నిల్చె రావణుండు. 534

ఉ. అతత కోపవేగమున ఆ దశకంఠుఁడు నుగ్రమూర్తియై
భూతలమూగ శేషతల భుగ్నముగా వరవించి స్యందనం
బాతత చాపమున్గొని సహస్ర శరంబుల నిస్సుఁగప్పి ఆ
మాతలి నొవ్వనేసి వడిమావుల మ్రొగ్గితిలంగఁ జేసినన్. 535

చ. కనుగవ జేవురింవగ మొగమ్ము రవిప్రభ ధిక్కరింవగా
ఘనతర కార్ముకమ్ముగొని గాఢ నిశాతశరాళిగుప్పి, రా
వణురథసారథిన్ గెడపి వారువముల్ ధరగూల్చి కేతనం
బును బడనేసి రావణుని మూర్ఛమునుంగగ జేసినన్ వడిన్.

ఆ. కొంతవడికి లేచి కోపమ్ము రెట్టింప
భ్రాంతచిత్తుఁడగుచు రావణుండు
దివ్యరథము వేగతెమ్మంచు పొమ్మంచు
ఆజ్ఞలిచ్చి పంపునంతలోన. 537

ఉ. ఘోరతరమ్ము ఉచ్చతర ఘోటకరాజ సువాహితమ్ము, అ
మ్మేరుగిరీంద్రతుల్యమగు మేటిరథమ్మును అస్త్రశస్త్ర సం
భారభరమ్ము వజ్రమయ భాసురవర్మ సమన్వితంబు ఆ
సారథితెచ్చి నిల్పరథనమ్మున రోహముచేసి యుగ్రతన్. 538

ఉ. సారతరాతి ఘోర భుజసారము చూపి శరాసనమ్మునన్
క్రూరతరాశుగమ్ములను గూరిచిపేరిచి ఝుంఝుఝుంఝుణ
త్కారముతోడ నేసి నినుగప్పిన నీవును ధంధధంధణ
త్కారముతోడ రావణుని కాండచయమ్ము సు దూల్చివ్రేసినన్.

క. ఇద్దరి యుద్ధం బీగతి
పర్వగ దిక్చయము చక్రవాళములదరెన్
ఉర్వి చలించెను మెండుగ
పర్వతజాలమ్ము నూగిపడియెన్ విరిగెన్. 540

ఉ. మాతలి నిన్నుగాంచి వినుమో ప్రభు! సర్వమెఱింగినట్టివి
జ్ఞాతవు నీవు రావణుని శస్త్రములన్ మడియింప నెంతువే!
ఆతత శక్తిమంతము మహోమహిమాన్వితమైన యట్టి ఆ
ధాతృమహాస్త్రశక్తి వడి ధారుణిగూల్చుము వీని రాఘవా! 541

క. అని మాతలి తెల్పిన విని
మనమున బ్రహ్మాస్త్రబీజ మంత్రాక్షరముల్
మననము చేయుచు నియతిన్
ఘనబ్రహ్మాస్త్రంబు దీసి గదలన్ జగముల్. 542

గీ. మేరుభూధర భార మమేయశక్తి
కోటిసూర్య ప్రకాశమకుంఠితమ్ము
దండధర కాలదండ ప్రచండతరము
కోటిశతకోటిధారాతి ఘోరతరము. 543

## రఘువీరుఁడు బ్రహ్మాస్త్రమున రావణుని గూల్చుట

ఉ. అక్షరమున్ నభేద్యమగు ఐంద్రశరాసనమున్ ధరించి ఫా
లాక్షుని బోలుతీవిని అహస్కరకోటి సమాన మూర్తియై
రూక్షవిశాలఫాలమున భ్రూకుటి రేఖలు దోప భీమమై
దక్షిణబాహుదండమున తచ్ఛరమున్ ధరియించి యుగ్రతన్.

శా. లోకంబుల్ చలియింపగా భయమతిన్ లోకేశు లీక్షింప ఆ
హాకారంబులు మింటినంటగను బ్రహ్మాస్త్రంబు సంధించుచున్
సాకారంబగు ఘోర రౌద్రమనగా జ్యావల్లి నుగ్రాకృతిన్
ఆకర్ణాంతము లాగి రావణునిపై ఆయస్త్రమేయన్ వడిన్. 545

శా. కాలోజ్జృంభితదృప్త వాయుపిసరాక్రాంతాతిభీతిప్రద
జ్వాలాలోలకరాళ పావకశిఖాజాజ్వల్యమానంబు సు
ద్వేలాలోలమహాబ్ధిబాడబశిఖా దేదీప్యమానంబు అ
ఫాలాక్షప్రతిమానమున్ భయదమౌ బ్రహ్మాస్త్రముగ్రాకృతిన్.

క. భుగభుగ పొగలన్ గ్రక్కుచు
భగభగ మంటలను దైత్యబలముల్ మండన్
ధగధగదీప్తి చతుర్దశ
జగముల్ వెలుగొంది భీతిజాగృతి నందన్ 547

క. దళదళ విద్యుద్దీప్తికి
ఫెళఫెళ నిర్హ్రాదములకు భీతిల జగముల్
తళతళ కాంతిచ్ఛటలకు
కలవరపాటొంది దేవగణముల్ బెదరన్. 548

శా. ఘోరాకారశరాళినిధ్వనుల దిక్కుంభుల్ భీతిపారంగ ఆ
హోరావంబులు మిన్నుముట్టగను రంహస్ఫూర్తి దీపింపగా
ఘోరాకారతదీయ వేగమునకున్ ఘూర్ణిల్ల లోకంబులున్
ఆరక్షోవిభు వక్షమున్ దొలిచి ఆహోరించె తత్ప్రాణముల్. 549

క. త్రుళ్లెను రావణుదేహము
త్రెళ్లెను రథ్యములు సారథియు వడి ద్రెళ్లెన్
ఫళ్లున విరిగెను రథమున్
కల్లోలముచెంది దైత్యగణముల్ పాఱెన్. 550

క. వేగముతో ఆ బాణము
భూగర్భము సొచ్చి యేగిభోగులు బెదరన్
భోగవతిన్ గ్రుంకులుగొని
ఆగతి వేవచ్చి తూణమందున జొచ్చెన్. 551

శా. వీరాకారము కోటిభాస్కరుల దీప్తిన్ మించి భాసింపగా
సారస్ఫార భుజాబలమ్మునకు దిక్చక్రంబునూగాడగా
ధీరస్ఫూర్తియు వీరమూర్తియును నుద్దీపింప భీమమ్ముగా
ఘోరాకారము దాల్చినావుగదె రక్షోనాధు గూల్పన్ ప్రభూ! 552

క. చల్లారెను భూభారము
ఉల్లాసము చెందె లోకమూత్సాహమున్
ముల్లోకమ్ముల రాక్షస
కల్లోలమ్మడిగె లోకకల్యాణముగన్. 553

ఆ. సాధ్వి జనక జాత శాపమ్ముచేనయ్యె
లంక రక్తమోంస పంకిలమ్ము
భ్రష్టశోభయాచు పతిలేని సతివోలె
కాంతిహీన యగుచు కళలు తొలగె. 554

## హరులు — సురలు చెందు ఆనందసందోహము

ఉ. ఘనముగ పుష్పవర్షములు కల్పకముల్ కురిపించె నీ పయన్
ధణధణ దేవదుందుభులు దంచితరీతిని మ్రోగె వింటిపై
ఝణఝణ అప్సరాంగనలు సల్పిరి నాట్యము లుత్సుకమ్మునన్
మునిజనమెల్ల ఆ దివిజ ముఖ్యులు స్తోత్రము చేసిరెంతయున్.

ఉ. రావణు గూల్చి లోకముల రక్షణచేసితి వీవు రామ! ఓ
పావనదివ్యనామ! భవభంజనధామ! సమస్త భక్త బృం
దావనకామ! సుస్మితముఖాంబుజ రామ! అటంచు భక్తిమై
ఆ వనజాసనేంద్రులు మహామునులెల్ల నుతించి రెంతయున్.

ఆ. సురలు విరులవాన కురిపించిరిలపైని
హడల మోములెల్ల విరిసి వెలిగె
అప్సరాంగనలును ఆడిరి పాడిరి
కప్పుదనము లొలయ గాలివీచె. 557

ఆ. పుడమి పడతి యొడలు పులకించి ఫలియించె
కడలు విశదమౌచు కాంతిమించె
చలివెలుంగు కాచె చల్లని వెన్నెల
భానుడుదయమందె భవ్యదీప్తి. 558

చ. అనుజుఁడు లక్ష్మణుండును అహర్పతి పుత్రుఁడు ఋక్షనాథుడున్
అనిలజుఁ డంగదుండును మహాబలశాలులు యూధనాథులున్
నిను వినుతించు చెంతయును నీ విజయంబును చాటిరెల్లెడన్
ఘనతరశంఖనాదములు గర్జనముల్ వెసఁజేసిరుద్ధతిన్. 559

## ఆత్మానుభూతి

ఉ. ఆయత బాహుదండమున ఇంద్రశరాసనమున్ ధరించి తా
మ్రాయత నేత్రముల్ కడుదయారస వీరరసోజ్జ్వలమ్ములై
ఆ యరవింద సామ్యమును నందగ లక్ష్మణు వానరేంద్రునిన్
వాయుసుతాంగదాదులను వానరయోధుల నెల్లగాంచు ఆ
నీయసమాన రూపమును నిల్పుదు నామదియందు రాఘవా! 560

## మండోదరి మొదలగు రావణుని రాణుల ఆక్రందనము

క. మండోదరి మొదలగు వా
రందఱు రావణుని రాణు లతిదుఃఖమునన్
ముందలలు వీడివడ ఆ
క్రందించుచు వచ్చిరంత ఆ రణభువికిన్. 561

ఉ. లోకములెల్ల గెల్చు అతిలోక పరాక్రమశాలివైన నీ
వీకరణిన్ మహామహా! మహీతలిగూలితే పుత్రులందఱున్
ఆకరణిన్ గతించిరి అహో! ఇఁక మేమెటులుందు మంచు, ఆ
శోకభరమ్మునన్ సతులు స్రుక్కుచు పొక్కుచు వాలిరందఱున్

గీ. అమరరాజేంద్రభోగభాగ్యమ్ములంది
పట్టుదిండుల మృదుల తల్పమ్ములందు
పండుకొనియెడు నీ విట్లు వట్టినేల
పండుకొందువె ఓనాథ! బడుగువోలె. 563

## అగ్రజుని మృతికి విభీషణుఁడు దుఃఖించుట

చ. వెలవెలపోవు మోమున విభీషణుఁడెంతయు శోకమగ్నుఁడై
జలజల అశ్రుబిందువులు జారగ కన్నులనుండి దీనతన్
ఇలఁబడి యున్న అగ్రజు అహీన పరాక్రమశాలి గాంచుచున్
వలవల యేడ్చి రావణుని ప్రక్కన వ్రాలె విమోహితాత్ముఁడై.

ఆ. సాధ్వి సీత దెచ్చి సాధించినది ఏమి?
వంశమునకు చేటు వచ్చెగాదె
నాడు వినవుగాదె నా మాటలను నీవు
దాని ఫలముగాదె దానవేంద్ర! 565

## లక్ష్మణుఁడు విభీషణుని ఓదార్చుట

క. అని పొక్క విభీషణు గని
అనునయమున్ జేయుమంచు అనుజుని బంపన్
జని లక్ష్మణుఁ డెంతేనియు
అనునయ వాక్యముల తేర్చి అతని కనియెన్. 566

క. జ్ఞానివిగద! నీ పితుల
జ్ఞానమునందంగదగునె! సానునయమతిన్
రాణుల దేఱిచి రాముని
ఆనతి అన్నకును జేయు మంత్యక్రియలన్. 567

క. అని లక్ష్మణుఁ డోదార్చిన
వినయమ్మున నిన్ గనుచు విభీషణుఁ డనియెన్
అనృతాత్మున కతిపాపికి
అనఘా! చేయంగదగునె అంత్యక్రియలన్. 568

## శ్రీరాముని ఆనతిని విభీషణుడు రావణునకు అంత్యక్రియలు గావించుట

క. మరణాంతము వైరంబని
ఎరుగవె! విను చక్రవర్తి కెటులో అటులన్
జరిపింపుము! అంత్యక్రియ
గురుభావమ్మెనఁగ నన్నకున్ కడుభక్తిన్ 569

మ. అని నీ వన్న విభీషణుండు చని నీ ఆజ్ఞానుసారంబు రా
వణు కాంతాజనమున్ నయోక్తి వినతిన్ వారించి బోధించి రా
వణు దేహంబును చక్రవర్తి విధిమై దాహంబు గావించి తా
వినతుల్ చేసి జలాంజలిచ్చి దెసనిన్ వీక్షింపవచ్చెన్ గదే. 570

## శ్రీరాముని విజయవార్తను హనుమంతుఁడు సీతాదేవికి తెలియఁ జేయుట

గీ. పవనజా! నీవు వే చని అవని సుతకు
మనజయంబును ధరణి రావణుఁడు పడుట
వినిచి రమ్మని పలుక గంభీరఫణితి
నీదు ఆజ్ఞను శిరమున నెమ్మిదాల్చి. 571

గీ. పవనజవమున ఏగి ఆ పవనసుతుఁడు
రాక్షసీగణముల మధ్య రామునెదను
ధ్యానమును జేయుచున్న ఆ ధరణితనయ
శోకసంతప్తహృదయ విశుద్ధచరితఁ
గాంచినతిచేసి వినమిత గాత్రుఁ డగుచు
ఆర్తి విడువమ్మ! ఈ శుభవార్త వినుమ!
పుత్రపౌత్రాత్మబంధు సమిత్రకముగ
రావణుఁడు గూలె రణభువి రాముచేత
రామలక్ష్మణులకు కుశలమ్ము తల్లి! 572

గీ. విజయవార్తనుదెల్ప నీ విభుఁడు పంపె
అనిన యంతన ఆ జనకాత్మజాత
పరమముదమంది ఆనందబాష్పసిక్త
నేత్రపద్మయు పులకిత గాత్రియగుచు
"ఇట్టి శుభవార్త దెలుపు నీకేమి యిత్తు
నవ్యనవరత్న ఖచితమౌ భవ్యదివ్య
హారమిచ్చిన ఋణమది తీరదోయి"
అనిన ఓ తల్లి అవని రావణుని గూల్చి
వీరశృంగారమూర్తియై వెలుగు విభుని
అమ్మ! గాంచితి రత్నహారాదులేల! 573

గీ. అనిన ముదమంది మదిని ఆ యవనితనయ
సర్వసద్గుణశాలి! ప్రశస్తశీల!
ప్రభుని దర్శింప ఆతృతపడుచునుంటి
విభుని కీ మాట దెలుపు నా వినతిగాగ
అనిన వేవచ్చి నీకు ఆ యనిలసుతుఁడు
విన్నవించెను జానకి విన్నపంబు. 574

గీ. యన్నిమిత్తంబు జరిగె యుద్ధాదులెల్ల
అట్టి జనకాత్మజాత ఆ యవనితనయ
ప్రభులు దయచేసి మాతల్లి భవ్యశీల
గాంచెదరుగాక! అని పలికించె హనుమ
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 575

## శ్రీరాఘవుండు సుగ్రీవాదుల అభినందించుట

గీ. వీరరసమొప్పు మహాగంభీరమూర్తి
అనుజులక్ష్మణు ఆ విభీషణుని ఇనజు
హనుమదంగద ముఖ్య యూథాధిపతులఁ
గాంచి దీర్ఘపు బాహు విక్రాంతిజేసె
రావణుండు గూల నాచేత రణమునందు
పావనంబును శ్రావ్యంబు భవ్యమైన
నాదు చరితంబు జగతి నున్నంత దనుక
త్వచ్చరిత్రంబు నాచంద్రతారకముగ
శాశ్వతమ్ముగ నిల్చు విశ్వమ్మునందు
అనుచు వచియించి మందస్మితాననమున
దివిజ నాథునివలె సభదీర్చియుంట
కంటి నా నాథు ఆ దేవగణముతోడ
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 576

## మాతలిని అభినందించి అంపివేయుట

గీ. అంత మాతలి నిన్నెంతొ అభినుతించి
"దేవ! అనుమతి దయచేయ దేవరాజు
గనగఁబోయెద" అని భక్తి మనవిసేయ

స్వాభినందపూర్వప్రసన్నదృష్టి
అనుమతించిన ఆతండు నరిగె దివికి
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 577

## విభీషణ పట్టాభిషేకము

చ. అనుజుని గాంచి నీవును మహాభుజులర్కజముఖ్యనాయకులన్
అనిలజు నంగదాదులును ఆతనిమంత్రిగణంబు నంతటన్
అనఘు విభీషణుంగొని మహావిభవంబున సింహపీఠిపై
ఘనభుజు నిల్పి పట్టమును గట్టుడు రాక్షసరాజ్యలక్ష్మినిన్. 578

క. అని నీ వాజ్ఞాపించిన
విని వారు విభీషణుని విభవంబెసఁగన్
గొని చని లంకాసింహా
సనమున గూర్చుండఁజేసి శాస్త్రోక్తవిధిన్. 579

క. పట్టాభిషిక్తు జేసిరి
ఇట్టులముగ వాద్యఘోషలెల్లమిన్ మ్రోయన్
దట్టంబుగ సుమముల నా
పట్టున గురిపించినారు వానరవీరుల్. 580

క. వచ్చిన లక్ష్మణునకు మరి
వచ్చిన హరిపుంగవులకు వరమణిభూషల్
ఇచ్చెను స్వర్ణాంబరముల
ఇచ్చెను పురజనులకెల్ల ఎలమి ధనంబుల్. 581

## విభీషణుండు కానుకలతో శ్రీరాముని చూడవచ్చుట

చ. పురజనముఖ్యులున్ సచివపుంగవు లున్నతసైనికాధిపుల్
పరిజనకోటి బంధువులు వానరముఖ్యులు వెంటనంటిరాన్
అరదముపై విభీషణు డసంఖ్యవిభూషలు రత్నరాసులున్
వరమణిహారముల్ గొనుచు వచ్చెను లక్ష్మణుతోడ నిగ్గనన్. 582

గీ. వచ్చి నతిచేసి నీ పాదవనజములకు
పూజచేసెను నవరత్నరాజితోడ
అతని భక్తికి మెచ్చి నీ వతని నెత్తి
కౌఁగిటను జేర్చి మిక్కిలి గారవించి. 583

## సీతను అలంకరించి గొనితెమ్మని శ్రీరాముడు విభీషణునకు చెప్పుట

గీ. జనకజాతను రాజ! సుస్నాతఁజేసి
విరజవస్త్రాఢ్యఁగావించి విమల చరిత
తగువిధంబున మత్సన్నిధానమునకు
శీఘ్రగతి తెమ్మటంచు వచించినంత. 584

గీ. వినయమున మ్రొక్కి ఆ విభీషణుఁడు పోయి
తనదు రాణికి సరమకంతయును దెల్ప
ఆమె అత్యంతభక్తి ఆ అవనితనయ
అంతిపురికిని గొనివచ్చి ఆదరించి. 585

గీ. అమలమణిగణరత్నపీఠమున నుంచి
పుణ్యసతులను గాంచి ఈ పుణ్యసాధ్వి
వినయభావాన స్నానాదివిధులు నెరపి
చక్కఁగైసేయుడనుచు ఆజ్ఞల నొసంగ. 586

సీ. పుణ్యనారీజనంబులు గంధతైలాది
సంస్కారముల జటల్ చక్క జేసి
కనకకుంభానీత కమ్రజలమ్ముల
అభ్యంగన స్నానమాచరించి
రమణీయరత్నాంబరములు గట్టగ నిచ్చి
రత్నహారాదు లలంకరించి
కస్తూరికాది సుగంధముల్ మెయిఁబూసి
తిలకంబు నుదుటను దీర్చిదిద్ది
సహజసౌందర్యవతియైన జనకజాత
లలితమౌక్తికరత్నపల్యంకమందు
సముపవిష్టను గావించి సఖులు గొలువ
వేత్రహస్తులు ముందును వెడక నడువ
వినుతమర్యాద దెచ్చె విభీషణుండు. 587

## సీతాదేవిని చూడ వానరులు సందడించుట

ఉ. వచ్చెడు నుత్సవంబుగని వానరులెల్లరు సంభ్రమించుచున్
హెచ్చిన కౌతుకమ్మున మహీసుతఁ జూడఁగ సందడించినన్
అచ్చపు రాజభక్తి మెయి యాష్టికవర్గము వారి నాపుచున్
హెచ్చుగఁ జేయ హెచ్చరిక తీవ్ర విభీషణుఁ గాంచి ప్రీతిపై. 588

ఉ. వానరులెల్లవారు మనవారలు గారె విభీషణా! యిటుల్
మానితమాతృభావమున మానినిఁ జూచిన దోషమేమి? ఆ
జానకి పాదచారిణిగ సమ్మతి వచ్చునుగాక! అంతటన్
వానరులెల్లవార లనివార్యగతిన్ గనుగొందు రాసతిన్. 589

గీ. అని హనుమంతుని గనుగొని
ఆజ్ఞ గొనితెమ్ము పాదచారిణి గాగన్
గనుగొందురు మనవారలు
జననిన్ గనుకీర్తి జనకజాతన్ సీతన్. 590

గీ. అనుచుఁ బనిచిన నీ యాజ్ఞ హనుమ యేగి
శిబికలో నున్న ఆ మాత సీతఁగాంచి
వినయమున మ్రొక్కి ఓ తల్లి! విభునియాజ్ఞ
పాదచారిణివై రమ్ము పరమసాధ్వి! 591

చ. అన విని భర్తృనాజ్ఞ జనకాత్మజ పల్లకి డిగ్గివచ్చె ఆ
వనచరులెల్ల పుణ్యజనవర్గము అచ్చెరువంది చూచుచున్
గనుగొన సృష్టితల్లి త్రిజగంబుల నెందును జూడబోమటం
చును వచియించి మాతృమతిఁ జూచి నతుల్ పొనరించి రందఱున్.

## శ్రీరాముఁడు సీతను నిష్ఠురోక్తుల నొప్పించుట

గీ. పంచవటినున్న యప్పుడు పాపబుద్ధి
రావణుఁడు వచ్చుటెఱిఁగి కార్యంబుపొంచె
ఛాయగా నుంచినట్టి ఆ మాయసీత
విడిచి పావకగర్భస్థ విమలచరిత
సీత గైకొందు ననుచు యోచించి మదిని
వినయభావంబుతో వచ్చి వినతిచేసి
తలను వాల్చి మిగులఁ గొందలము చెందు
చున్న సీతను గని ఆమె చిన్నవోవ
నిష్ఠురోక్తుల నొప్పించి నిందసేయ

మదిని దుఃఖించి మఱిది లక్ష్మణుని గాంచి
కంఠరుద్ధాశ్రుగద్గదకంఠి యగుచు
చకితమతులౌచు సందఱాశ్చర్యమంద
చితిని పేర్పింపు మిదియె నేఁ జితిని జొత్తు
నాదు సాధ్వీత్వ మిపుడ గన్నారఁగనుఁడు
అనుచు వచియింప నీదగు ఆజ్ఞఁజేసి
చితిని పేర్పించె సౌమిత్రి చింతమునిగి
పంచ భూతాళి మిగుల సంభ్రాంతి చెందె. 593

శా. అహాకారముచేయు చెల్లరును దా మార్తిన్ విలోకింపచో
హాహా! రాఘవుఁ డీమెత్తై రణమహోద్యోగంబు గావించి తా
బాహాశక్తిని గూర్చి రావణుని దుర్వాక్యంబులన్ బల్కుచున్
ఆహా సాధ్వి వసుంధరా తనయనే త్యాగంబు చేయున్గదా! 594

క. అని దుఃఖాశ్రులు గార్చుచు
అనుజుం డినజుండు పవనజాంగదముఖ్యుల్
మనమున దుఃఖించుచు నే
మనగన్ లేకెల్లవారు అలజడి చెందన్. 595

## సీత - అగ్ని ప్రవేశము గావించుట

శా. ఈ నా నాథునిదక్క నన్యు మది నే నేనాడు చింతింపనే
ఈ నా భర్త త్రిలోకనాథుఁడగునే ఈ విశ్వరక్షాచణున్
మానాతీతగుణప్రభావచరితున్ మాంగళ్యమూర్తిన్ మదిన్
ధ్యానంబందున నిల్పి చొచ్చెదను దేవా! నన్ బరీక్షింపుమా! 596

గీ. త్రికరణంబుల- అఘ మొనరింపనేని
పూత ధారుణిగర్భసంజాతనేని
సాధుశీలను ప్రతినిష్ఠసాధ్వినేని
కీల నా శీలమరసి రక్షించుగాత. 597

వ. అని శపథంబు చేసి వినయమ్మున సీత ప్రదక్షిణించి ఆ
జనకజ జాతవేదు మనసా దగఁగొల్చి స్తుతింపుచున్ ప్రద
క్షిణమును జేసి భక్తిపవశీకృత మానస యౌచుఁ దాను బ్రా
హ్మణ సురసిద్ధకోటికి నమస్సులు సేయుచు, పంచభూతములా!
గను పిదె నా సతీత్వము జగంబులకున్ విశదంబు సేయుడీ.

వ. అని వినుతించి భక్తి వసుధాత్మజ చిచ్చును జొచ్చెనంత, ఆ
కణకణ మండుటగ్ని కనకంబునుబోలె ప్రకాశమానయై
జనకజ శుద్ధ హేమమటు స్వచ్ఛతనుద్యుతి గానుపింప ఆ
వనజభవాసురేంద్రసురవర్గము వచ్చి నుతించి రా సతిన్. 599

గీ. గరుడ గంధర్వ సాధ్య కిన్నరగణంబు
యక్షరాక్షసగణము ప్రత్యక్షముగను
వదల నంటెడు పావకజ్వాలలందు
జ్వలనకాంతులమించి జాజ్వల్యమాన
దేహకాంతులవెల్గు సాధ్వీమతల్లి
జనకనందిని గాంచి ఆశ్చర్యమంది
వినతులన్ జేసి గురిసిరి విరులవాన
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 600

ఆ. భూతపంచకంబు చైతన్యమును దాల్చి
జనకజాతవంటి సాధ్వియెందు
లేదు లేదు జగతి లేదంచు వచియించె
తనువు పులకరించి ధాత్రి గాంచె. 601

## అనలుడు "సీత సుశీల" అని అభివర్ణించి శ్రీరామునికి అప్పగించుట

చ. అనలుఁడు నైజరూపమున అందఱుఁ జూడగ వచ్చినిల్చి ఈ
జనకజ సాధుశీల కడుసాధ్వి రమామణి ఈమెగాదె! ఓ
ఇనకులదీప! నీ వెఱుగవే వసుధాత్మజ గొమ్మ దేవ! నా
తనువు పవిత్రమయ్యెగదె త్వత్సతి నంటుట జేసి రాఘవా! 602

గీ. ఇంతకాలము లంకలో చింతఁజిక్కి
ఛాయగా నున్న ఆ తల్లి మాయసీత
అంతరించెను—నాలోన అపుడు నీవు
దాచియుంచిన ఈ సీత దయనుగొనుమ!
అంత ఎఱిగిన నీ విట్టులనగఁ దగునె? 603

చ. అని అనలుండు భక్తి వినయంబు నయంబు భయంబు దోపఁగా
జనకజదెచ్చి యీయగ ప్రసన్నుఁడవై గయికొంటి వా సతిన్
వినుతులు సేసిరందఱును వింటను మ్రోగెను దేవదుందుభుల్
ఘనముగ పుష్పవర్షములు కల్పకముల్ గురిపించె మీవయిన్.

## రాముఁడు అందఱను గలయంగనుంగొని గంభీరముగా నాడిన మాటలు

చ. జనకజ సాధుశీల కడుసాధ్వి పవిత్ర చరిత్రయౌను నా
మనమున లేశమాత్ర మనుమానము లేదట్లైన ఆమె రా

వణుని గృహంబునందు నొకవత్సరముండుట జేసి యెల్లభూ
జనములు నెమ్మనంబులను సంశయమందక వచ్చునందు దా
సనలముఁ జొచ్చునప్పుడును ఆ గతినుంటిని మౌనమూని, ఈ
అనలుఁడు దెల్పెగాదె యిపుడామె విశుద్ధ పవిత్రశీలమున్.
అని వచియించి కూర్మి జనకాత్మజ అంకమునందు జేర్పగా
వినుతులు చేసి రెల్లరును విశ్వవిభున్ నిను జానకీసతిన్. 605

గీ. నీదు వామాంకమున ధరణీతనూజ
వారిదాంతరవై ద్యుతవల్లి వోలె
స్వర్ణకాంత్యుజ్జ్వలత్తనువల్లి వెలుగ
ప్రకృతిపురుషుల మిము గాంచి పరవశించి. 606

గీ. కనుల మోదాశ్రుబిందువుల్ గ్రమ్మిగురియ
భక్తిగద్గదకంఠుఁడై పద్మభవుఁడు
ప్రస్తుతించెను ఇట్లు గీర్వాణఫణితి
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 607

## పద్మభవుఁడు సీతాసమేతు శ్రీరామచంద్రుని ప్రస్తుతించుట

దండకము

శ్రీ కోసలేశాత్మజాగర్భ శుక్త్యుద్భవస్నిగ్ధ ముక్తామణిం
భక్తచింతామణిం, వేదచూడామణిం, విశ్వరక్షామణిం,
జానకీమానసాంభోజమాధ్వీ రసాస్వాదనాలోల
మత్తాతినీలాంగభృంగాయమానాంతరంగం శుభాంగం

మహాక్రూర ఘోరాసురానీక సాంద్రాటవీ శుష్క-
వంశావళీ దాహ దావాగ్ని కీలాయమాన ప్రచండోగ్ర
శస్త్రాస్త్ర విక్షేపణాత్యంత దక్షోగ్ర కోదండ
దండాంచితోద్దండ బాహుం సుబాహుం
మహాకాశవారాశి సంకాశ మాహేంద్రనీలాభ
నీలాంబుజశ్యామ సుస్నిగ్ధకాంత్యుజ్జ్వల
స్నీలదేహం, విదేహం
చతుర్వేద వేదాంగ వేదాంతవేద్యం, సువేద్యం
సదా జ్ఞాన వైరాగ్య భక్త్యాది మార్గైకవేద్యం, నవేద్యం,
మహారాజ యోగజ్ఞ యోగీంద్ర మౌనీంద్రగమ్యం
సుగమ్యం, నగమ్యం
త్రివేద త్రిమూర్తి త్రిశక్తి త్రిలోక త్రికాలస్వరూపం
సురూపం, విరూపం
నిరాకార సాకార సానందరూపం చిదానందరూపం
సదా సర్వవేదార్థ మంత్రార్థ తంత్రార్థ యంత్రార్థ శబ్దార్థ
సర్వస్వరూపం, నరూపం
లసత్కోటి సూర్యేందు కాంతిచ్ఛటా దీవ్యమానా
ప్రమేయాదిమధ్యాంతరాహిత్యరూపం
మహాదీర్ఘబాహూజ్జ్వలచ్చారుచాపం, దురాపం,
సదాయోగి మౌనీంద్ర హృత్పద్మరంగస్థలీ సంచర
చ్చంచరీకం, శుభాంకం
సదా భక్త బృందాంతరంగాధి వాసానురాగం
సురాగం, విరాగం
ధరాభారభూతాసురానీక వంశాటవీ ఘోరదావాగ్నికీలం, సశీలం

ప్రపన్నాపదాపన్నభక్తాళిరక్షాతిలోలం, విలోలం
సలీలావిలాసార్థమారబ్ధ సంకల్పమాత్రేణ
ప్రాకల్పితానంతకోట్యండ పిండాండ బ్రహ్మాండ
ఖాండావళీ పాలనా పత్వితానూన మాహేంద్రజాలం సహేలం
సునీలాంబుజశ్యామలం కోమలం, చామలం
చారుశృంగారగాత్రం, ప్రఫుల్లాబ్జనేత్రం,
సదా ధ్యాతృ ధ్యానైకపాత్రం, సుగాత్రం
మహాపాపవల్లీలవిత్రం, పవిత్రం
మహావార్థిగంభీర, మత్యంతవీరం, మహామేరుధీరం,
మహావీర రామావతారం
పరేశం వరేశం ధరేశం సురేశం నరేశం
ధనేశం వనేశం ఫణీశం గణేశం
మహేశం, రమేశం
రఘూణామధీశం, సుసాకేతవాసం
లసచ్చారుహాసం, విలాసం
రమాభూమినాథం, త్రిలోకైకనాథం, సువైకుంఠనాథం,
భజే రాఘవేశం. భజే జానకీశం
భజే కీర్తిసాంద్రం, భజే రామచంద్రం
భజే త్వాం సదాహమ్. 618

— o —

గీ. వనజభవుఁడిట్లు వినుతించి వినతిచేసి
కుంభకర్ణాదిరాక్షసకోటితోడ
రావణుని క్రూరు ఘోరాజిరంగమందు
కూల్చి వసుధకు శాంతి చేకూర్చినావు 619

గీ. మానవాకృతిగొన్న రమాకళత్ర!
నాదు ప్రార్థన మన్నించినావు దేవ
ధన్యతన్ గంటి త్వద్దివ్యదర్శనమున
అనుచు వచియించె వేధ మోదాశ్రులొలుక
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 620

## శ్రీరాముఁడు దివ్యరూపధరు తండ్రి దశరథుని గాంచుట తండ్రి ఆశీస్సులందుకొనుట

గీ. శంకరుడంత దశరథేశ్వరునితోడ
వ్యోమయానమ్మునన్ వచ్చి వ్యోమవీధి
నిలిచి ఓరామ! కనుమిదే నీదు జనకు
దశరథేశ్వరు నన్న మోదమ్ము చెంది. 611

గీ. తమ్ముఁడును నీవు వసుమతీతనయతోడ
దివ్యకాంతుల వెలుగు నాదిత్యతేజు
తండ్రిఁ గనుగొని భక్తితాత్పర్య మెసఁగ
నమ్రభావాన సాష్టాంగ నతులు సేయ. 612

చ. తనివిని నిన్ను గన్గొని ముదమ్మునఁ గౌఁగిట జేర్చికూర్మి మై
కనుగవమోదబాష్పములు గ్రమ్మగ మేనును పుల్కరింపగా
తనయునిగాగ నిన్నుగని ధన్యుడఁ నైతిని నీవు తమ్ముడున్
జనకిజ సాధ్వి మాస్నుషయు సౌఖ్యముతో చిరకాలముండుఁడీ.

గీ. అనుచు దీవింప శంకరుఁడంత రామ!
నిగమసూక్తుల వినుతించి నిన్ను భక్తి
అగజతో గూడి నీదు పట్టాభిషేక

మహము చూడంగవత్తునో మహితచరిత!
అనుచు వచియించి నిన్నెంతో అభినుతించి
శంకరుడేగె దశరథేశ్వరునితోడ
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 614

## ఇంద్రుఁడు శ్రీరాముని స్తుతించుట

గీ. దివిజవల్లభుఁడంత ఓ దేవ! రామ!
భవ విరించులె నీదైన భవ్యమహిమ
తెలియలేరన్న నేనెట్లు తెలిసికొందు?
దుష్టరాక్షసశిక్షయు శిష్టరక్ష
చేయగా నెంచి స్వీయమౌ మాయఁబూని
అవతరించిన ఆదినారాయణుఁడవు
సర్వరాక్షసకోటి నాశమ్ముచేసి
లోకకంటకు క్రూరు త్రైలోక్యఁజేత
రావణుని గూల్చి భూమిభారమ్ము తీర్చి
మమ్ము రక్షింప వచ్చిన మాధవుఁడవు
నీదు దయచేతఁ ఓ దేవ! నిగమ వినుత!
స్వస్వపదవులు తొలగి అశక్తులైన
సర్వ దిక్పాలవరులు కష్టములు తొలగి
స్వస్వపదవుల నంది స్వాస్థ్యంబు గొనిరి
అంతరించిన శక్తులు ప్రాప్తమయ్యె
నిగమపదభూష! నిన్ను వర్ణింపదరమె! 615

## ఇంద్రుఁడు మృతవానరుల జీవింపఁ జేయుట

చ. అని వినుతించి భక్తి వినయమ్ములు దోపగ నంజలించి ఓ
యినకులదీప! చేయునది ఏదయినన్ గలదేని దేవ! ఆ
జ్ఞను దయచేయుఁడన్న దివిషద్గణవల్లభ! అట్టులేని ఈ
ఆని మొన నాకునై అసువులర్పణ చేసిన ఋక్షవానరుల్
పునరుపలబ్ధ జీవులయి పూర్వబలస్థితి నుండఁజేయుమా! 616

క. అని నీ వాజ్ఞాపించిన
వినయమ్మున ఇంద్రుఁడమృత వృష్టిన్ గురిపిం
చిన మృతవానరులెల్లరు
పునరుత్థితులై రి బ్రతికి పూర్వస్థితిమై. 617

ఆ. నిద్రనుండి లేచి నిలిచిన యట్టులా
వారలెల్ల బ్రతికి వచ్చినంత
నీవు జనకజాత ఆ వానరేంద్రుండు
అఖిల హరులు మోదమందినారు. 618

ఆ. అజభవుఁడు వహ్ని అమరేంద్రుఁ డాదిగా
వచ్చినట్టి దివిజ వర్గమెల్ల
నీకు వినతి చేసి నీ యనుమతి నంది
స్వస్వ వాహనముల చనిన — అంత. 619

## విభీషణుఁడు తన ఆతిథ్యమును స్వీకరింప శ్రీరాముని వేడుట

గీ. వినయభావంబుతో విభీషణుఁడు వచ్చి
ప్రభులు నాయెడ మిత్రభావంబు నెరపి

అనుజుతోఁ గూడ మీర భ్యంగనంపు
స్నానమొనరించి స్వర్ణ వస్త్రములు గట్టి
హార కేయూర మకుట హారాదులెల్ల
దాల్చ నేఁ జేయు అతిథి సత్కారములను
అందఁ గోరెదననిన ఆనందమంది
వినయపరుఁడైన ఆ విభీషణుని గాంచి. 620

చ. భరతుఁడు సోదరుం డమితభక్తుఁడు మాకయి వేచియుండు తా
నిరతము బ్రహ్మచర్యవ్రత నిష్ఠతపంబును జేయుచుండె సో
దరుఁ డటు నట్టులుండగను త్వత్కృత సత్కృతులెట్లుగొంతు ఓ
వరగుణ! ఆదరంబు మెయి వానరరాజును సత్కరించినన్
పరమముదమ్ము చెందెదను బాంధవభావము చూపుమన్న ఆ
దరమెనగంగ ఆ యినజు తత్పరివారము రత్నభూషణాం
బరముల భక్ష్యభోజ్యముల భవ్యఫలంబులఁ దన్పి అంతటన్
వరమణి రత్నహారముల వారిక నీకును దెచ్చియిచ్చె నన్. 621

ఉ. మెచ్చితి నీదు సత్కృతికి మెచ్చితి నీదగు భవ్యభక్తిన్
అచ్చపు భక్తియుక్తి ఫలమైనను పత్రమొ పుష్పమైననున్
దెచ్చినఁ జాలుగాదె! ఇటు తెచ్చితి మౌక్తిక రత్నహారముల్
ఇచ్చకు మెచ్చువచ్చె వరమిచ్చెద గొమ్ము విభీషణా! అనన్
అచ్చపు భక్తినిమ్ము హృదయమ్మున నిన్నె భజింతునేననన్ 622

గీ. "తత్తథాస్తంచు" వరమిచ్చి దైత్యరాజ!
ధర్మమార్గాన ఆచంద్ర తారకముగ
రాజ్యమేలుము సుప్రజారాజ్యమనఁగ
అంతమందున మోక్షమ్ము నందఁగలవు. 623

గీ. అనుచు వచియించి మేమయోధ్యాపురమ్ము
చేరగావలె నీనాడె శీఘ్రగతిని
పుష్పకమ్మును గొనితెమ్మ పుణ్యపురుష!
అనుడె తడవుగ పుష్పకమ్మచట నిలిచె. 624

## శ్రీరాముఁడు పుష్పకవిమానమున సపరివారముగ బయలుదేరుట

గీ. వానరేశ్వర కిష్కింధ వరకు నీవు
రమ్ము మాతోడ సకలసైన్యమ్ముతోడ
అనిన ఓ ప్రభు! నీదు పట్టాభిషేక
మహము చూడంగ వేడుక మాకుఁ గలదు. 625

గీ. నీదు పట్టాభిషేకమ్ము నీ పురమ్ము
స్వామి నిను గన్నతల్లి కౌసల్యమాత
వరమభక్తుని సీతమ్మ భరతుగాంచి
మరలివత్తుము మాకనుమతినినిమ్మ! 626

గీ. అనుచువేడిన అందుల కనుమతించి
రాక్షసేశ! విభీషణ! రమ్ము నీవు
నీదు మంత్రులఁగూడి అనింద్యచరిత!
అనిన అందఱు ఆనందమందినారు
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 627

గీ. రామ! నీవును దేవి ధరాతనూజ
అనుజుఁ డినజుండు ప్లవగసైన్యంబదెల్ల
సచివసహితుండు ఆ విభీషణవిభుండు

సమ్మదమ్మున అధిరోహణమ్ము సేయ
నీదు నాజ్ఞ విమానమ్ము నింగికెగసె
గాంచితిని నేను చారగణముతోడ
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 628

క. మణిగణకాంతుల నంబర
మణిపోలిక వెలిగి వ్యోమమార్గము వెంటన్
అనిలమనోజవములతోఁ
జన – పుష్పక మీవు జనకజాతన్ గనుచున్. 629

## రాఘవుఁడు సీతాదేవికి ఆ యా స్థలములఁ జూపించుట

ఉ. ఇదె రణభూమి చూడుమిటు ఇచ్చట వానరదైత్యకోటికిన్
కదనము ఘోరమౌగతి ముఖాముఖిసాగను పారె నెత్తురుల్
ఇదె కను కుంభకర్ణునిని ఇచ్చట గూల్చితి ఘోరరూపునిన్
అదె కను మేఘనాదునిని అచ్చటఁ గూల్చెను లక్ష్మణుండు, నే
నిదె కను రేపి! రావణుని ఇచ్చటఁ గూల్చితి లోకకంటకున్. 630

చ. కనుమిదె వార్ధి వారధిని కట్టెను దీనిని విశ్వకర్మ స
త్తనయనలుండు నేర్పు మెయి తద్గిరి శృంగతరువ్రజమ్ముసన్
వననిధి నైజరూపమున వచ్చెను నన్ను బ్రసన్నుఁజేయగా
మణిగణమిచ్చి తాఁ దరణ మార్గముదెల్పెను ఇచ్చటే సుమీ! 631

గీ. సేతునిర్మాణ మియ్యెడఁ జేయునపుడు
విఘ్ననాయకు పూజ గావించి ముందు
శివుని రామేశు నిట ప్రతిష్ఠించినాను
మహితు రామేశు దేవి! సమస్కరించు. 632

గీ. ఇదిగో కిష్కింధ కను వానరేంద్రపురము
వాలిఁ గూల్చితి నిచట దుర్వారబలుని
అనుచు పుష్పక మచ్చట నాపి ఇనజ!
నీదు రాణులగన మేదినీకుమారి
మిగుల వేడుక పడుచుండె నగచరేశ!
వారి రావింపు వేవేగ వారుగూడ
పుష్పకము మీద సాకేతపురికి వత్తు. ౬౩౩

గీ. అనిన ఇనజుండు ప్రభ్వాజ్ఞ అరిగి తనదు
రాణులన్ దెచ్చె సపరివారమ్ముగాగ
వారలన్ గాంచి జానకి గారవించి
అధికతరమైన ఆనందమందె మదిని
పుష్పకమ్మంత ఎగిరి తా పోయె దివికి. ౬౩౪

గీ. ఇదె శబర్యాశ్రమముగను మిచటె శబరి
భక్తితో మాకు తీయని ఫలములిచ్చె
ఆమె యిచ్చట దేహదాహమ్ము చేసి
మోక్షమును గాంచె నిర్మల ముగ్ధ భక్తి ౬౩౫

ఆ. ఇదిగో గృధ్రకూట మిపటె జటాయువు
నిన్ను నపహరించు నీచు దనుజు
ఎదిరి పోటుసల్పి ఎనలేని బలశక్తి
ప్రాణమిచ్చె తుదకు పక్షిరాజు. ౬౩౬

గీ. ఇదె యగస్త్యుని ఆశ్రమమ్మిచటె మౌని
ఇంద్రుఁ డిచ్చిన శస్త్రాదులిచ్చె మాకు
ఇదె సుతీక్ష్ణుని యాశ్రమమ్మిదిగో యిచటె
అతఁడు గావించె ఆతిథ్యమధిక భక్తి. ౬౩౭

ఇదిగో శరభంగు నాశ్రమమ్మిదియె గనుము!
మహితభక్తుండు జ్ఞానియౌ మౌని యిచట
మనల పూజించి భక్తిమై వినుతి చేసి
కాయమాహుతి చేసి మోక్షమ్మునందె 638

అదిగో గౌతమి మునిపల్లె లవిగొ గనుము
తరుశాఖల వల్కలాంబరము లవిగో
పంచవటి గను మదె మన పర్ణశాల
ఇచట నుంటిమి గదె పదియేండ్లు మనము. 639

చిత్రకూటమ్ము గనుమదె చిత్రశిఖరి
భరతుఁ డిచ్చటె నను జూడ వచ్చెఁగాదె!
పావనంబైన గంగాస్రవంతి గనుము
శ్యామలామలవారియౌ యమున అదిగొ. 640

అదిగో వాల్మీకిమౌనీంద్రు నాశ్రమమ్ము
అమ్మునీంద్రుని సంప్రార్థనమ్ముఁ జేసి
అచట నిర్మించె లక్ష్మణుండాశ్రమమ్ము
అందు నుంటిమి గాదె ఆనందమెసఁగ. 641

యూపమాలిని అదె సరయూస్రవంతి
ప్రాజ్యరవివంశ రాజన్య రాజధాని
అదిగో కనుగొమ్ము! మన అయోధ్యాపురమ్ము
వందనము సేయు మానంద బాష్పములుక. 642

## భరద్వాజుని ఆతిథ్యమును స్వీకరించుట

గీ. వచ్చినారము శ్రీ భరద్వాజమౌని
ఆశ్రమోపాంతభూమికి అదిగొ గనుమ!
ఇచట నించుక ఆగి మౌనీంద్రుఁ గాంచి
పోవుదము నేడ సాకేతపురికి దేవి! 643

క. అని అయ్యెడ నా పుష్పక
మును దింపిన గాంచి మిమ్ము మునివరుఁ డంతన్
ముని జనములు దను గొల్వగ
ఘనముగ స్వాగతము బలుకగా వచ్చె ప్రభూ! 644

గీ. స్వాగతము నీకు శ్రీరామ! స్వాగతమ్ము
సర్వలోకైకనాథ! సుస్వాగతమ్ము
స్వాగతము జనకరాజన్యతనయ!
స్వాగతము నీకు లక్ష్మణ! స్వాగతమ్ము. 645

గీ. అనుచు స్వాగతమును బల్కి అతులభక్తి
ఆశ్రమమ్ముకుఁ గొనిపోయి అమరపూజ్య
రావణాదిక తద్దుష్ట రాక్షసులను
కూల్చి వసుధకు శాంతి చేకూర్చినవు
సర్వమరసితి నాతపశ్శక్తి జేసి. 646

గీ. దేవ! దయచేసి నాదు ఆతిథ్యమంది
సకలసైన్యమ్ముతోడ విశ్రాంతి నంది
రేపు చేకుమ మీ అయోధ్యాపురమ్ము
అనెడు మునిచంద్రు మాట కాదనగలేక. 647

చ. మునిగణపూజనీయ! మునిపుంగవ! ఉందు త్వదాజ్ఞమేర, నా
అనుజులు మాతలందఱు మహాత్మ! సుఖస్థితి నున్నవారె? మా
జనపదవాసులెల్లరకు స్వాస్థ్యమె? వగ్రహపీడలేదుగా?
వినుతచరిత్ర! రాజ్యము సుభిక్షమునై తనరారునే గదా! 648

గీ. అనఘ! నీమాతలనుజులు అఖిలజనులు
క్షేమముగ నున్నవారలు రామచంద్ర!
అమలచరితుండు భరతుండు అమరవినుత
బ్రహ్మచర్యవ్రతస్థుఁడై బ్రహ్మనిష్ఠ
కేవలుఁడవైన నిను ప్రతీక్షించుచుండె. 649

### శ్రీరాముడు హనుమంతుని భరతునియొద్దకు బంపుట

చ. అని ముని పల్కినంత పవనాత్మజుఁగన్గొని నీవు పోయి నా
అనుజుఁడు పుణ్యశీలుఁడగు ఆ భరతున్‌గని మా చరిత్రమున్
వినిచి సవిస్తరంబు పృథివీసుతతోడుత మేము నేడె ఈ
వనచరరాజుఁగూడుకొని వచ్చుట యెల్లను దెల్పుమా వెసన్ 650

గీ. మార్గముననున్న గుహునకు మాదు రాక
కుశలమును దెల్పి ఆతని కుశల మడిగి
ముని భరద్వాజుఁ ఆతిథ్యమును గ్రహించి
వచ్చుచున్నట్లు దెల్పుమీ వాయుతనయ. 651

క. అని నీ వాజ్ఞాపించిన
హనుమంతుఁడు వినతిసేసి అతివేగమునన్
జని, నీ రాకను గుహునకు
వినిపించిన అతనుమోద వివశుండయ్యెన్. 652

గీ. గుహుని వీడ్కొని చని గంధవహసుతుండు
భరతు గనుగొను వేడుక పవనగతిని
నందిగ్రామమ్ము చేరి ఆనందమెసఁగ
శాంతినిలయమ్ము భరతు నాశ్రమము గాంచి. 653

కం. నరరూపము గొని చని యా
భరతున్ శ్రీరామభక్తి భరితున్ గని ఈ
భరతుని బోలిన అనుజులు
అరుదుగదా జగతిననుచు అతఁడు వినగన్. 654

చ. భరతకుమార! నీవెవరి భావన చేయుచునుంటివో అదే
వరచరితుండు రాఘవుఁడు వచ్చెను జానకితోడ క్షేమియై
వరగుణ! లక్ష్మణుండు నల వానరరాజును గొల్వ నేడె ఈ
పురమును జేరవచ్చు ఘనపుష్పవిమానముతోడ గాంచుమా. 655

గీ. అనెడి శుభవార్త చెవిపడి నంతలోన
భరతుడత్యంత సమ్మోదభరితుఁడగుచు
అమితసంతోషపారవశ్యంబు చెంది
స్వప్నమౌనొకొ! ఇది యహో సత్యమౌనొ! 656

గీ. ఇట్టి శుభవార్త దెల్పిన యట్టి నీవు
ఎవరివాడవు? నిన్నిటు లెవరు పంపె?
దేవదూతవా! నా రామదేవు దూత
వాడవో నీవు దెల్పుమా! అనఘచరిత. 657

గీ. ప్రభువరుండగు శ్రీరఘురాముదూత
వానరేంద్రుని మంత్రిని వాయుసుతుఁడ
ప్రభువు పంపగ నేనిటు వచ్చినాను
"హనుమ" అందురు నను భరతావనీశ! 658

ఉ. ఎక్కడనుండె రాఘవుఁడు? ఏ విధినుండెను చెప్పుమోయి! నీ
వెక్కడనుండి వచ్చితివి? ఏమని చెప్పెను నాప్రభూత్తముం
డిక్కడి కెప్డు వచ్చును మహీసుతతోడను తమ్ముతోడుతన్
అక్కడివారి దౌ చరితమంతయుఁ దెల్పవె కూర్మి పావనీ! 659

గీ. అనిన వినుమోయి! నీదగు అగ్రజన్ము
చరితమును దెల్పువాఁడను సంగ్రహముగ
అనుచు మదిలోన భక్తి నిన్నభినుతించి
భరతుతో నిట్లు పల్కెను పవనసుతుఁడు. 660

ఉ. రాముఁడు దండకాటవి విరాధఖరాదికదైత్యకోటి సు
ద్దామ బలంబునన్ గెడపి తాపసకోటిని గాచి బ్రోచె, సు
త్రామజు వాలిగూల్చి అట రాజును జేసె నినాత్మజన్ము, నా
రీమణిచోరుఁడై అపహరించిన రావణు ఘోరవీరు సం
గ్రామమునన్ వధించి నిజరామను జానకి నగ్నిశుద్ధ నా
భూమిజనంది వచ్చెను ప్రభుప్రవరుం డని తెల్పె సర్వమున్.

గీ. వారలిప్పుడు శ్రీ భరద్వాజమౌని
ఆశ్రమమ్మున నున్నవా రతఁడు సేయు
నతిథిసత్కారములనెల్ల అంది వత్తు
రనుచు నీదైన చరితమ్ము నంత దెలుప. 662

చ. కుశలమె రాఘవేంద్రున కకుంఠపరాక్రమ శత్రుజేతకున్?
కుశలమె జానకీసతికి కోమలగాత్రి విదేహపుత్రికిన్?
కుశలమె తమ్ములక్ష్మణునకున్ నయశాలికి పుణ్యమూర్తికిన్?
కుశలమె వానరేంద్రనకనూన పరాక్రమశాలికయ్యెడన్. 663

గీ. అంపఁబెకు రాజ! కుశలమ్ము అందఱిపుడె
వచ్చెదరు గాదె చూచెద వచ్చువరగ
అనుచు వచియించునంత ఆ హనుమఁగాంచి
కనుల నానందబాష్పముల్ గ్రమ్మఁగుఱియ. 664

గీ. రాఘవుఁడు నేడయోధ్యకు రాకయున్న
అగ్నికాహుతి అయియుందు నంతలోన
నీవు రాముని రాక విన్పించినావు
ప్రాణదానమ్ము చేసిన ప్రాణసఖుఁడ!
ఈఁకు నేమిత్తు నీ ఋణమెట్లుదీర్తు?
రత్నహారాదులీయ దీరదు ఋణంబు
అనుచు పవనజుఁగౌఁగిట నాదరించె
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 665

## శ్రీరాముని రాక విని తల్లులు ఆనందపారవశ్యము నందుట

గీ. జనకజాతయు అనుజ లక్ష్మణులతోడ
నీదు రాకను విని జననీగణమ్ము
కన్నులన్ మోదబాష్పముల్ గ్రమ్మి కురియ
తనువు పులకలదేర చిత్తమ్మునలర

వేలమించిన ఆనంద హేల మీర
నిన్నుఁజూడంగ ఉత్కంఠ మిన్నుముట్ట
పరవశించుచు సమ్మోద వార్ధిఁ దేలె
అంతిపుర మెల్ల ఆనందమంది పొంగె
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 666

## స్వాగత సన్నాహము

గీ. అంత భరతుడు శత్రుఘ్ననునుజు గాంచి
పురమునందలి దేవమందిరములందు
వివిధపూజాదులను జరిపింపవలయు
అఖిల పౌరులతోడ బ్రహ్మాండముగ
స్వాగతోత్సవమునకునై చాటఁబంపు 667

మంత్రివరుఁడనైన మంత్రి సుమంత్రు తోడ
మంతనము చేసి ఆలస్యమింతలేక
మండలేశులు సకల సామంతనృపులు
దంతిరథవాజిరాజిపాదాతిదళము
నటవిదూషక గాయక నర్తకులును
సకల తూర్యాది వాద్యఘోషములతోడ
బయలు వెడలంగ ఆజ్ఞలఁ బంపవలయు. 668

గీ. రాజమాతలతో మన రాణులెల్ల
అంతిపురినుండి చతురంతయానములను
బయలువెడలంగఁ దగిన ఏర్పాటులెల్ల
చేయు మీ పని ఆజ్ఞలు చేసి తాను. 669

గీ. నీదు నిర్మలమౌ రత్నపాదుకలను
శిరమునందున దాల్చి విశిష్టభక్తి
అమలకాషాయవర్ణవస్త్రములు దాల్చి
గురువశిష్ఠులతోఁగూడి భరతుఁడంత
వెడలె మంత్రులు తన వెనువెంట గొలువ
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 670

## అయోధ్యలో పౌరుల ఆనంద సందోహము

గీ. నీదు రాకను దెల్పుచు వీధి వీధి
పురమునందున ఘోషణ జరిపినంత
అబ్ధి పొంగిన గతి అయోధ్యాపురమ్ము
నింగికంటెడు వేడల పొంగిపోయె
వెల్లివిరిసెను సంతోషమెల్లయెడల
పురజనమ్ముల మోములు విరిసిపోయె. 671

గీ. శిల్పచాతురి మెరయంగ శిల్పిగణము
వాటముగ దీర్చియెల్ల శృంగాటకములు
రాజవీథుల గోపుర రాజియందు
రత్నరమణీయ మకరతోరణములెత్తి
తప్తకాంచన సూర్యపతాకలెత్తి
స్వాగతోక్తుల జిలుగువస్త్రములు గట్టి
కనులవిందుగ దివ్యశృంగారమొలుక
లలితగతిమించె పురము నలంకరించె. 672

చ. పురమున నెల్లదిక్కులను పొక్కెను నీవటు వచ్చువార్త, క
స్తురి వరసౌరభమ్ము వెన గమ్మున నెల్లెడఁ గ్రమ్మినట్టులన్

వరగుణు నిన్ను తమ్మువరవర్ణిని సీతను జూడవేడుకన్
పురజనులెల్లవారు కడుమోదముతోడుత నెల్లచోట సం
బరమున బాలవృద్ధులును బారులు బారులు గాఁగఁదీరుచున్
కరమరుదైన యుత్సవము గాగ గమించిరి అందఱున్ వడిన్
కరిఘటదంతురమ్ము తురగప్రచురమ్ము రథప్రచారమున్
వరభట సంకులమ్ము నయి భాసిల రాజపథంబదెల్ల, సు
ద్ధురతర వాద్యఘోషములు తూర్యరవంబులు భోరుమంచు సం
బరమును నంటగా, మధురమంజులగానము లుల్లసిల్ల, భూ
సురవర వేదనాదములు సూరికవీంద్రుల స్తోత్రపాఠముల్
వరగగ మేళతాళములు పాడుచు నాడుచు నందఱాగతిన్
పురవర బాహ్యసీమ నట బొల్పుగ నిల్చిరి త్వద్దిదృక్షమై. 673

మండలేశులు మంత్రి సామంత నృపులు
హితులు బంధువులును పురోహితులు గొలువ
తలను సద్భక్తి త్వత్పాదుకలను దాల్చి
పుణ్యసరయూజలాంచితపూర్ణకుంభ
ములను ధరియించి బదువల్ ముందునడువ
అనిలతనయుండు శత్రుఘ్నుఁడనుసరింప
వచ్చె భరతుండు ఆనంద భరితుఁడగుచు
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 674

## భరద్వాజ ఆశ్రమమునుండి రాముడు బయలుదేరుట

గీ. వరతపశ్శక్తి ఆ భరద్వాజమౌని
పంచభక్ష్యాన్నభోజ్యసంభరితమైన
విందుచేసిన మునియిచ్చు విందునంది
నతులు గావించి మౌని యానతిని బడసి. 675

గీ. వరవిభీషణ సుగ్రీవ భల్లుకేంద్ర
వానరానీక పతులెల్లవారు గొలువ
అమ్మహాయానమధిరోహణమ్ముచేసి
బయలు వెడలిరి పతివైభవమ్మెసంగ. 676

## హనుమంతుడు చూపించుచుండ పుష్పకవిమానము దివినుండి భువికి దిగుట

చ. అదియదె దివ్యకాంతుల అహస్కరబింబమువోలె వచ్చు న
ల్లదె గనుఁడయ్య! పుష్పకము అందునరాఘవుఁడుండె సీతతో
అదె కనుగొండు లక్ష్మణు అహస్కరపుత్రు విభీషణాదులన్
అదె యటుగాంచుడంచు పవనాత్మజుఁడట్లు వచించు నంతలోన్
అదె దిగి వ్రాలె పుష్పకము అంబరవీధి భ్రమించి భూమికెన్.

గీ. వాహనమ్ములుదిగి యెల్లవారు నిలిచి
రామ విభుఁడదె జానకీరమణితోడ
వచ్చెఁగనుఁడంచు పరవశత్వమ్ము చెంది
చేతులెత్తుచు మ్రొక్కి జేజేలు పలికి
కన్నుగవమోదబాష్పముల్ గ్రమ్మిగురియ
“రామ రామ”న్న నీ దివ్యనామరవము
దిక్కులెల్లను నిండి ప్రతిధ్వనింప
ఉచ్చగతి నుచ్చరించిరి ఉత్సుకమున. 678

గీ. పౌరజనముల నే నొక్క పౌరుతనయు
తనువు పులకింప తన్మయత్వమ్ము చెంది
కంటి నా నాడు మోదాశ్రుకణములొలుక
రమ్యగుణసాంద్ర! శ్రీరఘు రామచంద్ర! 679

## భరతుఁడు పుష్పకమధిరోహించి అగ్రజునకు సాష్టాంగ నతులుగావించి తక్కినవారిని గౌరవించుట

గీ. భరతుఁడంతట సాష్టాంగపడుచులేచి
పుష్పకము నెక్కి త్వత్పదాంభోజములకు
భక్తిసాష్టాంగనతిచేసి బాష్పజలము
కనుల గురియంగ పాదముల్ గడిగి యుక్తి
తజ్జలంబులు శిరమున దాల్చినంత
కరము ప్రేముడి తమ్ముని కౌఁగలించి
అంకమున జేర్చి కుశలమ్ము నడిగినావు
అంత భరతుండు వదినె సీతమ్మగాంచి
అతుల భక్తిని సాష్టాంగనతులు చేసి
తమ్ములక్ష్మణు గాంచి మోదమ్మెనంగ
కౌఁగిటను జేర్చి మోదాశ్రుకణములొలుక
వానరేంద్రు విభీషణు భవ్యమతిని
కౌఁగిటను జేర్చి మిక్కిలి గారవించి.
అంగదాదుల ఎల్ల యూథాధిపతుల
హస్తచాలనములతోడ నాదరించె. 680

గీ. అవరజుండైన శత్రుఘ్నుఁ డంతవచ్చి
త్వద్ద్వినిర్మల పాదపద్మములు గొలిచి
వినతులన్ జేసి వదినె భూతనయఁ గాంచి
భక్తిగావించి పాదాభివందనమ్ము
అగ్రజుండైన లక్ష్మణు నచటగాంచి
అమలభక్తిని పాదపద్మములకెరగె. 681

## రాఘవుఁడు పుష్పకమునుండి దిగి గురువులకు–తల్లులకు పాదాభివందనము గావించుట

ఉ. అంతట పుష్పకమ్ము దిగి అందఱ పౌరుల కూర్మి గాంచుచున్
చెంతన యున్న పూజ్యులు వసిష్ఠులవారి పదాంబుజమ్ముల
త్యంత-వినమ్రభావమున అర్చనచేసి, స్వమాతృపాదముల్
అంత సమర్చచేయవె ముదశ్రులు కన్నులజారి పారగన్. 682

## కౌసల్య–ఆనందపారవశ్యమునందుట

చ. జలజల సశ్రుబిందువులు జారగ నిన్నని యొత్తికౌఁగిటన్
పులకలుదేర దేహమున మూర్ధము మూర్కొని ఇన్నియేండ్లకున్
కలకలలాడు నీ నగమొగమ్మును గంటిపుత్ర! నా తపః
ఫలమవు నీవ నాదుజని భాగ్యము సర్వము నీవె రాఘవా! 683

గీ. తల్లిమాటలకెంతొ మోదమ్మునంది
తల్లి కైకేయి పాదపద్మముల కెరగి
అల సుమిత్రాంబ పదపద్మములకు మ్రొక్కి
ఇతరమాతల పాదమ్ములెలమి గొలిచి
సీతతో గూడ వారి ఆశీస్సులంది. 684

గీ. మండలాధీశ మంత్రి సామంతనృపులు
చేయు అభివందనమ్ములు స్వీకరించి
అందుకొంటివి పౌరాభినందనములు
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 685

## భరతుని అభ్యర్థనము

గీ. భరతుఁడంతట త్వద్దత్తపాదుకలను
నీదు పాదాబ్జములు పట్టినిండుభక్తి

తొడిగి మోదాశ్రుబిందుల్ దొరగకనుల
దశగుణమ్ముగ ధనరత్నధాన్యములను
కోష్ఠముల నింపినాఁడ గైకొమ్ము రామ. 686

గీ. నీకు బదులుగ నిన్నాళ్లు నేను నీదు
రాజ్యమేలితి గొనుము నీ రాజ్యమిదు
అనుభవించింప నందఱు నతనిగాంచి
భరతుభక్తికి ఆనందభరితులైరి. 687

గీ. భరతుతోఁ గూడ నటనుండి తరలివెడలి
నందిగామమ్ము వ్యోమయానమ్ముతోడఁ
జేరితివిగాదె! ప్రజలు జేజేలువెట్ట
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 688

గీ. అచట పుష్పకయానమ్ము నవతరించి
పుష్పకమ! పోయి నీ పూర్వవిభుని
ధనదు వహియింపు మికమీద ననుచుపనిచి
గురువశిష్ఠులు మండలేశ్వరుల తోడ
అచట సభదీర్చియుండ నయ్యవసరమున
భరతుఁడేతెంచి వినయసంభ్రమము లెనఁగ. 689

ఉ. నీదగు రత్నపాదుకలు నిర్మలభక్తిని పూజచేయుచున్
నీదగు ప్రాజ్యరాజ్యమును నేనిటు లేలితి నీదునాజ్ఞ ఈ
సోదరు ప్రార్థనమ్ముగాని శుద్ధచరిత్ర! త్వదీయరాజ్యమున్
సాదరబుద్ధిగైకొనుము! సర్వసుపర్వసురేంద్రపరాజితా! 690

## రాఘవుఁడు పుష్పకమునుండి దిగి గురువులకు—తల్లులకు పాదాభివందనము గావించుట

ఉ. అంతట పుష్పకమ్ముదిగి అందఱు పౌరుల కూర్మి గాంచుచున్
చెంతన యున్న పూజ్యులు వసిష్ఠులవారి పదాంబుజమ్ముల
త్యంత-వినమ్రభావమున అర్చనచేసి, స్వమాతృపాదముల్
అంత సమర్చచేయవె ముదశ్రులు కన్నులజారి పారగన్. 682

## కౌసల్య—ఆనందపారవశ్యమునందుట

చ. జలజల సశ్రుబిందువులు జారగ నిన్గని యొత్తికౌఁగిటన్
పులకలుదేర దేహమున మూర్ధము మూర్కొని ఇన్నియేండ్లకున్
కలకలలాడు నీ నగమొగమ్మును గంటిపుత్ర! నా తపః
ఫలమవు నీవ నాదుజని భాగ్యము సర్వము నీవె రాఘవా! 683

గీ. తల్లిమాటలకెంతొ మోదమ్మునంది
తల్లి కైకేయి పాదపద్మముల కెరగి
అల సుమిత్రాంబ పదపద్మములకు మ్రొక్కి
ఇతరమాతల పాదమ్ములెలమి గొలిచి
సీతతో గూడ వారి ఆశీస్సులంది. 684

గీ. మండలాధీశ మంత్రి సామంతనృపులు
చేయు అభివందనమ్ములు స్వీకరించి
అందుకొంటివి పౌరాభినందనములు
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 685

## భరతుని అభ్యర్థనము

గీ. భరతుఁడంతట త్వద్దత్తపాదుకలను
నీదు పాదాబ్జములు పట్టినిండుభక్తి

తొడిగి మోదాశ్రుబిందుల్ దొరగకనుల
దశగుణమ్ముగ ధనరత్నధాన్యములను
కోష్ఠముల నింపినాఁడ గైకొమ్మురామ. 686

గీ. నీకు బదులుగ నన్నాళ్ల నేను నీదు
రాజ్యమేలితి గొనుము నీ రాజ్యమీవు
అనుభవించుచు నందఱు నతనిఁగాంచి
భరతుభక్తికి ఆనందభరితులైరి. 687

గీ. భరతుతోఁ గూడ నటనుండి తరలివెడలి
నందిగామమ్ము వ్యోమయానమ్ముతోడఁ
జేరితివిగాదె! ప్రజలు జేజేలువెట్ట
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 688

గీ. అచట పుష్పకయానమ్ము నవతరించి
పుష్పకమ! పోయి నీ పూర్వవిభుని
ధనదు వహియింపు మికమీద ననుచుపనిచి
గురువశిష్ఠులు మండలేశ్వరుల తోడ
అచట సభదీర్చియుండ నయ్యవసరమున
భరతుఁడేతెంచి వినయసంభ్రమము లెనఁగ. 689

ఉ. నీదగు రత్నపాదుకలు నిర్మలభక్తిని పూజచేయుచున్
నీదగు ప్రాజ్యరాజ్యమును నేనిటు లేలితి నీదునాజ్ఞ ఈ
సోదరు ప్రార్థనమ్ముగొని శుద్ధచరిత్ర! త్వదీయరాజ్యమున్
సాదరబుద్ధిగైకొనుమ! సర్వసుపర్వసురేంద్రపరాజితా! 690

క. అని బహుధా ప్రార్థించిన
విని, ఆతని సుదృఢభక్తి వినయమ్ములకున్
మనమున మెచ్చుచు మోద
మ్మున తమ్మునినుండి రాజ్యమును గొంటివిగా. 691

ఉ. ఖండిత రాక్షసేశ్వర! అఖండపరాక్రమ! అండపిండ బ్ర
హ్మాండములేలు నీకును మహాత్మ! మనంబుననెంచి చూడ. భూ
మండల రాజ్యమెంత? ఇటు మానుషభావము నూనుదేవ! కో
దండధరా! ప్రచండ భుజదండ పరాత్పర! రాఘవప్రభూ! 692

క. కర్తవు, సృష్టిస్థితిలయ
కర్తవు, బ్రహ్మాండ కోటికర్తవు, త్రిజగత్
కర్తవు, భక్తజనావన
కర్తవు, నీవౌదుగాదె కంజదళాక్షా! 693

గీ. అతులమహిమానుభావ! మాయామనుష్య!
భక్తవాత్సల్యమునఁ జేసి భరతుప్రార్థ
నమ్ము మన్నించి స్వీయ రాజ్యమ్ముగొనఁగ
భరతుఁడెంతయు ఆనందభరితుఁ డయ్యె. 694

### రామాదులు మంగళ స్నానమును గావించుట

గీ. భరతునాజ్ఞను సద్భక్తి భరితులగుచు
నీకు ప్రతికర్మ సేయంగ నిపుణులైన
నాపితులువచ్చి శ్మశ్రుకృన్తనము చేసి
చంపకామలతైల సంస్కారములను
జడలముడులను సడలించి చక్కఁజేసి

మంగళస్నానవిధిని అభ్యంగనమున
జలకమాడించి పన్నీరజలముపోసి. 695

గీ. కనక వస్త్రాంగరాగ సుగంధములను
స్వర్ణమౌక్తిక రత్నభూషాగణమ్ము
రత్నకేయూరమకుట హారములుదెచ్చి
పురుష మోహన శృంగారమూర్తివైన
నీకు ప్రతికర్మ చేసిరి నిపుణులెల్ల
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 696

గీ. భరతలక్ష్మణ శత్రుఘ్న వానరేంద్ర
దైత్యరాజేంద్రులెల్ల రుదాత్త భంగి
హారకేయూర మకుట భూషాంబరాది
వస్తువులు కట్టి తొడి పూసి వచ్చినీదు
సన్నిధానంబునందుఁ బ్రసన్నమతిని
సింహపీఠమ్ములందు ఆసీనులైరి. 697

## సీతాదేవికి మంగళ స్నానము చేయించి సఖీజనము అలంకరించుట

సీ. సఖులు సీతకు—కమ్మనంపంగి నూనెతో
తలయంటి జడలను దలఁగ జేసి
కమ్మవలపులు గొల్పు గంధపుపొడితోడ
నలినాక్షియొడలికి నలుగువెట్టి
కనకకుంభమ్ముల కమ్మని పన్నీట
జలకమ్ములార్చి కేశమ్ములొత్తి
కమ్మని అగరుధూపమ్ముల తడి యార్చి
సుచభిళమల్లికాసరులు తురిమి

రత్నరంజితకనకవస్త్రములు గట్టి
రత్నమౌక్తిక దివ్యహారములు వెట్టి
కమ్మపుప్పొడి అంగరాగమ్ములలది
చక్కఁగైసేసిరెల్ల రా జనకజాత. 698

గీ. పుత్రవత్సల కౌసల్య మోదమెసఁగ
తారమున్నగు సుగ్రీవతరుణులకును
స్వర్ణమౌక్తిక రత్న భూషము లిచ్చి
లలితరమణీయకనకచేలమ్ము లొసఁగి
చక్కముస్తాబు చేయించె సఖులచేత
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 699

## శత్రుఘ్నుని ఆజ్ఞలు

గీ. అంతపురమేగ రథము నాయత్తపరుపు
అని సుమంత్రునకును దెల్పి అఖిలజనులు
మండలాధీశ సకల సామంతనృపులు
సకలసైన్యమ్ము సమధికోత్సాహ మెసఁగ
ప్రభులు శ్రీరామునననుసరింపంగవలయు
అనుచు శత్రుఘ్నుఁడందఱకాజ్ఞలిచ్చె. 700

## పురాలంకరణము — పురవీధి మహోత్సవము సాగుట

సీ. రాజసౌధశ్రేణి–రత్నదండాంచిత
తమనీయసూర్యపతాకలెత్తి
పురవీధులందు నింపున్ సొంపుఁ బెంపొంద
స్వాగతపట్ట వస్త్రములగట్టి

ప్రతి గోపురద్వారభాగమ్ములందున
  భాసురపూర్ణ కుంభములు నిల్పి
రాజమందిరసీమ - రత్నమౌక్తికజాల
  రమణీయ మకరతోరణములెత్తి
రాజవీథుల కిరువంక రమ్యముగను
రత్నదీపాలతోరణరాజినిల్పి
పొలుపుమీరంగ సాకేతపురమునెల్ల
తీర్చిదిద్దిరి దివ్యనందీ ప్తిమించ. 701

ఉ. స్వీయవిశేషవేషములు జిల్గుతురాయిలు దాల్చినిల్చి, ఆ
త్యాయత రాజమార్గమున ఆశ్వికవర్గము వేత్రహస్తులై
చేయ బరాబరుల్ తురగ సింధురతుంగ రథవ్రజంబులున్
సాయుధ వీరవారమును సాగెను భోరున వాద్యఘోషలున్. 702

## శ్రీరామవిభుఁడు పుర మేగుట

ఉ. సుందర రత్నకీలితము శుద్ధసువర్ణ వినిర్మితమ్మునున్
సుందరరత్నదండయుత సూర్యపతాక సమంచితమ్మునై
అందముచిందు రత్నమణిహార సుమౌక్తిక తోరణాంచిత
స్యందనమందు నిల్పె చతురశ్వయుతమ్ము సుమంత్రుఁడంతటన్

గీ. అమ్మహారథ మారోహణమ్ము సేయ
నీవు తరలిన యంతనే నింగినంటి
పటహభేరీనినాదముల్ ప్రబలమయ్యె
తూర్యనాదమ్ములెల్లెడఁ దోరమయ్యె
శంఖకాహళరావముల్ సాగె దెసల. 704

### సీతాదేవి - సుగ్రీవుని రాణులు బయలువెడలుట

గీ. జానకీదేవి సుగ్రీవు రాణులంద
అందలమ్ముల చతురంతయానములను
చెలిమికత్తెలు ఇరువంక చేరి కొలువ
భటులు గొలువంగ ఇరుకేవ బారుతీరి
తరలివచ్చిరి వారలుత్సవముతోడ. 705

### హనుమదాదులు అలంకరించుకొని బయలుదేరుట

గీ. హనుమదంగద జాంబవదాదులెల్ల
స్నానములు చేసి విమలవస్త్రములు గట్టి
రత్నకేయూరమకుటహారములు దాల్చి
వారలందఱు గజవాజి వాహనముల
తరలినారలు సమధికోత్సాహమెసఁగ. 706

సీ. భరతుండు సారథిత్వముదాల్చి రథ్యముల్
విన్నాణమున నడిపించుచుండ
లక్ష్మణుం డతిభక్తి రత్నదండాంచిత
శ్వేతాతపత్రంబు చేతఁ బట్ట
శత్రుఘ్నుఁ డమల నిశ్చల భక్తితో నిల్చి
దంబైన ఆలవట్టంబు వట్ట
ఇనజ విభీషణు లిరువంకలన్ దాము
వింజామరల్ పట్టి వీచుచుండ
వందిమాగధగణ మిరువంక నిలిచి
త్వద్గుణంబుల నెలమి స్తోత్రమ్ము సేయ
మండలాధీశ సకలసామంతనృపులు
దండనాథులు గొలువ నుద్దండలీల.
ఉత్సవమ్మది గొల్పె నేత్రోత్సవమ్ము 707

సీ. హయరాజిహేషలున్ హస్తిఘీంకారముల్
వాద్యఘోషంబు లవ్వారిగాగ
పటహభేరీశంఖఝాంకృతినాదముల్
దశదిక్కులను ప్రతిధ్వనుల నీన
పౌరజనమ్ము లాబాలగోపాలమ్ము
చేయెత్తి భక్తి జేజేలు వలుక
నర్తకీగణము విన్నాణంబుఁ జూపుచు
అందందు నిలిచి నాట్యమ్ము సేయ
సురగణంబును దిక్పాలవరులు గొలువ
అమరనాథుండు పురమేగు నట్లుగాగ
రాజవీధిని నీదగురథము సాగె
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 708

చ. సురచిరవస్త్రభూషలను సుందరులందఱు దాల్చి సౌధ గో
పురముల నిల్చి నిన్ పరమపూరుషు, పుష్కరనేత్రు, కామ సుం
దరుని వినీలగాత్రుని నుదారగభీరమనోజ్ఞమూర్తి, సుం
దరరుచిరస్మితాననను ముదమ్మున గాంచుచు భక్తి మ్రొక్కుచున్
విరులను మౌక్తికాళి కురిపించిరి దోసిళులెత్తి మీ పయిన్. 709

గీ. అట్లు పురమేగి తమ అయోధ్యాపురమ్ము
రాజవీధులు గడచి దుర్గమ్ము చేరి
సర్వతోలంకృతమ్ము విశాలమైన
రాజభవనాంగణమ్మున రథముదిగ్గి. 710

గీ. రాజమర్యాద అంతఃపురమ్ముచేరి
అందుమాతల పాదాభివందనమ్ము
చేసి అందుండి వారి ఆశీస్సులంది
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 711

## భరతుఁడు సుగ్రీవాదులకు విడుదులేర్పాటు చేయుట

గీ. నీదు నాజ్ఞను భరతుండు నిండుభక్తి
రాక్షసేశ్వరవానరప్రభుల కెలమి
తావకోజ్వలరత్నసంతానభరిత
వస్తువాహనసకల సంపత్సమృద్ధ
భవనరాజమ్ములందున వసతు లిచ్చి
తక్కువారలకెల్లను తగినయట్టి
వసతిగృహముల కల్పించి వారినిల్పె. 712

## రామపట్టాభిషేకమునకు గంగాదిపుణ్యనదీజలంబులను హనుమదాదులు గొనివచ్చుట

గీ. భరతుఁ డామీద సుగ్రీవు వానరేంద్రు
కాంచి నవరత్నకాంచనఘటము లిచ్చి
దివ్యగంగాదిపుణ్యనదీజలమ్ము
పుణ్యచతురబ్ధిసంగతపుణ్యజలము
త్వరితగతితేరఁ బంపుమా తగినవారి
అనిన జాంబవదంగదహనుమదాది
ప్రముఖవానరవీరులఁ బంప వారు
పోయి తెచ్చిరి కలశల పుణ్యజలము
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 713

## శ్రీరామ పట్టాభిషేక మహోత్సవము

గీ. గురువసిష్ఠుల ఆనతి భరతుఁ డెలమి
శీఘ్రగతి నీదు పట్టాభిషేకమునకు
స్వర్ణరత్నాంబరాదికవస్తుచయము
ఛత్రచామరరాజలాంఛనము లెల్ల
సిద్ధమును జేసి తెల్పె వసిష్ఠమునికి. 714

గీ. వరభరద్వాజ వాల్మీకి వామదేవ
హరిత గౌతమ కౌశిక యాజ్ఞవల్క్య
కణ్వగర్గాత్రి జాబాల్యగస్త్యముఖ్య
శిష్టమౌనులతోడ వసిష్ఠమౌని
సల్పి హోమాదికృత్యముల్ శాస్త్రవిధిని. 715

ఉ. సురుచిరరత్నరాజిపరిశోభితసుందరసింహపీఠిపై
వరగుణరూపశీల వరవర్ణిని సీతను నిన్ను నిల్పి భూ
సురవరులున్ మునీంద్రులును సూరిజనంబులు పౌరవృద్ధులున్
ధరణిపులున్ సుకన్యలును దానవనాథుడు వానరేంద్రుఁడున్
సురవరులున్ దిగీశులును శూరులు మంత్రులు దండనాథులున్
గురువరులెల్లరున్ కనకకుంభపవిత్రనదీజలమ్ములున్
సరసవనౌషధీగణరసంబులు వారిధిపుణ్యవారి మీ
శిరములఁబోసి యెల్లరభిషేకము చేసిరి వేదసూక్తులన్. 716

గీ. సవితృవంశ ప్రసిద్ధులౌ సార్వభౌము
లౌదలన్ దాల్చు భవ్యమౌ అమలవజ్ర
రత్నకీలితమకుటంబు రామ! నీదు
శీర్షమందున నిల్పె వసిష్ఠమౌని

భూసురాశీర్వినాదముల్ బోరుకొనగ
వాద్యఘోషంబులెల్ల అవ్వారిగాగ
పరిమళము గ్రమ్మ శ్రీకల్ప తరులవిరులు
సురలు గురిసిరి తాము సంస్తుతులతోడ
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 717

సీ. సౌమిత్రి గురుభక్తి స్వర్ణదండాంచిత
ధవళము క్షాతపత్రంబు పట్టి
భరతశత్రుఘ్న సోదరులు దామిరువంక
విమలంపు ఆలపట్టములు పట్టి
వానరేంద్రుఁడు దైత్యవల్లభుండిరుదెస
మణిదండధవళచామరలు పట్టి
అనిలాత్మజాతుండు వినతుఁడై త్వత్పాద
పద్మంబు లమలసద్భక్తి పట్టి
కవితభక్తిని అందఱు గొలుచుచుండ
దివ్యమణిరత్నకాంతిదేదీప్యమాన
రత్నపీఠిని జానకిరమణితోడ
కొలువు దీర్చిన నిను రామ! గొలువ రారె
గిరిజతోఁగూడ కైలాసగిరివిభుండు
దశదిగీశ్వరబృంద బృందారకులును
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 718

## నర్తకీమణుల – నృత్యములు

ఉ. పూతపసిండి తీవలను బోలిన కోమలదేహవల్లరీ
జాతసుగంధముల్ దశదిశల్ వెస ఘుంఘుమవ్యాప్తిచేంద, అ
త్యాతతతధిక్ తళాంగ్ తధిగిణాయతధిమ్ ధిమినాదపద్ధతిన్
చేతమెలర్ప నృత్యములు చేసిరి తత్సభనర్తకీమణుల్. 719

క. దిరదిర బిరబిర దిరుగుచు
మెఱుపుల యొఱపులను మించు మేనులజిగిపై
గరగరికల అలనట్టువ
తెరవల నాట్యమ్మెసఁగె తియ్యమెలర్పన్. 720

అవనిజాతను జేర్చి వామాంకసీమ
మించుకాంతుల భాసించు మేఘమట్లు
దివ్యతేజో విశేషసందీప్తినంది
రత్నసింహాసనస్థశ్రీరామునిన్ను
నీరజాసనుఁ డిట్లు వర్ణించెభక్తి. 721

## అచ్చరముచ్చెకంటుల - నాట్యములు

క. కలకలకణకింకిణులును
చరణమ్ముల నూపురముల ఝణఝణరవముల్
మురజమ్ముల ధణధణలులు
సరిగమపదనిసలరవము సరిసరితూఁగన్. 722

క. అచ్చరలేమలు తమివ్వరి
విచ్చిన ఆ నెమ్మిగముల విన్నాణమ్ముల్
అచ్చువడ మెచ్చ సభ్యులు
ముచ్చటగా వివిధ నాట్యములు సల్పిరటన్. 723

సీ. నాకవైణిక తుంబుర నారదులును
తాన గానమ్ముచేసిరి వీణమీటి
అప్సరః కాంతలెల్ల నాట్యంబుసేయ
పాడినారలు గంధర్వ భామినులును

సిద్ధసాధ్యులు స్తోత్రముల్ సేయభక్తి
రక్తి నీకీర్చిరాపె చారణగణమ్ము
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 724

ఉ. వాసవ చోదితుండగుచు వాయువు దివ్యసహస్రపద్మ సం
భాసితభర్మహారము సమర్పణ సేయగ వాసవుండు దా
బాసురనవ్యదివ్యమణి భాసితహారము పాయసమ్ముగా
దోసిలిచాచి ఇచ్చెగదె తోయజబాంధవ వంశభూషణా! 725

ఉ. వచ్చిన రాజులెల్లమదవారణ వాజి మహార్ఘరత్నముల్
అచ్చపుమౌక్తికమ్ములుపహారముగా గొనితెచ్చి భక్తిమై
ఇచ్చిరి, మండలాధిప మహీశులు మౌక్తికహీరహారముల్
తెచ్చి వినమ్రులౌచును నుతించుచు కానుకవెట్టిరందఱున్. 726

గీ. ఇంద్రుఁడాదిగ సర్వదిగీశవరులు
దివ్యమణిరత్నహారముల్ దెచ్చియిచ్చి
వినయవినమిత గాత్రులై వినతిచేసి
ప్రస్తుతించిరి నిన్ను గీర్వాణఫణితి. 727

## ఇంద్రుఁడు శ్రీరామచంద్రుని స్తుతించుట

ఉ. రావణముఖ్య ఘోరతర రాక్షసకోటి వధించి లోకముల్
గావఁగఁ బుట్టినావుగదె కారుణికోత్తమ! మానవుండవై
దేవ! త్వదీయ సత్కృపవను దీరెను రావణబాధలెల్ల, ఓ
పావనరూప రాఘవ! అపారకృపాకర! జానకీప్రియా! 728

ఉ. శ్రీరమణీశ! భక్తజనశేవధి! నీకలరూపెఱుంగగా
ఏరికి శక్యమౌను? నిఖిలేశ్వర! బ్రహ్మమహేశముఖ్యుల
వ్వారలె నిన్నెఱుంగరిఁక వాసుకిశేషఫణీశ్వరాదులే
తిరుగ నీగుణంబులు నుతింపఁగజాలరు నాకుశక్యమే. 729

గీ. నీలనీరద మాహేంద్ర నీలదేహ!
కోటిమన్మథసుందర! కోమలాంగ!
నిఖిలబ్రహ్మాండనాయక! నిగమవినుత!
పద్మజాభవపూజితపాదపద్మ! 730

గీ. వీరశృంగారమేరుగంభీరమూర్తి!
మానవాకృతిగొన్న రమాకళత్ర!
అవ్యయానందపూర్ణ! దివ్యావతార!
అమలగుణరత్నవార్ధి! రామావతార! 731

గీ. బహువిధంబుల నీరీతి ప్రస్తుతించి
నీకు సాష్టాంగనతిచేసి నియతభక్తి
గరుడగంధర్వయక్ష కిన్నరగణమ్ము
అమరమునులును గొల్వంగ అమరవిభుఁడు
దివ్యరథమునఁదానేగె దివికినంత
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 732

## శివుఁడు శ్రీరాముని (ప్రస్తుతించుట) ప్రశంసించుట

ఉ. మానవ రూపమందిన రమాపతి! రాఘవ! మాయఁబూని ఈ
భానుకులంబునందు ప్రభవంబును గాంచితిగాదె యీ గతిన్
నేను— త్వదీయ నామమును నిత్యము భావనచేయుచుందు నా
మానసవీధి, పార్వతికి మానితతావకగాథ తెల్పుదున్. 733

గీ. మధురతరమైన త్వన్నామమంత్రజపము
ధరణి జనులకు సంసారతారకమ్ము
అట్టి తావకమధుర నామామృతమ్ము

వారణాశిని నివసించు వారికెల్ల
కిర్ణమునఁ బోయుదవసానకాలమందు. 734

గీ. రామ! ఈ రీతి సుప్రజారంజకముగ
ప్రాజ్యతరమైన ధరణి సామ్రాజ్యమేలి
అశ్వమేధాదికములైన యజ్ఞవితతి
ఆచరించుచు లోక కల్యాణమెంచి
ధర్మదేవత నాల్గుపాదముల నిల్పి
రమ్ము నీదైన వైకుంఠరాజ్యమునకు
అనుచు వచియించి నీపూజలంది శివుఁడు
గిరిజతోగూడి కైలాసగిరికి నేగె
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 735

## శ్రీరాముడు వేదపండితులకు భూరిదానంబులు గావించుట

ఉ. భాసుర రత్నముల్ కనక వస్త్రములన్ వరధేనుసంతతిన్
భూసురకోటికిచ్చితివి భూములు గ్రామములున్ సువర్ణముల్
దోసిళలెత్తి తాము పరితుష్టిని నందధనంబు ధారగా
బోసితివౌర! పేదలకు భూజనులెల్లరు మెచ్చ రాఘవా! 736

గీ. దాతృమూర్ధన్య! శిబిని మాంధాతమించి
వేదవిదులకు షట్ఛాస్త్రవిదులకెల్ల
దానవిద్యుక్తదశవిధ దానములను
ధారవోసితి వీవు ఔదార్యమెసఁగ
భూరిదక్షిణలిచ్చుచుఁ బూజచేసి
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 737

## శ్రీరాముఁడు సుగ్రీవ విభీషణాదుల గౌరవించుట

చ. రవికులసార్వభౌమ! రఘురామ! సగౌరవభావసంపదన్
రవిజ విభీషణాదులకు రాజితరత్న విరాజమానమౌ
ప్రవిమలరత్నహారములు భాసురరత్నదుకూల వస్త్రముల్
దవిలిన సఖ్యవృత్తిని ఎదన్ గదియించుచు మెచ్చి యీయవే. 738

గీ. హనుమదంగద జాంబవదాది సకల
యోధనాథులకెల్లను యోగ్యమైన
రత్నమౌక్తికహీరహారముల నిచ్చి
గారవించితి గాదె ఉదారబుద్ధి. 739

## హనుమదాదులకు ప్రత్యేక గౌరవము

గీ. అనిలసుతునకు మౌక్తికహారములను
అంగదునకును విమల రత్నాంగదములు
జాంబవంతున కమలవజ్రాలసరులు
ఇచ్చి మెచ్చితి వీవు ప్రత్యేకముగను. 740

గీ. అవనిజాతకు నవరత్న హారమిచ్చి
దేవి! నీ నచ్చువారికి దీని నిమ్ము
అనిన ఆ దేవి అందఱ నరసి యరసి
అనిలతనయుని దయఁగని అతని కిచ్చె. 741

గీ. అంతతో గాక నిజకంఠమందు నున్న
రమ్యమౌక్తిక దివ్యహారమ్ము దీసి
అమ్మహాదేవి విమలభావమ్ముతోడ
అంజనానందనుని మెచ్చి అతనికిచ్చె. 742

గీ. అట్టి ప్రత్యేక గౌరవమంది హనుమ
తల్లిప్రేమకు ఆనంద తన్మయత్వ
మంది కనుదోయి మోదాశ్రుకణములొలుక
తనువు పులకింప తల్లిపాదాలవ్రాలె. 743

క. తక్కిన వానరకోటికి
చిక్కని ముత్యాలసరులు చిత్రాంబరముల్
ఒక్కొక్కరి కీయగ వా
రుక్కిరి బిక్కిరిచెంది ఉబ్బిరి వేడ్కన్. 744

## సుగ్రీవాదుల వీడ్కోలు

గీ. ప్లవగవల్లభ! సుగ్రీవ! భవ్యమిత్ర
అమితమై మించు భోగభాగ్యములంది
విబుధగణములు మెచ్చ వేవేల యేండ్లు
స్థిరతరంబగు కీర్తి కిష్కింధనేలి
అంతమందున రవిలోన నైక్యమగుదు
వనుచు వచియించి ఆతని ననిచి కూర్మి. 745

గీ. సత్వగుణశాలి యగు విభీషణుని గాంచి
పద్మభవవంశసంభవ! పరమభక్త
అసురరాజేంద్ర! నీవు ప్రహ్లాదువంటి
పరమభక్తుండ వౌదువు భవ్యశీల!
ఇంక నిశ్శంక అకలంక లంకకేగి
సారతరకీర్తి ఆ చంద్రతారకముగ

పాలనము చేసి తుదిని మత్పదము గందు
వనుచు వానిని ప్రీతిమై అనిచితివు
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 746

## హనుమంతునకు వరదానము

గీ. అనిలనందను గనుగొని "హనుమ నీకు
వాంఛితం బేదియైన ఆ వరమునిత్తు
వేడుకొమ్మన పావని వినయమెసఁగ
విభుని సుమధుర నామ మీ విశ్వమందు
ఎంత కాలము వెలయునో అంతదనుక
నాదు తనువుండ వరమిమ్ము నళిననేత్ర!
అమృతమధురమ్ము నీదు నామామృతమ్ము
తనివిదీరగఁ ద్రావుచు తనియువాఁడ. 747

గీ. అనిన ముదమంది నీవు "తథాస్తు" హనుమ!
అనుచు వరమిచ్చి మందస్మితాననమున
పవననందన! భావికల్పమ్ము నందు
బ్రహ్మపదవిని గొంతు మవశ్యమనిన
స్రష్టనేనైన ప్రభు! నాదు సృష్టియందు
రామభక్తుల సృష్టింతు రాఘవేంద్ర! 748

గీ. అనుచు వచియింప ఆనందమంది నీవు
హనుమ! నా సన్నిధానంబునంద నీవు
సర్వదా యుందు వనుచు ప్రసన్నమతిని
పల్కితివి గాదె ఆతని భక్తి మెచ్చి
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 749

## గుహునియెడ ఆదరభావము చూపుట

చ. సదమల భక్తియుక్తిని నిషాదవిభుండు గుహుండు వచ్చి త్వ
త్పదములవ్రాలి మ్రొక్కుచు నుపాయనమిచ్చుచు మౌక్తికమ్ములన్
పదములు పూజచేసి బహుభంగులసంస్తుతి చేయనాతనిన్
సదయుఁడ వౌచు కూర్మి మెయి సందిటఁజేరిచి ఆదరించి నీ
సదమల భక్తికెంతయుఁ బ్రసన్నుఁడనైతిని భోగభాగ్యసం
పదలనిహమ్మునన్ బడసి మత్పదమందెదవంతమందునన్. 750

గీ. అనుచు వచియించి ఎంతయు నాదరించి
రమ్యమౌక్తిక రత్నహారమ్ములిచ్చి
సఖ్యభావాన విపుల రాజ్యమ్మునిచ్చి
సదమలమ్మైన భక్తివిజ్ఞానమిచ్చి
అనిచితివి గాదె అతని దయాసముద్ర!
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 751

## ఆత్మానుభూతి

ఉ. రాజదయోధ్య-రాజసభ రత్నమయోజ్వల మండపమ్మునన్
రాజితభవ్యదివ్య- నవరత్నవినిర్మితసింహపీఠిపై
రాజదమూల్య రత్నమణిరంజిత మౌక్తికహారిహార వి
భ్రాజిత వజ్రనీలమణి రత్నమహోజ్వల మౌళిదాల్చి రా
రాజులు సోదరుల్ ప్లవగరాజు విభీషణ ముఖ్యులున్ మహా
రాజులు మండలేశులు సురప్రకరంబును గొల్వనమ్రులై
రాజనమొప్పు కోటిరతి రాజమనోహర దివ్యమూర్తివై
రాజిలు నిన్ను గాంచితి పురాకృత పుణ్యతపఃఫలమ్మునన్. 752

గీ. కనుల నానందబాష్పముల్ క్రమ్మికురియ
తనువు పులకింప తన్మయత్వంబు నెంది
అనఘ రాఘవ! నీదుపట్టాభిషేక
మహము గనుగొంటి దర్బారుమహలులోన
కవి గణంబున నేనొక్క కవిని అగుచు
త్వచ్చరిత్రమ్ము లలితకావ్యమ్ము వ్రాసి
నీకు నర్పించుకొంటిని నిగమవినుత!
అందుకొంటివి నీవు దయార్ద్రదృష్టి
నాదుజన్మమ్ము దేవ ధన్యత్వమందె
నాదు భాగ్యమ్మునిండె పుణ్యంబు పండె
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 753

## రామరాజ్యము

సీ. దశరథాత్మజ! నీవు ధర్మమార్గమ్మున
రాజ్యముసేయ త్వద్రాజ్యమందు
ప్రతిమాసమును మూఁడు వానలు కురియంగ
దుర్భిక్షదోషంబు దొలఁగిపోయె
భూదేవి తనువెల్ల పులకరించినయట్లు
బహువిధ సస్యసంపదలు మించె
ధనధాన్యవస్తు సంతతులతో నిండులు
వెండిబంగారముల్ నిండి వెలసె
ఈతి బాధలులేక ఎల్లదేశంబులు
శాంతిమై జీవన సౌఖ్యమందె

కలిమి చెలువకు ప్రతివేశ్మ నిలయమయ్యె
లేమి యనుమాట యెందును లేకపోయె
త్యాగభోగైకనిలయమై ధనము వెలసె
లోభగుణమది జగతిలో లుప్తమయ్యె. 754

ఉ. లేరు దరిద్రు లేయెడను లేరు జరామయ రోగబాధితుల్
లేరు నిరక్షరాస్యులును లేరు నిశాచర జార చోరులున్
లే రెట కర్మహీనులును లే రెట వంధ్యలు భర్తృహీనలున్
లే రెట నాస్తికాధములు లే రెట లోభులు నీతిబాహ్యులున్
లే రెట లోకవంచకులు లే వెట క్షామము ఈతిబాధలున్
శ్రీరఘురామ! భక్తజనశేవధి! నీదగు రాజ్యపాలనన్. 755

గీ. తల్లులెఱుగరు తాము సంతానసష్ట
మతివ లెఱుగరు వైధవ్యమనెడి మాట
జార చౌర్యాది వృత్తులు సడలిపోయె
నీతిమార్గాన భారతజాతి నడచె. 756

గీ. స్వస్వవృత్తులు పాలించి సర్వజనులు
చీకుచింతలు లేక నిశ్చింతవృత్తి
పావనంబుగ గడిపిరి జీవయాత్ర
ఆప్లవంబులు శాత్రవవిప్లవములు. 757

గీ. ఆధిభౌతికమాదియౌ ఆధులేవి
లేక జనులెల్ల త్వద్భక్తి లీనులగుచు
నీదు పూజాదిపనులను నెరపి యెలమి
నీదు రూపమ్ము మదిని ధ్యానింతు రెపుడు. 758

గీ. ద్విజులు నిజకర్మ నిష్ఠమై దీప్తినంది
వేదవేదాంగ శాస్త్రాదివిద్యలందు
ప్రజ్ఞగడియించి నిరత బ్రహ్మజ్ఞులగుచు
యజ్ఞయాగాది కృత్యమ్ములాచరించి
ధర్మమార్గాన జనుల కాదర్శమూచు
నిలిచినారలు షట్కర్మనిరతు లగుచు
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 759

గీ. రామ! ఈ రీతి సుప్రజారంజకముగ
విపుల దక్షిణలిచ్చి ఋత్విజులు మెచ్చ
అశ్వమేధాధికములైన యజ్ఞవితతి
ఆచరింపవె లోకకల్యాణ మెంచి. 760

గీ. ధర్మదేవత నాల్గుపాదముల నిల్పి
రామరాజ్యముఁ బోలెడి రాజ్యమెందు
గానఁ బోమన విపులవిఖ్యాతిగాంచి
ప్రాజ్యతరమైన మహిత సామ్రాజ్యమెల్ల
ఏలితివిగాదె పదునొక్క వేలయేండ్లు
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 761

## శ్రీరఘువీరునకు జేజేలు

కవిరాజ విరాజితము—

జయజయ! రావణ సంహర! ఘోరనిశాచరమర్దన! చాపధరా
జయజయ! రాఘవ! శ్యామలవిగ్రహ! సారసలోచన!
చంద్రముఖా!

జయజయ! పీన విశాలసమున్నత చారుభుజాంతర! సారభుజా!
జయజయ! పద్మజ శర్వశచీవర సన్మునిసన్నుత చారు పదా!
762

మాలిని:-

శ్లో. జయతు జయతు రామో జానకీ ప్రాణనాథః
జయతు జయతు లక్ష్మీవల్లభో లోకనాథః
జయతు జయతు రామో రావణారిర్మురారిః
జయతు జయతు పుంసాం మోహనః సార్వభౌమః. 763

## స్వస్తివాచకము (భరతవాక్యము)

చ. ప్రజలకు స్వస్తియౌత! పరిపాలక నాయకులెల్ల నీతిమై
ప్రజలను నేలుగాత! బహుభాగ్యచిరాయు రనామయస్థితిన్
ప్రజలు శుభంబులన్ గనుత భారతదేశము రామరాజ్యమై
సుజల సుసస్య వృక్షఫల శోభితమై అలరారుగావుతన్. 764

మంగళము :-

కోసలాత్మజా తనూజ! కోమలాంగ! మంగళం
దాసభూత పద్మజేంద్ర! దానవారి! మంగళం
భాసమాన కోటిసూర్యభవ్యతేజ! మంగళం
భూసతీ సుతానురాగ! భూషితాంగ! మంగళం
శ్రీసతీ నివాసవక్ష! శేషశాయి! మంగళం
అసురేంద్ర రావణారి! హారిపీర! మంగళం

వాసవాది దేవరక్ష! వారిజాక్ష! మంగళం
శాసితాఖిలేశ! రామ! సార్వభౌమ! మంగళం

ఫలశ్రుతి :-

పాయని భక్తి నిన్ను మది భావనచేయుచు రక్తి దీని పా
రాయణ చేయువారికి చిరాయురనామయ భోగభాగ్యముల్
శ్రీయును, త్యాగశీలమును, చిత్తవిశుద్ధియు, ధర్మబుద్ధియున్
మాయని కీర్తినిచ్చి మనుమా! గనుమా కరుణాపయోనిధీ!
సదమల భక్తిని దీనిని
చదివెడు వినువారికెల్ల సకల శుభంబుల్
సదమల భక్త్యాయున్సం
పదలును ఆరోగ్య భోగభాగ్యమ్ములిమ్మా!

సత్యం శివం సుందరం
శ్రీరామచంద్రార్పణమస్తు
శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

## కాండాంతగద్యము

శ్రీమదాకుంద్యన్వయపవిత్ర, ఆత్రేయసగోత్ర, మహాకవివేంకటకవి
ప్రపౌత్ర, జగన్నాథశాస్త్రిపౌత్ర, ఉద్దండపండితగోపాలశాస్త్రి
పుత్ర, విద్వజ్జనవిధేయ, ఉభయభాషాప్రవీణ-
సూర్యనారాయణశాస్త్రినామధేయ ప్రణీ
తంబయిన ప్రత్యక్షరామాయణ
మహాకావ్యంబున యుద్ధ
కాండము సర్వము
సమాప్తము
ఓం తత్ సత్
శ్రీరామచంద్రార్పణమస్తు

—o—

# సుందరకాండము

## తప్పొప్పుల పట్టిక



| పుట | పద్యము | పాదము | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|---|
| 27 | 112 | 4 | నుచి | నుంచి |
| 29 | 123 | 3 | కావితార్థ | కామితార్థ |
| 31 | 135 | 2 | రెడు | రెండు |
| 35 | 152 | 3 | రాగలడు | రాగలండు |
| 38 | 171 | 2 | పంగర్త | పంకగర్త |
| ,, | ,, | 3 | దశకఠు | దశకంఠు |
| ,, | 173 | 3 | యాసీత | యీసీత |
| 39 | 176 | 4 | తనువున | తనువును |
| 43 | 196 | 4 | శ్రీరఘువేరు | శ్రీరఘువీరు |
| 49 | 225 | 4 | అనుచు | అంచు |
| 56 | 258 | 2 | సిగ్గుగెంది | సిగ్గుచెంది |
| 58 | 268 | 2 | హానుమ | హనుమా ! |
| 61 | 286 | | వ్రేముడి | ప్రేముడి |
| ,, | 287 | 4 | దక్షింప | రక్షింప |
| 71 | హెడ్డింగ్ | 2 | రావణుద్దేశించి | రావణునుద్దేశించి |

# యుద్ధకాండము

| పుట | పద్యము | పాదము | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|---|
| 98 | 36 | 3 | అవ్వానంద్రుడు | అవ్వానరేంద్రుడు |
| ,, | 37 | 2 | ధనబు | ధనంబు |
| 101 | 53 | 3 | పరపర | పరంపర |
| 111 | 99 | 3 | చెద | చెంద |
| 111 | 101 | 1 | వసు | వస్తు |
| 113 | 111 | 2 | పంన | పంచ |
| 120 | 139 | 4 | కొదల | కొండల |
| 121 | 142 | 5 | నుడి | నుండి |

| పుట | పద్యము | పాదము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| ,, | ,, | 14 | చేయిచి | చేయించి |
| 124 | 148 | 2 | రామఘుఁడు | రామవిఘుఁడు |
| 136 | 207 | 3 | రణధీరు | రణధీరుల |
| ,, | 208 | 2 | వారిదం | వారిద |
| 112 | హెడ్డింగ్ | 1 | ఆంకపనుని | అకంపనుని |
| ,, | 211 | 1 | డతట | డంతట |
| 145 | 248 | 2 | చెరి | చెంది |
| 148 | 257 | 3 | లా | నా |
| 149 | 264 | 1 | వేరు | మేరు |
| 150 | 267 | 2 | ముగి | ముడిగి |
| 156 | 294 | 4 | ముసలము | ముసల |
| 158 | 299 | 2 | మూర్ఛితుడ | మూర్ఛితుండ |
| 159 | 303 | 3 | సంగము | సంగతము |
| ,, | 306 | 2 | భాదణ | భాషణ |
| 160 | 311 | 1 | లసగ | లడఁగ |
| ,, | 312 | 3 | జగముల్లెల్లను | జగములనెల్లను |
| 161 | 513 | 3 | డెవడొ | డెవండొ |
| 163 | 325 | 1 | బలబాలులు | బలశాలులు |
| 164 | 330 | 3 | గమ్మగన్ | గమ్మనన్ |
| 173 | 377 | 4 | కలిగుండగుచున్ | కలి తుండగుచున్ |
| 177 | 394 | 1 | గజనాజి | గజవాజి |
| 181 | 410 | 1 | జేయు | జేయ |
| 182 | 418 | 4 | గడచెన్ | గెడపెన్ |
| 185 | 431 | 2 | ఇంద్రజేత | ఇంద్రవిజేత |
| 187 | 435 | 3 | తపులై | తప్తులై |
| 189 | 442 | 1 | శరాప | శరాస |

| | | | | |
|---|---|---|---|---|
| 199 | 491 | 1 | వచ్చితోడ | వచ్చినతోడ |
| 200 | 497 | 4 | పెనగిగ దల | పెనగి గదల |
| 203 | 511 | 4 | ఉపదేసము | ఉపదేశము |
| 206 | 526 | 1 | కంపమొండగ | కంపమొందగ |
| 212 | 554 | 2 | మోంన | మూంన |
| 213 | 559 | 4 | వెనఁవేసి | వెనఁజేసి |
| 215 | 570 | 4 | దెన | వెన |
| 218 | 5'8 | 4 | లక్ష్మినిన్ | లక్ష్మికిన్ |
| 223 | 597 | 3 | సాధ | సాధు |
| ,, | ,, | 4 | కిల | కీలి |
| 225 | 605 | 2 | మందక | మందగ |
| ,, | దండకము | 8 | మాన | మాన |
| 229 | 614 | 3 | శంకరుడేగ | శంకరుండేగ |
| 231 | 620 | 1 | మీరభ్యంగ | మీరలభ్యంగ |
| ,, | 621 | 8 | వారిక | వారిగ |
| 233 | 628 | 3 | చారగణ | చారణగణ |
| 236 | 645 | 3 | స్వాగతము జనక | స్వాగతము నీకు జనక |
| 237 | 652 | 4 | అతను | అతఁడు |
| 238 | 655 | 2 | క్షేమిపై | క్షేమియై |
| 240 | 665 | 5 | నేమితు | నేమిత్తు |
| 241 | 669 | 1 | మాతలతోమన | మాటలు అమహా |
| 242 | 671 | 4 | వేదల | మేదల |
| ,, | 672 | 8 | మించె | మించ |
| 243 | 673 | 4 | కరమరుగైన | కరమరుదైన |
| 244 | 677 | 5 | భూమికెన్ | భూమికిన్ |
| ,, | 679 | 1 | పౌరుతనయి | పౌరుడనయి |
| 246 | 683 | 3 | నగమొగమ్మ | నగుమొగమ్మ |
| ,, | ,, | 3 | గంటిపుత్ర | గంటిని పుత్ర ! |

| | | | | |
|---|---|---|---|---|
| 247 | 286 | 3 | దొంగ | దొరగ |
| ,, | 689 | 2 | నీ | నీవునీ |
| ,, | 690 | 4 | పరాజితా | వందితా । |
| 248 | 692 | 1 | పరాము । | పరాక్రమ । |